# ప్రేమ్ సబ్బుతో స్నానం రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మరియు ఆకుపచ్చ
రంగులలో లభించును






జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783

# కొత్త పెళ్ళికూతురు తన అనుభవాన్ని చెబుతోంది. యవ్వనంలో ముఖంపై వచ్చే మొటిమలెలా పోతాయో చెబుతోంది.

*"యవ్వనంలో మొటిమలు రావడం సహజం
వాటిని శుభ్రంచేసి అదుపులో పెట్టడానికే ఎప్పుడూ క్లియరసిల్ వాడటం."*



**"నాకు 13 ఏళ్లొచ్చేసరికి మొటిమలు రావడం మొదలెట్టాయి...**
అయితే నేనంతగా పట్టించుకోలేదు. ఇంకొంచెం ఎదిగిన తర్వాత ఒక రోజున ఒక అబ్బాయి చూడటానికి వచ్చాడు నన్ను.

**మరి అతను చూసీ చూడటంతోనే నచ్చలేదన్నాడు**
నేనైతే కలలో గూడా అనుకోలేదు మొటిమలు యింత పనిచేస్తాయని, యిలా దారిలో అడ్డుకుంటాయని నా స్నేహితురాలు జయతో చెప్పానిది

**ఇక అప్పుడు జయ నాకు క్లియరసిల్‌తో ఒకదారి చూపించింది**
నేను క్లియరసిల్ రోజుకు రెండుసార్లు రాసుకోవడం మొదలెట్టా. క్రమం తప్పకుండా వాడుతూ వచ్చాను మరి తర్వాత ఒక రోజున ఏమైందంటే, నా స్నేహితురాలి యింట్లో అదే అబ్బాయి కలిశాడు, యిక అలాగే కన్ను ఆర్పకుండా చూస్తూ వుండిపోయాడు!"

**క్లియరసిల్ వేనిషింగ్ మెడికేషన్ మరియు క్లియరసిల్ స్కిన్ కలర్డ్ మెడికేషన్—యీ రెండూ తమ విశిష్టమైన త్రివిధ చర్యతో పనిచేస్తాయి**


1. మొటిమలను తెరుస్తాయి


2 మొటిమలను శుభ్రం చేస్తాయి


3. మొటిమలను ఆరబెడతాయి

**క్లియరసిల్‌కి ఇప్పుడొక తోడు!**
ఒకటైతే మీరెరిగిన క్లియరసిల్ స్కిన్ కలర్డ్ మెడికేషన్ మొటిమల్ని కనిపించకుండా చేస్తూ, తన ప్రభావాన్ని చూపిస్తుంది. మరొకటైతే, కొత్త క్లియరసిల్ వేనిషింగ్ మెడికేషన్ చర్మంలో కలిసిపోతుంది, రాసుకున్నట్టే కనిపించకుండాను, మరి తన ప్రభావాన్ని చూపిస్తుంది. అలంకరణతో సౌందర్యం, మందుకి మందూను.

**క్లియరసిల్ ప్రతి రోజూ రెండుసార్లు రాసుకోండి**
మొదట మీ ముఖాన్ని కడుక్కోండి ముఖం అంతటిపైనా క్లియరసిల్ రాసుకోండి, మొటిమలున్నచోట మరి కొంచెం ఎక్కువగా. మొటిమలు పోయిన తర్వాత గూడా క్లియరసిల్ రాసుకుంటూనే ఉండండి ఎందుకంటే క్లియరసిల్, చర్మంలో ఎక్కువగా గల నూనెని లాగేస్తుంది, తద్వారా మొటిమల్ని రాకుండా అదుపులో పెడుతుంది




**కొత్త వేనిషింగ్ మెడికేషన్**

**స్కిన్ కలర్డ్ మెడికేషన్**

## క్లియరసిల్ – ప్రపంచంలోని నం. 1 మొటిమల క్రీమ్

OBM-8625-B TEL

# ఉత్తరాలు

## కీర్తి నీకు జోహార్లు

"కీర్తి—నీకు జోహార్లు" ఎంతో ఔనత్యాన్ని సంతరించుకొంది. స్వార్థంతో నిండిపోయిన ఈ లోకంలో కేవలం చనిపోయిన ఆ శరీరం ఒక కవిని పోలిఉండడం, అది నక్కలపాలుగాకుండా దహనం చేయబూనిన శర్మగారు, అదే సమయంలో పాత నేస్తమని గుర్తించి నిజం పల్కలేకపోయిన శాస్త్రిగారు, కీర్తి కంఠూతితో దహనాన్కి ఏర్పాటు చేసిన వీరభద్రుడు, వారందరి నడుమ అమరలోకం వెళ్ళిపోయిన "ఆత్మ" .ఈ కథకు వన్నె తెచ్చాయి— రచయితగార్కి అభినందనలు —

వి. మురళివేణు, గజ్వేల్.

## హైదరాబాద్ నోట్ బుక్

9–3–84 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "హైద్రాబాద్ నోట్‌బుక్" అనే శీర్షికలో ఎ. పి. ఎస్. ఆర్. టి. సి ట్రాఫిక్ ఇనస్పెక్టరు శ్రీ సుల్తాన్ ఆలీ చీదా గారి గురించి వ్రాసిన వ్యాసం చదివి సామాన్య పౌరుడిగా తిరుమల రామచంద్రగారిని అభినందిస్తున్నాను.

నేను ఉద్యోగరీత్యా హైద్రాబాదులో యిరువది సంసత్సరాల నుండి ఉంటూ ఆర్. టి. సి. బస్సులోనే ఆఫీసుకు వెళ్ళి రావడం మూలాన్న శ్రీ సుల్తాన్ ఆలీచీదా గార్ని దాదాపు పది సంవత్సరాల నుండి చూస్తున్నాను. ఆయన నివాసం మలక్‌పేట అయి వుండవచ్చు ఒక్క గ్రామర్ స్కూల్ స్టాపులోనే కాదు ఏ బస్సులో ఆయన ప్రయాణిస్తున్నా ఆయన పద్ధతిలో మార్పులేదు.

గ్రామర్ స్కూలు బస్సుస్టాపులో సాయం కాలం ఆయన పనిచేసే తీరు చూడవలసిందే ఆయన నిలబడిన తర్వాత అచ్చట ప్రతి బస్సు ఎంతో కొంతమంది పిల్లలను కాని పెద్దవారిని కాని ఎక్కించుకొని వెళ్ళవలసిందే ఎంతటి పొగరుబోతు డ్రైవరు అయినా బస్సు ఆపి తీరాల్సిందే

శ్రీ చీదాగారి వయస్సు 51 సంవత్సరాలని వ్రాశారు. అంటే యింకొక 4 సంవత్సరాలకు ఉద్యోగ విరమణ చేయవలసిందే ఆ తర్వాత అచ్చట గ్రామరు స్కూలు బస్సుస్టాపులో చిన్న పిల్లల గతేమిటా అని వూహించుకుంటే చాలా బాధగా వుంది. ఇది స్వార్థంతో వ్రాసేదీ కాదు నా పిల్లలు కాలేజీ చదువులు పూర్తి చేశారు

"పిల్లలు క్షేమంగా ఇల్లు చేరకపోతే నాకు నిద్రపట్టదు." "అన్నం సయించదు." "నే నుండగా ఆడపిల్లలపై చేయి వేయడమా? కొంటెచూపులు చూడడమా? అన్ని గుండెలా!" పై మాటలే చెబుతాయి ఆయన కార్యదీక్ష మతమేదైనా, కులమేదైనా ఆయన ప్రభుభక్తి పరాయణుడు నిజాయితీపరుడు కర్తవ్య నిర్వహణకు, ఆత్మవిశ్వాసానికి, నిజాయితీకి ఎ. పి. ఎస్ ఆర్ టిసి. వారిచ్చినరూ॥ 1000 బహుమతి చంద్రునికో నూలుపోగు.

"నాకు కర్తవ్యం దేవుడు. సక్రమంగా నిర్వహించిన పుణ్యం, సంతృప్తి నాకు చాలు ఈ పిల్లలంతా భగవత్స్వరూపాలు వారి శుభా కాంక్షలు నాకు ఎప్పుడూ వుంటాయి. ఇంతకన్నా ఏమి కావాలి" మనిషిలో వుండే మానవత్వాన్ని పై మాటలు ఋజువుచేస్తాయి

"హైద్రాబాద్ నోట్‌బుక్" శీర్షికలో యిదివరకు, రచయితల గురించి, డాక్టర్ల గురించి, కళాకారుల గురించి వ్రాయడమేకాని, ఒక సామాన్య ఉద్యోగి— అదీ నిజాయితీ కర్తవ్య పరాయణకు అంకితమైన వ్యక్తి గురించి వ్రాసి పాఠకులనూ, ప్రత్యేకముగా హైద్రాబాదులో నివసించే గ్రామర్ స్కూలు పరిసరప్రాంతాలలోని ఇతర స్కూల్సులో జరిపే పిల్లల తల్లిదండ్రులు తెలుసుకోవలసిన వ్యక్తి గురించి వ్రాసినందుకు తిరుమల రామచంద్రగార్కి కృతజ్ఞతలు

శ్రీ సుల్తాన్ ఆలీ చీదా గారికి కర్తవ్య నిర్వహణలో ఎటువంటి అవాంఛనీయ సంఘటన జరుగకుండ సర్వ విధాల కాపాడుతూ ఉండాలని సర్వేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను.

మంతెన సీతారామరాజు, హైద్రాబాద్.

(74 వ పేజీ చూడండి)

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

*శివలెంక శంభుప్రసాద్*

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 6–4–'84

శ్రీ రక్తాక్షినామ సం. చైత్ర శు. పంచమి

**సంపుటము 76 : సంచిక 30**

సంపాదకుడు :

*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు. 1-80

ఆరు మాసాల చందా రు. 46-80

పోస్ట్‌లో ఏడాదిచందా రు. 101-40

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక


ముఖచిత్రం :

నటి మాధవి

(ఫొటో : ఎస్. ఆర్. డి. మూర్తి)

*కథలు :*

గెలుపెవరిది ? .. 16

పండుటాకు — పసిచిగురు .. 29

జర్నీ ... 50

మనిషిలో మరో మనిషి ... 62

*సీరియల్ నవలలు :*

వెలుగు—నీడ (ప్రారంభం !) ... 10

కర్మయోగి .. 22

ఈరాగాని కదేతాళం . 40

గోరంత దీపం . 56

*వ్యాసాలు, శీర్షికలు :*

ఉత్తరాలు — 4, లోకంపోకడ—5, మ్యాడిల్లీలేఖ — 6, భగవాన్ శ్రీ రమణ మహర్షి — 8, వారఫలం, వ్యక్తిగతం—15, ఇ'వేమన' పద్యాలు—19, రామతీర్థం—20, డాక్టర్ సలహాలు—28, ప్రభుత్వోద్యోగులు త్యాగముచూపవలెను—31, సరాగమాల—33, సినిమా — 35, ప్రశ్నావళి — 49, ఫాలాకుని డైరీ—61, ధర్మపథం — 66, వంటలు—68, మృత్యుంజయేశ్వరుడు—70, హైదరాబాద్ నోట్‌బుక్ — 72.


## లోకం పోకడ — ఊశిమెన్



# అంతూలే - థాచర్ - గాంధీ

అబ్దుల్ రెహమాన్ అంతూలే నేరుగా అరేబియా రాత్రి కథలలోనుంచి ఊడిపడ్డ మనిషి — ఆయన కదలికలు వింతగా ఉంటాయి— ఎప్పుడు ఎక్కడ కనపడుతాడో తెలీదు ఎక్కడ మాయమవుతాడో తెలీదు ఏవో ఎత్తులు, ఏవో కుట్రలు ఇందుగలడందులేడనలేము పెద్దా, చిన్నా సాహసాలు ఎన్నయినా ఉంటాయి ఇంత దాకా ఆయన్ని నేను కలవలేదు అందుకనే అనుకుంటూ ఉంటాను అసలు అంతూలే లనే వ్యక్తి ఉన్నాడా ? అని లేడే లనుకోండి, లంతూలేని సృష్టించక తప్పదు అంతూలే లేని భారతీయ రాజకీయాలు చప్పగా ఉంటాయి అత్యవసర పరిస్థితి లేదా ఎమర్జెన్సీ రాకముందు రాజకీయాలు అలాగే ఉండేవి 1975 జూన్‌లో మొదలయిన వరదలో పాములు కొట్టుకువచ్చినట్లు కొట్టుకువచ్చారు ఎందరో అంతూలేలాంటివాళ్ళు

తను జెయిలుకి వెళ్ళవలసివస్తుందేమోనన్న అనుమానం హటాత్తుగా అంతూలేకి కలిగినట్లుంది దానితో ఆయనకే ఆయన స్నేహితులకీ మతిపోయిందనిపిస్తుంది ప్రజా సేవకులని అవినీతి విచారణకి గురిచెయ్యరాదంటూ ఒక ఆర్డినెన్సు కావాలని వాళ్ళు అంటున్నారు సుప్రీమ్‌కోర్టు వారేమో శాసనసభ్యులు ప్రజా సేవకులుకారు, అంటున్నారు ఎవరయినా ఎవరి మీదనయినా దావా వెయ్యవచ్చునని సుప్రీమ్‌కోర్టు అభిప్రాయం అన్నమాట తప్పు చెయ్యకపోతే ఇంత కంగారు ఎందుకు ? "నేను ఏమిచేసినా పార్టీకోసమే" అనిఅంతూలేగారు వాదిస్తున్నాడు ఇక్కడ పార్టీ అంటే శ్రీమతి గాంధీయే "జైలులో శిక్ష అనుభవించి వస్తాను, త్యాగం చేసిన వాడిని అవుతాను ఏడేళ్ళ కారాగృహవాసమయినా ఫరవా లేదు" అని శ్రీ అంతూలే అంటున్నాడు ఆయనది లాయరు వృత్తి చట్టం తెలిసే ఇదంతా చెబుతున్నాడని అనుకోవాలి అవినీతి, కారాగారవాసం— ఇవి రెండూ లాయరులకి అపరిచితమైనవికావు కదా !

ఇంకోదేశంలో అయితే ఇలాంటి మనుషులు మాయమయి అజ్ఞాతవాసంలో ఉండిపోయేవాళ్ళు కాని భారతదేశంలో రాజకీయ వాదుల చర్మాలు చాలా దళసరివి ఈ మధ్యనే పార్లమెంటులో కొందరు సభ్యులు తమకి మారుతి కారు కేటాయింపులు కావాలన్నారు మాజీ పార్లమెంటు సభ్యులకి సయితం కారు కేటాయింపులు కావాలి, అని ఎవరో అన్నారు నాకు తెలిసినంత దాకా పార్లమెంటు సభ్యులందరికీ కారులు ఉన్నాయి బూర్జువాటులూ, జర్నలిస్టులకీ వచ్చినట్లే వాళ్ళకీ ముందు కేటాయింపులు ఇస్తారు ఒక కారులే కాదు, అన్నీను— సిమెంటు నుంచి విదేశీమారకం దాకా బూర్జువాట్లలాగే పార్లమెంటు సభ్యులకీ కొరతలు బాగా ఎరికి వస్తాయనుకుంటూ ఉంటాను అప్పుడప్పుడు

ఒక ప్రజాస్వామ్యంలో మంత్రికీ, శాసన సభ్యుడికీ ప్రత్యేకమయిన హక్కులు ఉండవచ్చునా? ఇంగ్లాండుని గురించి ఏమనుకున్నా అక్కడి వాళ్ళు రాజకీయవాదులని నెత్తిమీద పెట్టుకుని పూజ చెయ్యరని మాత్రం అనుకుని తీరాలి

రెండవ యుద్ధం అంతం అయిన అనతి కాలంలోనే నేను ఇంగ్లాండులో చదువుకుంటూ ఉండేవాడిని అప్పటిలో లేబరుపార్టీ అధికారంలో ఉండేది శని ఆదివారాల సెలవులకి ఒకసారి లండన్ దగ్గరే ఉన్న ఒక చిన్న గ్రామంలో ఒక స్నేహితుడి ఇంటికి వెళ్ళాను అవి రేషను రోజులు గుడ్లు, వెన్న, చక్కెర, చెప్పులు, తువ్వాళ్ళు, దుప్పట్లు — ఒకటేమిటి, అన్నీను ఆ చలి దేశంలో బొగ్గు లేకుండా ఉండలేము దీనికీ రేషను ఉండేది రొట్టె కొనుక్కోవాలంటే కూపనులు కావాలి నేనూ, నా స్నేహితుడూ ఒక చేపల అంగడికి వెళ్ళాము— చేపలూ, బంగాళదుంప వేపడం, ముక్కలూ కొనుక్కోవటానికి మేము వెళ్ళేసరికి ఒక పొడుగాటి 'క్యూ' ఉంది నా ముందర ఒక ముసలాయన నుంచుని ఉన్నాడు ఆయన మొహం ఎక్కడో చూసినట్లనిపించింది నాకు కాని ఎవరో వెంటనే జ్ఞాపకంరాలేదు ఆయనతో ఒక చిన్నబ్బాయి కూడా ఉన్నాడు మనవడు



అబ్దుల్ రెహమాన్ అంతూలే




కాబోలు ఇద్దరూ క్రికెట్‌ని గురించీ చాకొలెట్లని గురించీ మాట్లాడుకుంటున్నారు కొంతసేపటితర్వాత ఆ వృద్ధుడిని గుర్తుపట్టగలిగాను ఆయన ఎవరోకాదు లార్డ్ పెథిక్ లారెన్స్ ఆయనే బ్రిటిషు సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫార్ ఇండియా ! అంతకి ముందే భారత దేశానికి తమ మంత్రివర్గం, పని మీద వెళ్ళి వచ్చాడు లార్డ్ పెథిక్ లారెన్స్ కళ్ళు నీలంగా ఉండేవి, జుట్టు తెల్లగా ఉండేది చేతిలో ఒక పాత పత్రిక పట్టుకుని ఉన్నాడు తన వంతు రాగానే ఆ పత్రికని అంగడిలో మనిషికి ఇస్తే ఆ వ్యక్తి ఆ పత్రికలో చేపలూ, బంగాళాదుంప ముక్కలూ పెట్టి ఇచ్చాడు ఆ తరువాత ఆ చిన్న అబ్బాయీ, ఆయనా నడిచి వెళ్ళిపోయారు వాళ్ళ రాత్రి భోజనం ఆ చేపలూ బంగాళాదుంప వేపడమూ మాత్రమే అయి ఉంటుంది లార్డ్ పెథిక్‌లారెన్స్ బ్రిటిషు ప్రభుత్వంలో మంత్రి భారతదేశం ఆయనకింద ఉండేది బ్రిటిషు రాజకిరీటంలోని రత్నాలలో భారత రత్నమే అతి ఉజ్వలమయినది అంత పెద్దమనిషి ఒక సామాన్యుడిలాగ క్యూలో నుంచున్నాడు ఆయన కారులో రాలేదు ఆయన చుట్టూ రక్షకభటులు లేరు ఏ ఆర్భాటమూ లేదు కొత్తఢిల్లీలోని వయిస్‌రాయి ఈయన కింద పనిచేసేవాడే ఆ వయిస్‌రాయిగారు తమ రాజప్రాసాదంలో దర్జాగా చికెన్, కుక్కగొడుగులూ సేవిస్తూ ఉంటే ఆయన పయి అధికారి అయిన లార్డ్ పెథిక్‌లారెన్స్ క్యూలో నుంచుని చేపలు, బంగాళాదుంపల భోజనం కొనుక్కుంటున్నాడన్న మాట

నేను పోయిన ఏడాది లండన్‌లోనే ఉన్నాను మేము అలాగ డవునింగ్ స్ట్రీట్‌కి నడచి వెళ్ళాము ఈ వీధిలోనే బ్రిటన్ ప్రధాని ఇల్లు ఉంటుంది

ఈ వీధి వెడల్పు మహా ఉంటే 30 అడుగులు ఉంటుంది పొడుగు ఒక ఫర్లాంగు ఉండవచ్చు 10 వ అంకెగల ప్రధాని ఇల్లు వీధికి ఒక చివరగా ఉంటుంది అది అంత పెద్ద ఇల్లేమీ కాదు భారత రాజధానిలోని జోర్‌బాగ్, సుందర్ నగర్‌లోని ఎన్నో ఇళ్లకన్నా చిన్న ఇల్లే ఇది ఒక వ్యాపారి ఇల్లా లేకపోతే ప్రధానమంత్రి ఇల్లా ? అనిపిస్తుంది దానిని చూడగానే వీధివయిపు దగ్గర ఒక పోలీసు నుంచుని ఉంటాడు వింత చూడటానికి వచ్చే టూరిస్టులు వీధికి అవతల పక్క పోగవుతూ ఉంటారు ఆ రోజున నేనూ నా భార్య అక్కడికి చేరుకున్నప్పుడు పదిమంది ఉన్నారేమో, అంతే మనదేశంలోలాగ వాకీటాకీలు పట్టుకున్న పోలీసులు కనిపించరు, జీపులనిండా సాయుధ రక్షక భటులు కనిపించరు, మన ప్రధాన మంత్రి ఇంటి పక్కగా వెళ్ళి చూస్తే తేడా బాగా తెలుస్తుంది ప్రభుత్వం యొక్క కేంద్ర కార్యాలయం వయిట్ హాల్ అనేచోట ఉంటుంది పార్లమెంటు ఇక్కడికి అరమైలు ఉంటే ఉండవచ్చు ఎందరో మంత్రులు వయిట్‌హాల్‌నుంచి పార్లమెంటు నుంచి నడిచిరావటం నేనుచూసాను ఇక పార్లమెంటు బయట లేబరు పార్టీ సభ్యులు బస్సుల కోసం క్యూలో నుంచుని ఉండటమూ నేను చూశాను

ప్రజాస్వామ్యంలో వ్యత్యాసాలు తగ్గాలి బ్రిటన్‌లో శ్రీమతి థాచర్‌కన్నా ఎక్కువ అధికారంకల ఆవిడ ఇంకెవరూ లేరు కాని ఆవిడ దిగుమతి లయిసెన్సులనీ, సిమెంటు కోటాలనీ, కారు కేటాయింపులనీ పంచుతూ కూర్చోరుకదా? ఈమధ్యనే ఆవిడ ఒమాన్ అనేచోట తమ కుమారుడికి ఒక కాంట్రాక్టు ఇప్పించారన్న ఆరోపణ వచ్చింది ఆ ఆరోపణ వచ్చినప్పుడు ఆమె పార్లమెంటులో సంజాయిషీ చెప్పుకోక తప్పలేదు ఆవిడ తనమీద అవినీతి ఆరోపణలు ఉండరాదంటూ ఒక ఆర్డినెన్సు జారీ చెయ్యమని రాణికి మహాజరుల ద్వారా అర్జీలు పెట్టుకున్నారా ? లేదే ! ఒకవేళ ఆవిడ అలాంటి పని ఏదయినా చేసి ఉంటే కుళ్ళిన టొమాటోలూ, ఇంకా ఏవో కూరగాయలూ మీదపడి ఉండేవి ! భారతదేశంలో అంతూలేగారిలాంటి వ్యక్తులు అవినీతిపరులు కావటమే కాకుండా బిడియం లేకుండా వ్యవహరిస్తున్నారు వాళ్లకి కావలసిన దల్లా సుఖమయ జీవితం మాత్రమే తాము ఏమి చేసినా చెల్లుతుందని వాళ్ల ధైర్యం వాళ్లకి ఆ ధైర్యం ఎందుకు ఉండదూ ? వాళ్ల నాయకులూ అంతేకదా ? శ్రీమతి గాంధీ ఎన్నిక కేసుపోతే ఆవిడ రాజ్యాంగాన్నే మార్పించారు అంతూలేగారు మాత్రం తక్కువ తిన్నారా ? ఇంతకీ ఆయన కోరేది ఏమిటి ? చట్టంలో చిన్న మార్పు ఒక్కటే కదా ? ఇన్ని మార్పులలో ఈ మార్పు ఏపాటి ? ★

# భగవాన్ శ్రీరమణ మహర్షి



ఏ మహిమలు, మహాత్మ్యలు చూపక సామాన్యమైన జీవితం గడిపి అసాధారణమైన ప్రశస్తిని పొందగలిగే మహర్షులు చాల అరుదు అట్టివారు మన భారతీయ సంస్కృతిలో అక్కడక్కడా మణిదీపాల్లా తారసపడతారు వారిలో రమణ మహర్షి ఒకరు భగవాన్ అనే ప్రత్యయం ఆ మనీషిలో పరంధాముని చూడగలిగే సంస్కారం అందించేది ప్రాపంచిక భోగలాలసత పట్ల లేశమాత్రమైనా ఆసక్తి కనబరచని కర్మ ఫలత్యాగి ఈ యోగి వేదాంత యదార్థాన్ని దర్శించిన ప్రత్యక్ష సాక్షి ఈ మహా మనీషి

వేద వేదాంగాలు చదవలేదు సకల శాస్త్రాలను ఆపోసన చేయలేదు నానాకాలం చదువు తెలిసీ తెలియని అక్షరజ్ఞానం ఇష్టం లేకుండా చదువుతున్నట్లు నటించడం దండగని తలపోసి అతి చిన్నవయసులోనే పరివ్రాజకుడై నేనెందుకు, నేనెవరిని, ఈ విశ్వమేమిటి, విశ్వ భవుడెవరు అన్న ప్రశ్నలు వేసుకొని అమూహ్యమైన ఆత్మ సంస్కారంతో సనాతన ధర్మసారాన్ని అరచేత నిలుపుకొన్న మహామేధావి, బుద్ధిశాలి అయ్యాడు తనకుగా తాను ఏమీ చెప్పలేదు ఏదీరాయలేదు అయితే ఎందరెందరి సందేహాలనో నివృత్తి చేసాడు వారి కోసమే అరకొరిగా రాసానని ఆయనే చెప్పుకున్నాడు మానవుని మనుగడపై నలభై తమిళగీతాలను, ఆదిశంకరాచార్యుల వారి వివేక చూడామణి, ఆత్మబోధ సంస్కృత కావ్యాలకు తమిళ వ్యాఖ్యానాలను ఆయన వెలువరించారు సంస్కృతం, తెలుగు, తమిళం భాషలలో అతనికి కొద్దిపాటి ప్రవేశం మాత్రమే ఉంది అయితే ఏం అలతి, పొలతి పదాల లోనే అనల్పార్థాన్ని, జీవితద్పృక్పథాన్ని, మానవ గమన లక్ష్యాన్ని సుస్పష్టంగా వివరించి చెప్ప గల ప్రతిభ ఉన్నది అది అరుణాచలేశ్వరుని అనుగ్రహమని ఆయన బలమైన నమ్మకం నాదేపాటి, నేనెంత అనే అతని ధోరణి ఎంతో ఆశ్చర్యాన్ని రేకెత్తింపజేస్తుంది

రమణ మహర్షి స్వస్థలమైన తిరుక్కుళై తమిళనాడులోని మధురైకు ముప్పై మైళ్ల దూరంలో దక్షిణంగా ఉంది క్రీ శ 1879 డిసెంబరు 30 వ తేదీన ఆర్ద్ర దర్శనంనాడు రమణ మహర్షి సుందరంఅయ్యర్, అలగమ్మాళ్ పుణ్యదంపతులకు జన్మించాడు ఆ తిథి నాడు నటరాజస్వామికి మహోత్సవం! అదేరోజు రమణ మహర్షి అవతరించడం విశేషం తండ్రి చినవాడే పరమపదించడంతో ఊరు మారక తప్పింది కాదు బాబాయి సుబ్బయ్యార్ చలువ వల్ల



స్కాట్ మాధ్యమిక పాఠశాలలోను, అమెరికన్ మిషన్ ఉన్నత పాఠశాలలోను చదువు కోవడం జరిగింది అయితే ఆ చదువు అంతంత మాత్రమే ఏ మాత్రం ప్రతిభను కూడ ప్రదర్శించక, ఎవరితోనూ కలియక ఒంటరిగా ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు ఎంతమందినైనా ఏకధాటిగా కొట్టగలిగే అతని శరీరధాటిని గురించి పదిమందీ చెప్పుకునేవారు శివభక్తుల నుద్దేశించిన పెరియ పురాణం రమణుని మహర్షిని చేసిందని చెప్పవచ్చు అరుణాచలం కేవలం మిష మాత్రమే ఆలోచన అధికమయ్యే కొద్దీ ముముక్షువులక్షణాలు అలవడ సాగినాయి విధి అతనిని నడిపించింది ఎవరికీ చెప్పక ఊరు వదలిపెట్టి విళ్లుపురం దగ్గరలో ఉన్నతిరువణ్ణామలై చేరుకొన్నాడు అతని ఆరాధ్య దైవమైన అరుణాచలేశ్వరుడు వెలసి ఉన్నది అక్కడే కదా మరి! ఈ సంఘటన క్రీ శ 1896లో జరిగింది అప్పటి నుంచీ అతడు సన్యాసి సర్వసంగపరిత్యాగి వశిష్ఠమ్, కైవల్య నవనీతమ్ వంటి గ్రంథాలు చదువుతూ నిరంతరం ధ్యానంలో గడిపేవాడు తల్లి రమ్మని పిలిచినా వెళ్లక, ఆమెలో కూడ పరివర్తన కలిగించి మానవ జీవితంలోని నిమిత్త మాత్రాన్ని సున్నితంగా వివరించగలిగాడు ఇక్కడ ఆది శంకరుడు గుర్తుకు వస్తాడు

గొప్ప విద్వాంసుడు, సనాతన ధర్మ పరాయణుడు అయిన గణపతిముని రమణ మహర్షిని నాయనా! అని సంబోధించేవాడు భారతీదేవి వరపుత్రుడైన గణపతిముని కావ్య కందుడు అంతటివానికి అర్థంకాని తపస్సు రమణ మహర్షి చేతిలో ఒలిచిన అరటి పండైపోయింది నేను, నాదీ అనే అహంభావాన్ని వదిలిపెడితే మనస్సు, ఆత్మ, శరీరం ఎక్కడ కేంద్రీకృత మవుతాయో, ఆ కేంద్రీకృత రూపంకాని, శబ్దంకాని ధ్యానంకాని, మౌనంకాని, గానంకాని తపస్సనే పిలవబడుతుంది ఎంత చక్కటి వివరణ! అందుకే గణపతి ముని అంతటివాడే రమణుని భగవాన్! అని సంబోధించి రమణ గీతను విరచించాడు క్రీ శ 1911 లో హంఫ్రీస్ అనే పాశ్చాత్యుడు రమణుని సందర్శించి "కాంతి వంతమైన అతని కళ్ళు, జిగిమాయని చిరునవ్వు సమస్త దుఃఖాలను హరించి వేస్తాయి అతని దర్శనమాత్రంతోనే నాలో వినూతనమైన ఏదో ఉరవడి కలిగింది" అని వ్యాఖ్యానించినాడు రమణునికి 1949వ సంవత్సరంలో ఆశ్రమం ఏర్పడింది అంటే తిరువణ్ణామలైలో పాతికేళ్ళు గడిపాకే రమణాశ్రయం రూపొందిందన్నమాట! ఆ ఆశ్రమంలో అతని తల్లి సమాధి కూడా ఉంది!

రమణుని ప్రేమ అనంతం అపరిమితం దొంగ సాధువని ఎవరు గేలి చేసినా చిరునవ్వు నవ్వేవాడు క్రీ శ 1924న రెండు మారులు దొంగలు ఆశ్రమాన్ని దోచుకొని రమణునికి దేహశుద్ధి చేసిపోయారు "అరుణాచలేశ్వరునికి నేను పూజ చేస్తాను మరి నాకెవరు చేస్తారు అందుకే దొంగలు నాకు పూజచేసి పోయారు" అని నవ్వుతూ చెప్పాడట! పశుపక్ష్యాదులపట్ల ఎంతో ప్రేమను కనబరచేవారు ఒకసారి ఒక సేవకుడు పిచ్చుక గూటిని పగలకొడితే పిచ్చుకల జంట వెళ్లి రమణునికి విన్నవించుకొన్నాయి వాటి భాష తెలిసిన రమణుడు సేవకుని మందలించి వాటికి మరో గూడు చూపాడట! ఈ దృశ్యాన్ని కళ్ళారా చూశానని, రమణమహర్షి పవిత్రమైన భారతీయ ఋషి పుంగవుడని మన మాజీ ప్రధాని, ఏ విషయాన్ని ఒక పట్టాన ఒప్పుకోని మొండి వ్యక్తి, ఎన్నో విషయాలు తెలిసిన గాంధేయవాది అయిన మొరార్జీదేశాయ్ ఇటీవలే ఒక ఇంటర్వ్యూలో చెప్పారు క్రీ శ 1948 లో మొదలైన సార్కోమా అనే క్యాన్సర్ వ్యాధి రమణుని రెండు సంవత్సరాలపాటు వేధించి చివరకు బలిగొంది నిశ్చింతగా నిబ్బరంగా 14 ఏప్రియల్ 1950 రాత్రి 8 గం 47 ని లకు శాశ్వత నిద్రకు ఉపక్రమించాడు రమణుడు ఎంతోమంది నేటికీ ఆ ఆశ్రమంలో స్వాంతన పొందుతునే ఉన్నారు రమణుని స్తుతిస్తూనే ఉన్నారు అలా ఆ మహర్షి చిరంజీవిగా నిలిచే ఉంటాడు

—డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

కొత్త సీరియల్ ప్రారంభం !

# వెలుగు-నీడ

ఇచ్ఛాపురపు రామచంద్రం

## మహానగరంలో... పేరు పొందిన చలనచిత్ర ప్రదర్శనశాల.

సువిశాలమయిన వెయిటింగ్ హాలు. డిస్టెంపరుతో గోడలూ, డిజైన్లతో పైకప్పూ మెరిసిపోతున్నాయి.

సీలింగు నుంచి చాండిలియెర్స్ వేలాడుతున్నాయి. గుత్తులు గుత్తులుగా – వెలుగుతున్న విద్యుత్ దీపాలు – వింత పువ్వులలో ఉన్నాయి.

ప్రేక్షకులు ఆ హాలులోంచి థియేటర్‌లోకి నడచి వెళ్తున్నారు హాలులో సోఫాలో కూర్చున్న స్త్రీ - వెళ్తున్న వారందరిన్నీ పట్టి పట్టి చూస్తోంది. యువకుల నయితే మరీ మరీ చూస్తోంది ఆత్రంగా, ఆశగా

అందరినీ అలా గమనిస్తున్న ఆమెకు తెలియదు – తననీ కొందరతి నిశితంగా పరికిస్తున్నారని. ఆమెకు తన లోకమే తప్ప యింకేమీ అవసరమున్నట్లు లేదు. ఆమె అలాగ ఎంత సేపటినుంచి చూస్తోందో !

"అమ్మా !"

ఆమె ఉలిక్కి పడింది. కోపంగా పక్కకి తిరిగి చూసింది.

"లతికా ! అలా పిలవొద్దని చెప్పలేదూ?" ఆమె వదనం ఎర్రబడింది.

"ఇక పిలవనులెండి. ఇంటికి 'పోదాం రండి ...'' అంటూ ఆమె చేయి అందుకుని నడిపించబోయింది లతిక.

"అప్పుడేనా ? బాబు..."

"ప్లీజ్... మీరు చాలా అలసిపోయారు. ఒక్కసారి అద్దంలో చూసుకుంటే మీకే తెలుస్తుంది. ఇవాళ్టికి అన్వేషణ చాలు. చూడండి .. అందరూ మనవంక ఎలా చూస్తున్నారో ! మీరింకా యిక్కడే ఉంటే .. వాళ్ళు మిమ్మల్ని గుర్తుపడతారు దానితో– ప్రమాదం సంభవిస్తుంది–" బెదిరిస్తున్నట్లే అంది లతిక.

ఆ మాటతో ఆమె లేచి – లతిక చేయి పట్టుకుని నడవసాగింది. ఇద్దరూ థియేటర్ ముందు –. పార్కింగ్ ప్లేస్‌లోకి వొచ్చారు. అక్కడ – ప్లిమత్‌కారు వీరికోసమే అన్నట్లు ఎదురు చూస్తోంది.

కారెక్కి కూర్చున్నాక–ఫక్కున నవ్విందామె "లతికా ! ఏమన్నావిందాకా ? జనం– నన్ను గుర్తుపడితే... ప్రమాదం సంభవిస్తుందనా?" కెరటాలలా సాగిందామె నవ్వు ఓ నిముషం

కారు మెత్తగా పరుగెడుతోంది.

ఆ నవ్వు– లతికకి భయం గొల్పింది. ఆమె నవ్వినా... ఏం చేసినా... ఏమీ చేయక పోయినా ... లతికకామెను చూస్తే భయమే వేస్తోంది కొన్నాళ్ళనుంచీ

ఇప్పుడేం జవాబు చెప్పినా పరిస్థితి చాలా విషమిస్తుందని గ్రహించినట్లు ఆమె మౌనంగా ఉండిపోయింది డ్రయివింగ్ మీద దృష్టినంతటినీ కేంద్రీకరించినట్లు.

ఆమె–తల బయటకు పెట్టి రోడ్డుమీద వెళ్ళే వారిని చూస్తోంది. అది–అద్దంలోంచి చూసిన లతిక నిశ్శబ్దంగా నిట్టూర్చింది.

ఈమెకు మతి చలించదు కద త్వరలో ?

ఆమె–వొణికిపోయింది.

వొద్దు వొద్దు అలా జరగకూడదు.

భగవంతుడా!...ఈ అమాయకురాలిని... ఈ అభాగ్యురాలిని...కరుణించు. ఈమె చేసింది నేరమే అయినా యీమెను మన్నించు. ఆమెకు కొంచెం మనిశ్శాంతిని ప్రసాదించు. ఈ అర్థం లేని అన్వేషణలో పిచ్చిదాన్ని కానివ్వకు.

"నా వెర్రికాని – నా బాబుకేం కర్మ రోడ్డుమీద సామాన్యుడిలా నడవడానికి ? దర్జాగా కారులో వెడతాడు ఎక్కడికి వెళ్ళాలన్నా...ఔను కదూ లతికా?" వెనుక సీట్లోంచి హటాత్తుగా ముందుకి వాలి–లతిక భుజాలు పట్టి కుదుపుతూ అడిగిందామె.

అనుకోని ఆ సంఘటనకు లతిక తెల్లబోయింది. ఆమె చేతిలోని స్టీరింగ్ – అదుపు తప్పింది. కారు ఓ యువకుణ్ణి డాష్ చేయబోయేదే కాని – అదృష్టవశాత్తూ ఆశ్చర్యకరంగా– విచిత్రంగా– ప్రమాదం తప్పింది

ప్రతుటిలో. ఆ యువకుడు తిట్లకు లంకించుకుని, డ్రయివ్ చేస్తున్నది స్త్రీ అని గ్రహించగానే— సున్నితంగా మందలించి— వొదిలేసి— తనదారిన పోయాడు.

కారు— హోటల్ ముందాగింది.

''రండమ్మా ...'' అంటూ లతిక ఆమె చేయందుకుంది. లిఫ్ట్‌లోనూ... లాంజ్‌లోనూ.. ఆమె కళ్ళు నిర్విరామంగా దేని గురించో... ఎవరి గురించో వెదుకుతూనే ఉన్నాయి.



''స్నానంచేసి రండి. ఈలోగా అన్నీ అమరుస్తాను.''

''ప్చ్... అలసిపోయాను చాలా. తరువాత స్నానం చేస్తాను కానీ.. ముందు..'' బ్రతిమాలు తున్నట్లే అందామె అతి దీనంగా ముఖం పెట్టి.

మామూలుగా అయితే ఆ అభ్యర్థన కెవరయినా కరిగి నీరవలసిందే. కాని... ఇప్పుడలాగ లొంగిపోతే ఏమౌతుందో లతికకి అనుభవ పూర్వకంగా తెలుసు.

''ఎంతసేపు ? ఐ దు ని ము షా లు .. బాత్‌రూమ్‌లో అన్నీ సిద్ధం చేశాను. పోనీ . నేను వొచ్చి స్నానం చేయించేసేదా ?''

ఆమెకు తీవ్రమైన కోపం వొచ్చేసిం దొక్కసారి.

''నన్నిలా ఎదిరించటానికీ, బాధ పెట్టడానికీ నువ్వెవరివి ?'' అరిచినంత పని చేసింది.

''ఫ్రండ్... ఫిలాసఫర్... అండ్ గైడ్‌ని '' అంది లతిక నవ్వేస్తూ.

''కాదు. మొండివి. నా పాలిటి శిఖండివి'' అంటూ ఆమె బాత్‌రూమ్‌వేపు నడవసాగింది.

''నేను ... పొరపాటే చేశాను . . ఒకటేమిటి .. చాలాను. అసలు నా జీవితమే పెద్ద పొరపాటు . . '' అంటూ ఆమె బాత్‌రూమ్‌లోకి వెళ్లి తలుపు వేసేసుకుంది.

*    *    *

''ఎవరు నువ్వు ?''

నివ్వెరపోయింది జానకి ఆ ప్రశ్న వింటూనే. ఆమె కలలూ ఊహలూ ఆ వొక్క ప్రశ్నతోనే చెదిరిపోయినట్లనిపించింది

ఇక్కడికి రావడానికి తను చేసిన సాహసాలు, త్యాగాలు . అన్నీ నిష్ఫలమైపోతాయా అని క్షణంసేపు గిలగిల కొట్టుకుపోయింది. అయినా ఎలాగో కూడదీసుకుని మెల్లగా జవాబు చెప్పింది. ''నా పేరు జానకి . '' కంఠంలో వొణుకు. అదంతా భయం వల్లనేకాదు . . ఆనందం. హృదయం పట్టనంత ఆనందోద్వేగాలు. ఎన్నేళ్లో కలలుకన్న మనిషిని . . ఊహ . దేవతని ... ఎదురుగా .. తొలిసారిగా .. చూసేసరికి కలిగే తొట్రుపాటు. ఆనందాతిరేకం.

''ఊఁ .. ఎందుకొచ్చావ్ ?''

''పదేళ్ల నుంచీ నేను మీ అభిమానిని. నిజం చెప్పాలంటే ...''

''కూర్చో. నిజమే చెప్పు ''

''మీరంటే నాకు వెఱ్ఱి అభిమానం. పిచ్చి ప్రేమ. మీరు— నా ప్రాణం...''

ఆమె నవ్వింది— అందంగా, హేళనగా. ''మంచిది.''

''మిమ్మల్ని చూడాలని వచ్చాను.''

''చూశావుగా.'' ఇక వెళ్ళు అన్నట్లు ధ్వనించిందామె కంఠం. జానకికి మతి పోతూం దామె అందం చూస్తూంటే. మహానటి చంచల— తెరమీద కంటె ఎక్కువ అందంగా ఉందే యింట్లో! ఈమె అందమంతా తెరమీదికి రాదేం? కామెరాకే పట్టనంత సౌందర్యం! ఏమో.

''నేనూ నటినే...'' అంది జానకి— మెల్లగా; సిగ్గుపడుతున్నట్లుగా. ఔను. రతీదేవి ముందు— తానూ అందగత్తెనే అనీ; చంచల ముందు తానూ నటినే అనీ చెప్పబోవడం— సూర్యుడికి దీపాన్ని చూపించడమే ఔతుంది.

''ఓహో!''— హేళనగానే అంది చంచల. ''ఆంధ్ర దేశంలో నటీమణుల కేమీ లోటు లేదు.''

''నేను అందమయిన దాన్నే అనుకుంటాను. మీరొక్కసారి నన్ను చూసి చెప్పండి.''

''నిన్ను మించిన అందగత్తెలు యీ మద్రాసులో వేలకొద్దీ ఉన్నారు.'' పుల్ల విరిచి పొయ్యిలో పెట్టినట్లే అంది చంచల.

''నేనూ నటినౌదామని ... మీలాగ మహా

# వెలుగు - నీడ

నటిని కాకపోయినా...'' ఎలాగో చెప్పింది -- యావచ్ఛక్తినీ కూడదీసుకుని; సిగ్గునీ—ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌నీ ఓ క్షణం జయించి.

ఆమె గలగల నవ్వింది—గవ్వలు గిలకరించి వొలకబోసినట్లు. ఆ నవ్వు అలలలాగ ఆవరించింది. అంతలోనే — కొంచెం విషం పూసి— హృదయంలోకి సూటిగా గురి చేసి వొదిలిన బాణంలాగ ఆమె మాటలు... ''పదిమందితో స్నేహం చెయ్యి. తారవి ఔతావో కావో కాలం తేలుస్తుంది.''

ఎంత గర్వం! ఎంత అహంభావం! ఎదుటి వారంటే ఎంత తేలిక!

జానకికి కోపం రాలేదు

కళ్లల్లోకి నీళ్లు వొచ్చాయి.

కంఠంలోకి—ఏదో అడ్డు పడుతోంది.

''తేనాం పేటలోనూ .. చెట్లకిందా. . ఓ పూట తిండికోసం తమ శరీరాన్ని కుదువ బెట్టుకుందుకు తయారై నిలుచుంటారే.. వాళ్లెవరనుకున్నావ్? నటీమణులూ తారలూ ఐ కీర్తిశిఖరాల నధిరోహించాలనీ, సకలైశ్వర్యాలనూ సంపాదించుకోవాలనీ ... ఆంధ్రుల హృదయాలలో పీఠం వేసుకోవాలనీ — తెలుగు దేశం నుంచి వొచ్చి—వెనక్కి వెళ్లని స్త్రీలే...''

''వొద్దు... నేను పతితని కాను. కాలేను. నేను - అందమయినదాన్ని. నాటకాలలో... పరిషత్తులలో.. పోటీలలో.. అనేక బహుమతులు పొందినదాన్ని. .'' బ్యాగ్ తెరవబోతూంటే — అక్కర్లేదని వారించింది, చంచల విసుగ్గా

''ఇన్ని అర్హతలతో...''

''ఇక్కడ... సినీ ఫీల్డులో కావలసింది అర్హతలు కావులే.'' అనేసింది చంచల అతి తేలికగా.

హతాశురాలై పోయింది జానకి.

ఒక్కసారి ఆమె ఆశలూ, అంచనాలూ అన్నీ పూర్తిగా విరిగి ముక్కలయిపోయాయి. చటుక్కున — ఆమె చంచల పాదాల మీద వాలి పోయింది.

''నేను యింటికి వెళ్లను. ఎందుకంటే..'' అంటూ మొదలు పెట్టింది. ఏకళనుందో చంచలకూడా ఓపిగ్గా కూర్చుంది. ఆమెకు తెలుసు తాను వినబోయేది కొత్త కథేమీకాదని.

పరువుకోసం ప్రాకులాడే మధ్యతరగతి కుటుంబానికి చెందిన అమ్మాయి జానకి. ఆ కుటుంబానికి పరువుతోపాటు పేదరికమూ పుష్కలమే. ఎటొచ్చీ — ఉండే పరువు మిధ్య; పేదరికం — నిజం. అనుక్షణమూ ఆ చేదు నిజం నిరూపించబడుతూండడంతో డబ్బుల కోసం — జానకిని చిన్నప్పటినుంచే నాటకాల్లోకి పంపక తప్పలేదా తండ్రికి. డబ్బుకోసం అలా తప్పనిసరిగా పదిమందిలోకీ పంపవలసి వొచ్చినా—







పరువు కోసం తక్కువ జాగ్రత్త లేమీ తీసుకో లేదు.

జానకికి— పెళ్ళీడు వొచ్చింది

కట్నమివ్వలేని తండ్రి— నాటకాలలో వేషా లేసిన అమ్మాయికి ఎటువంటి సంబంధం తేగలడు? ఈ దేశంలో— కళకి ఎంత మంచి పేరుంటుందో, కళాకారిణి ఐన స్త్రీకి అంత చెడ్డ పేరు చేరుతుంది కద, ఆమె ఎంత మంచిగా ఉన్నా? అలాగ— చెడ్డపేరు తెచ్చుకున్న జానకికి పనికిరానివాడే దొరికాడు వరుడిగా. వయసు మళ్ళిన వాడూ, వికృతాకారుడూ, విధురుడూ అయిన ఆ వరుణ్ణిచూస్తూనే దిగులూ,భయమూ పడిపోయింది జానకి ఆ పెళ్ళికి వొప్పుకుని — బలిపశువు కారాదు బ్రతుకంతా— అని గట్టిగా నిశ్చయించుకుంది.

పదిమందిలోనూ మసలడం వలన అలవడిన కొంచెం ప్రపంచ జ్ఞానమూ, నటిగా సంపాదించిన ఆత్మవిశ్వాసమూ— ఆమెను— తన జీవితాన్ని తననే నిర్మించుకోమన్నాయి. ఆమెకు చంచలంటే అభిమానం. ఆమె సినిమాలు తెగ చూసేది తన నటనలో... కదలికలలో చంచలనే అనుకరించేది నూటికి నూరుపాళ్ళా క్రమక్రమంగా—ఆమె— మానసికంగా — చంచలకతి చేరువైపోయింది తనూ ఆమే వేర్వేరు కాదు, ఒకటే అన్న భావనకు లోనయ్యేది.

పరువు ప్రతిష్ఠలకోసం జరిగే పెళ్ళనే ఆ బలి నుంచి తప్పించుకుందుకూ, చంచల మీది వెర్రి నమ్మకంతోనూ, నటిని కాలేకపోతానా అనే విశ్వాసంతోనూ, ఆ యింటి నుంచి అర్ధరాత్రి తప్పించుకుని— మద్రాసు వెళ్ళే రైలెక్కేసింది

చంచల యింటి ముందుకి వచ్చాక— గేటు దగ్గర గుర్ఖా అడ్డగించాడు. వాడి చేతిలో — తనవద్ద మిగిలిన చిట్టచివరి రూపాయి పడేసి... ఒక్కసారి చంచలను కలుసుకుంటే యిక తనకి కష్టాలే ఉండవు, సమస్యలే రావని లోపలికి వొచ్చేసింది కొండంత ఆశతో

"ఇప్పుడిక వెనక్కివెళ్ళే ప్రసక్తేలేదు. ఆ యింటి తలుపులు నాకు శాశ్వతంగా మూసుకు పోయాయి. మీరు అవతలికి తగిలేసే ముందు — బీచ్‌కి దారెటో చెప్పండి .." అంటూ ఆమె కాళ్ళను మరింత గట్టిగా చుట్టుకుపోయింది.

"యాచకో యాచక శ్శత్రుః అని నీకే నాటకం డైలాగుల్లోనూ తగల్లేదూ? నేను నిన్ను నటిని చెయ్యను. చెయ్యలేను. ఏ పుట్టలో ఏ పాముందో? నిన్ను—సిఫార్సుచేసి—నటిని చేస్తే నా వేలుతో నా కన్నే పొడుచుకోవడ మౌతుందేమో?"

స్వచ్ఛంగా ... సూటిగా ... చంచల అలా అనేసరికి — జానకి కామెమీద గౌరవమూ నమ్మకమూ మరీ ఎక్కువైపోయా యొక్కక్షణంలో. ఈమె మహానటి ఐతేకావొచ్చు కానీ వొట్టి అమాయకురాలు — అనుకుంది.

"లే . . నేను షూటింగ్‌కి పోవాలి. సాయంత్రం వొచ్చాక ఏ విషయమూ చెబుతాను. పనివాళ్ళతో చెబుతాను. భోజనం చేసి విశ్రాంతి తీసుకో." చంచల జానకిని వదలి అవతలికి వెళ్ళి పోయింది.

ఆ భవనంలో—సాయంత్రం వరకూ జానకి ఎలాగో కాలక్షేపం చేసింది వంటమనిషి చేసిన వంట — ఖరీదైనదిగానే తప్ప రుచికరంగా ఏ మాత్రమూ లేదు. ఆ తిండి తింటున్న చంచల మీద చాలా జాలివేసింది జానకికి. ఇంతకంటె తమ యింట్లో చారూ అన్నం వెయ్యిరెట్లు నయం. ఎన్ని లక్షలు సంపాదించుకుంటే మాత్రం—శుభ్రమైన భోజనం చెయ్యలేకపోతే యెందుకు?

సాయంత్రం అయ్యేసరికి గేటు దగ్గర నిలుచుంది చంచల గురించి ఎదురు చూస్తూ నిరీక్షణలో—చీకటి పడింది కానీ చంచల రాలేదు పనిమనుషులూ...వంటమనిషీ — ఒక్కొక్కరూ వెళ్ళిపోసాగారు, తాళాలు గూర్ఖాకిచ్చేసి.

వరండాలో బిక్కు బిక్కుమంటూ నిలుచుంది జానకి ఆమె మనసులో భయమూ, సందేహాలూ. చంచల వొచ్చి—తన భవిష్యత్తు గురించి ఏం తీర్పు చెబుతుందో? ఆమె పొమ్మంటే తనకేది దారి?

రాత్రి తొమ్మిదౌతూంటే

చంచల వొచ్చింది. కారుదిగి— తన గదిలోకి వెళ్ళిపోయింది జానకినయినా గమనించకుండా. ఐదు నిముషాలు చూసి.. అభిమానం చంపుకుని హార్లిక్స్ పట్టుకుని ఆమె గదిలోకి నడిచింది— పిలవని పేరంటం అనుకుంటూనే. ఇప్పుడు ఆమెకి స్పష్టంగా తెలుస్తూంది తను చేసిన తప్పేమిటో. కాని— ఆమె చేయగలిగిందేమీలేదు వేసిన అడుగు— వెనక్కి తీసుకుందుకు లేదు

గది తలుపులు తీసింది జానకి.

ఆమె కళ్ళు చెదరిపోయాయి

దీపాలు కనపడకుండా— ఆ పెద్ద రూము నిండా మెత్తని వెలుగు. మృదువైన రంగులతో మెరిసిపోతున్న గోడలు. ఆ గోడల కక్కడక్కడ అందమైన బొమ్మలూ... నిలువుటద్దాలూ ఒక మూలగా ఫ్రిజ్. మరోమూల—నిలువెత్తున స్టీలు బీరువా. కిటికీలకు ఖరీదయిన తెరలు దక్షిణం వేపు విశాలమైన కిటికీకి దగ్గరగా— పడవంత మంచం. దానిమీద— హంస రెక్కలు పరచినట్టున్న పరుపు.

ఆ పరుపు మీద—

## మనసు గతి

ఊహలకు రెక్కలొస్తే
మనసు విహంగమై
ఎగురుతుంది గగనంలోకి!
హఠాత్తుగా,
రెక్కలు మొలవడం
ఊహ అని గుర్తుకొస్తే
ఉన్నపాటున కూలిపోతుంది.
పాతాళంలోకి!

- చలమ్

# వెలుగు - నీడ

బోర్లాపడి ఉంది చంచల

ఆమె బట్టలు చెదరి ఉన్నాయి

ఆచ్ఛాదనలేని ఆమె వీపు ఎగిరెగిరి పడుతూంది చంచల — ఏడుస్తూందా ?

మహానటీ ఆంధ్రుల అభిమాన తారా సామాన్యురాలిలా ఏడుస్తూందా వెక్కివెడుతూ !

లక్షాధికారీ సాటిలేని కళాకారిణీ అయిన చంచలకూ దుఃఖాలూ కష్టాలూ ఉంటాయా ?

ముందుకి అడుగువేసింది జానకి

మెల్లగా ఆమె వీపుమీద చేయివేసింది ఓదార్చ బోతున్నట్టు అంతే ఆమె చివ్వున యిటు తిరిగింది "ఎవరు నువ్వు ? ఎందు కొచ్చావ్ ?" నీళ్ళు నిండిన కళ్ళల్లోంచి నిప్పులే కురిశాయి దుఃఖం నిండిన కంఠంలోంచి పిడుగులే పడ్డాయి

ఆమె కోపం కూడా అందంగానే ఉంది

జానకి చెదరలేదు ఆమెకు తెగింపు వొచ్చేసింది

"మీరేడవడమేమిటి ?"

"ఏం ? నేను మాత్రం మనిషినికానా ?"

"మీరు — నటరాణి అందాల దేవత అంతే తప్ప మామూలు మనిషికారు చూడండి

---

ఈలపాట రఘురామయ్య కల్చరల్ అసోసియేషన్, హైదరాబాదువారు ఇటీవల గుంటూరు శ్రీ వేంకటేశ్వర విజ్ఞాన మందిరంలో కీ శే ఈలపాట రఘురామయ్య గారి వర్ధంతి సందర్భంగా ఆయన చిత్ర పటాన్ని ఆవిష్కరిస్తున్న కష్టమ్స్, సెంట్రల్ ఎక్సైజ్ కలెక్టరు శ్రీ సుకుమార్ శంకర్‌గారిని చిత్రంలో చూడవచ్చు.



మీరు - చాలా అలసిపోయారు ముందు ఇది తాగండి ఓపిక వొస్తుంది" అంటూ హార్లిక్స్ కప్పు అందించింది

చంచల సందేహిస్తూంటే

ఆమెను తను పట్టుకుని — హార్లిక్స్ నోటికే అందించింది

బలవంతంగానే తీసుకుంది చంచల

వేడివేడి పానీయం తీసుకునే సరికి ఆమెకు కొంచం స్వస్థత చిక్కింది అప్పుడు—

"నువ్వెవరి అనుమతి తీసుకుని వొచ్చావీ గదిలోకి ?" తీక్షణంగా చూస్తూ అడిగింది చంచల

తెల్లబోయింది జానకి — ఏం చెప్పాలో తెలియక

"సరే నిన్ను క్షమించాను ఎందుకో తెలుసా ? నీ స్పర్శ నాకు ఆత్మీయంగా అని పించింది"

గుండెలమీంచి బరువు తొలగించినట్లు — తేలిక పడింది జానకి నిజంగా ఆమెకే తెలియదు భాష కంఠమూ అందించలేని చాలా భావాలను స్పర్శ అతి సులభంగా అందించగలదని

"మీరెందుకు బాధపడుతున్నారో చెప్పరూ ?" భయపడుతూనే అడిగింది

ఒక్కసారి తీక్షణంగా జానకి కళ్ళల్లోకి చూసింది చంచల

ఆమె కన్నుల్లో కుతూహలమే తప్ప కుటిలత్వం లవలేశమయినా లేదు

ఆమె ముఖంలో అమాయకత్వమే తప్ప అతి తెలివి ఈషణ్మాత్రమయినా గోచరించ లేదు

ఆమె అడిగిన తీరులో అభిమానమూ ఆప్యాయతలే తప్ప వంచననేది యించుకయినా ధ్వనించలేదు

గ్రుచ్చి గ్రుచ్చి చూస్తున్న చంచల చూపులకి — వొణికిపోయింది జానకి ఆశ్రయం కోరబోతున్న తానిటువంటి పెద్ద విషయాలలో కలుగ జేసుకో కూడదేమో !

ఎన్ని క్షణాలు అలాగ చూస్తూ ఉండి పోయిందో చంచల ! ఎంత భయంకరంగా గుండెలలో గ్రుచ్చుకునేలా ఉందా చూపు ! ఆ చూపు కర్థమేమిటి ? బహుశా — తనని— యీ నేరానికి బయటకు గెంటేస్తుందేమో ?

చంచల నోటివెంట వచ్చే తీర్పు కి శిక్షకి ఎదురుచూస్తూ — శిలలా మిగిలింది జానకి

*   *   *

దివ్య ప్రొడక్షన్స్‌వారి "ప్రేమ సౌధం" చాలా ఖరీదయిన చిత్రం ఆ నిర్మాత సాహసి అందుకె అరవై లక్షల బడ్జెట్‌తో ప్రేమసౌధం చిత్ర నిర్మాణానికి పూనుకున్నాడు పరిశ్రమలో పెద్దలూ అనుభవజ్ఞులూ తెలుగు సినిమా మీద అంత పెట్టుబడి పెట్టడం విజ్ఞతకాదని సలహాయిచ్చినా వినలేదు నిర్మాత మొండి ధైర్యంతో రంగంలోకి దూకాడు

షూటింగ్ — చివరిదశలోకి వొచ్చింది చివరి షెడ్యూలు జరుగుతూంది చంచలమీద కొన్ని సీనులు చిత్రీకరిస్తే — ప్యాచ్ వర్కుతో సహా చిత్రం పూర్తయినట్లే రషెస్ — చాలా సంతృప్తికరంగా ఉన్నాయి చిత్రంలోని పాటలు అప్పుడే హిట్ ఔతున్నాయి

ఎమోషనల్ సీన్ను పూర్తి చేసేందుకు సిద్ధపడి వొచ్చింది చంచల దర్శకుడామెకన్ని సూచనలూ యిచ్చాడు

సెట్ అమర్చారు లైటింగూ ఏర్పాటు చేశారు

చంచల ఖరీదయిన కాస్ట్యూమ్స్‌లోనూ, చక్కని మేకప్‌లోనూ సెట్ మీదకి వొచ్చింది రచయిత స్క్రిప్ట్ యిచ్చాడు అసిస్టెంట్ డైరెక్టరు చదివి వినిపించాడు మళ్ళీ మళ్ళీ

తను సిద్ధమే అంది చంచల

"లైట్స్ కెమెరా "అరుపులు

"యాక్షన్ "

స్క్రిప్టు చెబుతూ నటించసాగింది చంచల

చిన్న చిన్న విరామాలతో సీన్లు పూర్తవు తున్నాయి పెద్ద నటి కావడంతో చంచల టేకులు తినడం లేదు టైము వృధా కావడం లేదు మొదటిసారే ఓ కే అవుతున్నాయి షాట్స్

సాయంత్రం అవౌతూంది

చివరి షాట్

దర్శక నిర్మాతలు ఆనందానికి మేరలేదు చంచల ఎంత సహకరిస్తూంది !

"కట్—" అరిచాడు డైరెక్టరు

షూటింగ్ పేకపోయింది

ఆ సీనులో — చంచల మరణిస్తుంది ప్రేమకోసం బలి ఔతుంది కామెరా ముందు— ఆమె బలి ఐంది కుప్పగా కూలిపోయింది

"ఓకే" అన్నాడు డైరెక్టర్ సెట్‌లోకి — చంచల దగ్గరకి పరుగెత్తుతూ లైట్స్ ఆఫ్ అయ్యాయి అత్యవసరమైనవి తప్ప

చంచల లేవలేదు

"అమ్మా !" నిర్మాత దర్శకుడు కంగారుపడ్డారు

ఆమెలో చలనంలేదు స్టూడియోలో సంచలనం రేగింది చంచల కేమైంది ?

డాక్టర్‌కి టెలిఫోన్ చేశారు

అతను కారులో వొచ్చాడు చంచలకి లీలగా తెలిసింది — ఎవరో తనకి ఆసరాయిచ్చి కారులో చేర్చారని

**(ఇంకా వుంది)**

# వారఫలం

6-4-1984 శుక్రవారం మొదలు 12-4-1984 గురువారం వరకు

♈ మేషం: సులభంగా ఒకానొక విషయంలో మేలు పొందగలరు. చాల కాలంగా నిలచిన అప్పులు వసూలు కాగలవు. శుభ కార్యం నిమిత్తం చేసే ప్రయత్నాలు సాగి రాగలవు. ప్రభుత్వం మూలంగా వత్తిడి ఉంటుంది. స్త్రీలకు: అనవసరమైన ఖర్చులు, బంధు విరోధం, చికాకులు చెప్పదగిన అంశాలు

♉ వృషభం: గత కొన్ని వారాలకన్నా అన్ని విషయాలలో సుగుణం కనిపిస్తుంది. ఆదాయమున్నది. వ్యాపారం సగమంగా సాగిపోతుంది. వృత్తి యందు కూడా ప్రగతి కనిపిస్తుంది. ఎదుటివారి మనోభావాలను అర్థం చేసికోలేక బాగా తికమక పడుతారు స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు అనుగుణ్యమైన మార్పులు రాగలవు.

♊ మిధునం: మీతో సహకరించే వారి కన్నా, పోటీ పడే వారో విరోధించే వారో అధికంగా ఉంటారు. ఆదాయంలో చెప్పదగిన మార్పు లేదు. వృత్తి ఉద్యోగాలందు కించిత్తు ప్రగతి, ఆనందం చెప్పదగిన అంశాలు. 'బంధు విరోధం కొని తెచ్చుకొన్నామా' అనిపిస్తుంది. స్త్రీలకు: వస్తు సేకరణకు, వస్త్రములు కొనుగోలు చేయుటకు అవకాశంగల వారం.

♋ కర్కాటకం: దూర బంధువులు యింటికి రాగలరు. శుభ కార్య ప్రస్తావనలుంటాయి అంతేగాక కొందరు యింట శుభం జరిపించు కొనుటకు ఉద్యుక్తులవుతారు చాల కాలంగా మందంగా నడుస్తున్న వ్యాపారం [illegible] కట్టిస్తుంది. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహించటానికి, నూతన మిత్రుల కలయికకు అవకాశం గలవారం.

♌ సింహం: గత కొన్ని వారాలలో ఎంత యత్నించినా జరుగక ఎదురు తిరిగిన పనులు ఈ వారం సక్రమంగా జరిగిపోవుటకు ఆక్షేపణ లేదు. పెద్దల మూలాన, మిత్రుల వలన ఒకానొక గృహ సంబంధ విషయం పరిష్కరింప బడుతుంది స్త్రీలకు. అధికార వర్గీయుల నుండి లాభదాయక పరిస్థితులుంటాయి.

♍ కన్య: అధికారం పెంపునకు, ఆదాయంలో మార్పు రావటానికి, వృత్తి యందు అభివృద్ధి కనిపించుటకు, దూర ప్రాంతాల నుండి శుభ వర్తమానం అందు కొనుటకు ఈవారం అనుకూలం. మీ మాటకు విలువ పెరగటం కూడా గమనించ గలుగుతారు. స్త్రీలకు నాలుగు విధాలా కలిసి రాగల వారంగా గ్రహించండి

♎ తుల: అనేక వ్యవహారాలు ఒడిదుడుకులతో ముగిస్తారు ఏపని చేసినా వెనుక ముందులు ఆలోచించాలి గదా! తొందరపాటు అనర్థదాయకం. ఆదాయంలో లోపం లేదు గాని, అంతకు అంత వ్యయం కనిపిస్తుంది. స్త్రీలకు. ఇంటి వ్యవహారాల లో ప్రశాంతి చిక్కదు.

♏ వృశ్చికం: నూతనాంశాలు గ్రహించటం జరుగుతుంది. బంధు వర్గీయుల వ్యవహారాలలో శ్రమించటం జరుగుతుంది. వ్యాపార విస్తరణకు తాపత్రయపడుతారు గాని ప్రయోజనం లేదు. స్త్రీలకు: వస్తువులు కొనుగోలు చేయటం, ఆదాయంలో అభివృద్ధి కనిపించటం గ్రహింపగలరు. పెద్దలతో అభిప్రాయ భేదాలు రాగలవు, గ్రహించండి.

♐ ధనుస్సు: నూతనాంశాలు గ్రహిస్తారు. నూతన బంధు మిత్రుల సంపర్కం, ఏర్పడుతుంది. గృహమో, భూమియో, కొనుగోలు చేయగల పరిస్థితులుంటాయి. ఉద్యోగం పోయింది గదా! అందు నిమిత్తం ఊరక ఆలోచించటం న్యాయంగాదు. శ్రమించండి. లాభించే మార్గమున్నది. స్త్రీలకు చాల కాలంగా జరుగని ఒకానొక కార్యం నెరవేరుతుంది.

♑ మకరం: బంధువుల కొరకు శ్రమించ వలసిన పరిస్థితులుంటాయి. ఆదాయంలో స్వల్పంగా అభివృద్ధి కనిపిస్తుంది. నూతన మిత్రులు చేరుతారు. పత్రికారంగంలో పనిచేసే వారికి యోగ కాలం. నటనా సామర్థ్యం కలవారికి నూతన [illegible]టాయి. స్త్రీలకు. శుభ కార్య తత్పరత, స్వల్పాదాయం.

♒ కుంభం: అభిమానుల వలన మేలేదో జరుగనున్నది. ఆదాయంలో కించిత్తు అభివృద్ధి కనిపిస్తుంది. నూతనాంశాలు గ్రహింపనున్నారు. మీ బంధు వర్గీయులతో మాట పట్టింపులు రాగల అవకాశాలున్నాయి. స్త్రీలకు: ఉన్నత పదవీ లాభం, ఆశించిన విధంగా మార్పు రాగల వారమే గ్రహించండి.

♓ మీనం: వృత్తి రీత్యా మీరు గడించిన అనుభవం ఈవారం అనుభవనీయం కాగలదు. గ్రహగతి బాగా అనుకూలంగా ఉన్నందున బాగా శ్రమించటం అవసరం, మేలు పొందటం, ఆనందోత్సాహాలతో వారం గడుపుకోవటం గమనించ గలరు. వ్యాపారం లాభదాయకమే. స్త్రీలకు: సుఖ శాంతులు విందు వినోద కాల క్షేపాలకు అనుకూలం.

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం

రవిశంకర్ మహరాజ గుజరాత్‌కి చెందిన సుప్రసిద్ధ సంఘ సంస్కర్త. ఆయన కీర్తి మాత్రం గుజరాత్‌కి పరిమితం కాకుండా అన్ని దిశలా విస్తరించింది ఫిబ్రవరి 28 నాడు ఆయనకి 100 సంవత్సరాలు నిండాయి! ఆయన ఆయురారోగ్యాలు వర్థిల్లాలని కోరుకునేవారు అసంఖ్యాకులు.

పండిత విష్ణుదాస్ షిరాలీ శాస్త్రీయ సంగీత విద్వాంసుడు. ఆయన భారతీయ సంగీతంలో 'మేళపంపు' ప్రయోగానికి చాలా కృషి చేశారు ఫిలింస్ డివిషన్‌వారి డాక్యుమెంటరీలకి ఎన్నిటికో ఆయన సంగీతం సమకూర్చారు. 1967లో ఆ సంస్థ నుంచి రిటయిరయ్యారు. తమ 77వ ఏట బొంబాయిలో మరణించారు.

పశ్చిమ జర్మనీ రాజకీయవాది ఫ్రాంట్స్ స్ట్రాస్ సాధారణంగా వివాదాలకి కేంద్రంగా ఉంటూ ఉంటాడు. అందుచేత ఆయనమీద ఎన్నో కార్టూన్‌లు రావటం సహజం ఈ కార్టూన్‌లకి మంచి గిరాకీ ఉంది. వాటిని పుస్తకాలుగా వేసి అమ్మటమూ ఉంది. ఈ సంగతిని గమనించి ఆయన సతీమణి మారియన్ కార్టూన్ పుస్తకాల అమ్మకాల మీద 15 శాతం వాటా తమకి ఉండాలని కేసు పెట్టారు. [కార్టూన్ పుస్తకాల అమ్మకాలు 100000 కాపీలు దాటాయి!] ఆమె కోరిక వివిధ వాగ్వివాదాలకి కారణం అయింది.

"ధనంమీద ఆశ ఎందరికో ఉంటుంది అది సహజమే.." అని లాంగ్ అనే కార్టూనిస్టు వ్యాఖ్య చేశాడు



వాకిట్లో 'పోస్ట్' అన్న కేక వినపడగానే పరిగెత్తుకు వెళ్ళింది సాందీపని. పోస్ట్‌మాన్ యిచ్చిన వుత్తరం తీసుకుని వస్తుంటే చింటూ వెంటబడ్డాడు... ''నాకివ్వు'' అంటూ.

''అమ్మా ! చింటూ చూడే'' అంటూ వుత్తరం తీసికెళ్ళి అమ్మ చేతిలో పెట్టింది.

ప్రెషర్‌కుక్కర్ స్టౌవ్‌మీద నుండి దించి చేతులు కొంగుకు తుడుచుకుంటూ 'వుండమ్రా' అని వుత్తరం చదువసాగింది సువర్ణ.

ఉత్తరం చదువుతూ వుంటే ఆమె కనుల వెంట నీరు కారసాగింది.

''నాన్నా ! ఇటురా ! అమ్మ ఏడుస్తుంది'' అంటూ పరుగెత్తుకుని ముందుగదిలో కూర్చున్న నాన్న దగ్గరకు వెళ్ళి చెప్పింది సాందీపని.

''ఏమిటే నీగోల'' అంటూ చదువుతున్న పేపరు అవతలపడవేసి వచ్చాడు రాజశేఖర్. నేల మీద చతికిలబడి దిగాలుగా కూర్చున్న సువర్ణ వంక ఏమిటన్నట్లు చూచాడు.

''తెనాలి అమ్మమ్మకి బాగాలేదట. ఒకసారి వచ్చి చూసి వెళ్ళమని వుత్తరం వ్రాయించింది.''

''అలాగా ! తప్పకుండా వెళ్ళివద్దాం ! ప్రయాణానికి సిద్ధంగా వుండు. నేను ఆఫీసుకు శెలవు పెట్టి ఇప్పుడే వస్తా'' అంటూ బట్టలు మార్చుకుని సైకిల్ వేసుకుని బయల్దేరాడు.

తెనాలి పక్కన పల్లెటూర్లో వుండే సీతమ్మగారు సువర్ణకు సొంత అమ్మమ్మ కాదు.. అమ్మమ్మ చెల్లెలు. ఆమెకు భర్త చిన్నప్పుడే పోయాడు... పిల్లలు లేరు ! అక్క రాజమ్మకు ఒకటే కూతురు శకుంతల. అక్కకూతుర్ని ఆమె స్వంత కూతురుకన్న మిన్నగా చూచి పెంచి పెద్ద చేసింది. శకుంతలకు సువర్ణ, శామసుందర్ ఇద్దరే సంతానం. అయితే వాళ్ళిద్దర్నీ నేలమీద నడవకుండా అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసింది... వివాహాలు చేసింది.

సువర్ణ భర్త రాజశేఖర్‌కు, శ్యామసుందర్‌కూ హైద్రాబాదులో వుద్యోగాలు వచ్చి వెళ్ళినా పురుళ్ళనీ పుణ్యాలనీ చీమ చిటుక్కుమన్నా పరిగెత్తుకు వచ్చి అభం శుభం చూచి వెళుతుండేది సీతమ్మ. డెభ్భై ఏళ్ళు దాటినా ఆరోగ్యంగా తిరగలపిడిలా వుండే సీతమ్మగారికి అనారోగ్యం ఏమొచ్చిందో అనుకుంటూ ఆఫీసులో శెలవు తీసుకుని బావమరిది శ్యామ్ ఆఫీసుకు ఫోను చేసాడు.

అమ్మమ్మకు బాగాలేదని అంతకు ముందే శెలవు పెట్టి వెళ్ళిపోయ్యాడని చెప్పారు ఆఫీసులో వాళ్ళు. స్టేషన్‌కు వెళ్లి కృష్ణాఎక్స్‌ప్రెస్‌లో టికెట్లు తీసుకుని యింటికి వచ్చాడు రాజశేఖర్.

ఇల్లంతా సర్ది రెడీగా వుంది సువర్ణ. ఉత్తరం వచ్చిన దగ్గర్నుండీ ఏడుస్తోందిలా వుంది ముఖం వుబ్బివుంది. భర్తను చూడగానే ''అన్నయ్యకు కూడా చెప్పకపోయారా ?'' అంది

# బొంబే టైల్స్



## స్నానపుగదిని మీ మనసుకు నచ్చేలా అందంగా అలంకరించుకోడానికోసం

బొంబే టైల్స్

తెలుపు, వివిధ లేత రంగులు మరియు వివిధ రంగు-రేఖల కలయికలలో లభ్యం.

శుభ్రపర్చడానికి సులభం.

ఎక్కువ మెరుపు మరియు మన్నిక కోసం రెట్టింపు గ్లేజ్ చేయబడినవి.

బొంబే టైల్స్

అత్యంత అందమైన స్నానపు గదుల మరియు వంటగదుల కోసం.

**BOMBAY TILES**

దీనితో వచ్చే వ్యత్యాసం బహు విశిష్టం.

110, Raheja Centre, Nariman Point

INCENTIVE/BPT/200 IB/TEL

''శ్యామ్ కూడా సెలవుపెట్టి బయలుదేరి వెళ్ళొడన్నారు వాళ్ళ ఆఫీసులో వాళ్ళు'' అన్నాడు రాజశేఖర్.

రాజశేఖర్ భోంచేశాక ఆటోలో బయల్దేరారు స్టేషన్‌కు. అపూట సువర్ణ భోజనం చేయలేదు. కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కాక శ్యామసుందర్ అతని భార్య రజని, వాళ్ళ అబ్బాయి రాజేష్ కనపడ్డారు.

వదినను చూడగానే ఆపుకున్న దుఃఖం కట్టలు తెగింది సువర్ణకు. మరదలు ఏడ్పు చూసి తానూ శ్రుతి కలిపింది రజని. కష్టానికి సుఖానికి కాకితో కబురంపితే చాలు పరుగెత్తికొని వచ్చి అండగా వుంటూ వచ్చిన సీతమ్మగారికి ప్రమాదంగా వుండంటే వదినా మరదళ్ళకు దుఃఖం ఆగలేదు.

రైలుపెట్టెలో జనం తమవంకే చూస్తున్నారని సంబాళించుకున్నారుగాని లేకపోతే వదినా మరదళ్ళు తెనాలి జేరినదాకా ఏడ్పు మానేవాళ్ళు కారు!

రాజేష్ సాందీపనికంటె రెండేళ్ళు పెద్ద. కాన్వెంటులో మూడో తరగతి చదువుతున్నాడు. ఒకటో తరగతి చదివే మరదలును వుడికించాలని—

''వాట్ ఎ నాటీ గర్ల్ యు ఆర్'' అన్నాడు.

''అమ్మా! ఈ రాజు చూడు! వాట్ ఎ నాటీ ఎ గర్ల్ అంటున్నాడు'' అంటూ ఫిర్యాదు చేసింది తల్లితో.

సువర్ణ ''తప్పమ్మా! బావను రాజు, అని పిలవకూడదు. రాజాబావ అని పిలువు! లేకపోతే బావ అని పిలువు'' అంది.

వెంటనే ''బావ బావ పన్నీరు'' అంటూ ఆడవసాగింది సాందీపని.

''సిసింద్రీ మాటలు మానవుగదా'' అంటూ మళ్ళీ కబుర్లల్లో పడిపోయింది సువర్ణ.

# గెలుపెవరిది?

''వూరుకో వదినా! సాందీపని మాత్రం ఏమంది! చిన్నపిల్లలు అల్లరి చేయకపోతే మనం చేస్తామా?'' అంది రజని.

తెనాలిస్టేషన్ రాగానే అంతా దిగి ఒక జట్కాలో బయర్దేరారు జాగర్లమూడి.

సీతమ్మగారు వున్న ఆస్తి అంతా ఇదివరకే శ్యామసుందర్ చదువుకూ, సువర్ణ పెళ్ళికీ కర్చు చేసింది. ఉన్న అరెకరం నిమ్మతోట పక్కనవున్న చిన్న పెంకుటింట్లో వుంటూ వచ్చినఆదాయంతో గుట్టుచప్పుడుకాకుండా కాలక్షేపం చేస్తూవుంది. నగలుకూడా చాలావరకు సువర్ణకూ, రజనికి ఇదివరకే ఇచ్చివేసింది. కానీ రవ్వల పోగులు మటుకు ఎవరకూ ఇవ్వకుండా అట్టేపెట్టుకుంది.

జట్కాదిగి లోపలకు వెళ్లి మగతగా పడి వున్న సీతమ్మ చుట్టూ చేరారంతా.

''అమ్మమ్మా! అమ్మా'' అంటూ పిలిచింది సువర్ణ. చిన్నప్పుడు ''అమ్మా'' అని కొంచెం పెద్దయాక కొంతసేపు ''అమ్మమ్మా'' అని కొంతసేపు ''అమ్మా'' అని పిలిచేది సువర్ణ.

సీతమ్మ మూసిన కళ్లు తెరవలేదు. మంచం పక్కన కూర్చుని మరలా ఏడ్వడం మొదలెట్టింది సువర్ణ.

రజనికూడా కళ్ళు వత్తుకుంటూ కూర్చుంది పక్కనే! రాజశేఖర్, శ్యామసుందర్ జట్కాలో తిరిగి తెనాలి వెళ్ళారు డాక్టరుగారిని పిలుచుకురావటానికి.

ఇరుగు పొరుగునారు పరామర్శకు వచ్చి ''మూడు రోజులనుండి మూసిన కన్ను తెరవకుండా పడివుంటే వుత్తరం వ్రాసాము. నిన్నటి నుండి మరీ పచ్చి మంచినీళ్ళుకూడా తాగటం లేదు'' అన్నారు.

పడమటి వీధి పకీరమ్మ ''నాకేమిటో

## అవినాశిని

రైలుపట్టాల పక్కన
మునలితనానికి
ఆలంబనం
అడుగులేస్తున్న బాల్యం,
మొదటిది నశించినా
అందులోంచే
అంగలు వేసేది రెండోది!

— నిఖిల్

అనుమానంగా వుందమ్మాయి. ఎడమచేయి కాలూ కదలడంలేదు. పక్షవాతం వచ్చిందను కుంటా'' అంది.

తూర్పువీధి తులసమ్మ ''పక్షవాతంలో స్పృహపోయింది గట్టెక్కడం కష్టం'' అంది

''అలాగా, మిగిలిన ఆస్తి ఎవరికిస్తుందో! ఏమైనా ఏర్పాట్లు చేసిందా?''

''ఏర్పాట్లకేముంది? తోట ఇల్లు శ్యామ సుందర్‌కు వీలునామా వ్రాసింది! నగలన్నీ ఇదివరకే మనుమరాళ్ళకిచ్చింది. ఇక రవ్వల పోగులు ఎవరికివ్వాలనుకుందో తెలియలేదు'' అంది పకీరమ్మ.

ఏడ్పుల మధ్య వెక్కుతూ ''సువర్ణా! రవ్వల పోగులు నీకేనే అంది అమ్మమ్మ'' అంది సువర్ణ.

''ఆమె నగలన్నీ నువ్వే తీసుకున్నావు! రవ్వల పోగులు కూడా నీకేనా? నేనొప్పుకోను'' అంది రజని.

''మా అమ్మమ్మ నగలు నేను తీసుకోక మరెవరు తీసుకుంటారు. అమ్మమ్మకు నేనంటే ప్రాణం. స్పృహ వున్నట్లయితే పోగులు నా కిమ్మని చెప్పేది.''

''నాకు నువ్వొకటి, సువర్ణ వొకటి కాదు!'' అనేవారు. ఆమె రవ్వల పోగులు నాకే ఇచ్చేవారు.''

''అంతా అబద్ధం! నీకు పోగులు ఇస్తే నేనూరుకునే దాన్ననుకున్నావా! అమ్మమ్మ నా మాట కాదనేదిగాదు. పురిటిబిడ్డ దగ్గర్నుండీ పెంచి పెద్దచేసింది నన్ను! ముందొచ్చిన చెవుల కంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి అనుకుంటున్నావా?''

''నీ బుద్ధి పోనిచ్చావ్ గాదు. పేరాశ పెదవికి చేటన్నారు. రవ్వల పోగులు నీకెలా వస్తాయో నేను చూస్తా!''

''అమ్మో! మా యింటికొచ్చి నన్నే అంటావా! చూడు...'' తెనాలి నుండీ డాక్టరు రావడంతో యుద్ధం ఆప తాత్కాలికంగా సంధి కుదుర్చుకున్నారు వదినా, మరదలూ.

రోగిని పరీక్ష చేసి ఇంజక్షన్ చేసారు

అతను స్టార్ హోటల్స్ లో తప్ప తినడట
మన ఊళ్లో స్టార్ హోటలు లేదు కదా! అందుకని
ఇలా అరేంజ్ చేసుకున్నాడు



డాక్టరుగారు. "వైరల్ ఫీవర్ ! మరేం ఫరవా లేదు ! ఒకటి రెండు రోజులలో జ్వరం తగ్గి పోతుంది'' అన్నాడాయన.

రాజశేఖర్ శ్యామసుందర్ డాక్టర్‌గారిని పంపడానికి బయటకు వెళ్లారు.

సీతమ్మగారికి జబ్బు నెమ్మళిస్తుందని తెలియగానే సువర్ణ, రజని, తగూపడడం మాని వేసారు. అందరిముందూ రవ్వల పోగుల కోసం తగూలాడుకున్నందుకు సిగ్గుపడ్డారు కూడా.

పక్కింటామె కాఫీ తీసుకువస్తే "నువ్వు తాగొదినా'' అంటే "నువ్వు తాగు వదినా'' అంటూ మర్యాద చేసి కోవడం మొదలెట్టారు !

డాక్టరుగారు చెప్పినట్లు మరుసటి రోజుకు సీతమ్మగారికి జ్వరం తగ్గింది. కళ్ళు తెరిచి అందరినీ పరీక్షగా చూడసాగింది.

మనుమడు, మనుమరాలు, మునిమనుమ సంతానం అందర్నీ పరీక్షగాచూసింది. ఏదోతృప్తి ఆమె మనసంతా నిండిపోగా "ఎప్పుడొచ్చార్రా మీరు'' అంది.

"తాతమ్మా, మరే మేమంతా నిన్న వొచ్చాం! నిన్నే అమ్మా రజనీ అత్తయ్యా నీ రవ్వలపోగులు నా వంటే నావని తగూలాడుకున్నారు'' అంటూ ఆమె దగ్గరకు వెళ్ళి చెప్పింది సాందీపని.

"నా బంగారమే ! నువ్వు కూడా వచ్చావా అమ్మా'' అంటూ సాందీపని వళ్ళు నిమురుతూ వుండి పోయింది సీతమ్మ.

తర్వాత నాలుగయిదు రోజులలోనే సీతమ్మ గారికి నెమ్మళించడంతో అంతా మరలా హైద్రాబాదు ప్రయాణమయిపోవటానికి సిద్ధమయ్యారు !

రవ్వలపోగుల కోసం తామిద్దరూ తగూలాడుకున్న వైనం సీతమ్మకు తెలిసిపోయిందని సిగ్గుపడిపోయారు సువర్ణ, రజని. వున్నన్నాళ్ళు తల ఎత్తి ఆమె ముఖం చూడలేక బాధపడి పోయారు !

"అమమ్మా! వొంటరిగా నువ్విక్కడెందుకు. మావెంట రారాదూ ?'' అని శ్యామసుందర్ అంటే –

"అదేమిట్రా శ్యామూ ? నాకేమయింది ? శుభ్రంగా తిని తిరుగుతుంటిని కొన్నాళ్ళపాటు వుండనియ్. ఎటుదిరిగీ రాజూ, సందూ వాళ్ళ పెళ్ళిళ్ళకు రావాలిగా'' అంది సీతమ్మ

"అమ్మో ! చూసావా ఎన్నాళ్ళు బతకాలని ప్లాన్ వేస్తుందో?'' అంటూ ఫక్కున నవ్వారు పక్కయిళ్ళవాళ్లు.

*  *  *

రాజేష్ యం.కాం. పాసయి బ్యాంకులో వుద్యోగంలో జేరాడు. సాందీపని బి.యే. పాసయి సెక్రెటేరియేట్‌లో జాబ్‌లో చేరింది.

శ్యామసుందర్ రాజశేఖర్ వియ్యమందుదామని నిశ్చయించుకుని శుభలేఖలు అచ్చువేయించారు. ఇద్దరూ జాగర్లమూడి వెళ్ళి టాక్సీలో సీతమ్మగారిని హైద్రాబాద్ తీసికొనివచ్చారు.

# వేమన పద్యాలు




తరుణియంగమెల్ల పురుషుండు వెఱుగును
పురుషు నవయవములు పొలతి యెఱుగు
కోక గట్టుకొన్న కొలదికి సిగ్గౌను
విశ్వదాభిరామ వినుర వేమ.

సాందీపనిని పెళ్ళికూతుర్ని చేసి ఒకో అలంకారం చేయసాగారు సువర్ణ, రజని.

"వుండండ్రా ! ఒక్క నిముషం ఆగండి'' అంటూ లోపలకు వచ్చింది సీతమ్మ.

వణుకుతున్న చేతులతో నెమ్మదిగా రవ్వల పోగులు తీసి రజని చేతిలో వుంచి "కోడలు పిల్లకు అలంకరించవే'' అంది.

పదిహేను సంవత్సరాల క్రిందట వీటికోసం తగూలాడుకున్నాం అన్న విషయం గుర్తొచ్చి రజని, సువర్ణ సిగ్గుతో తల వంచుకున్నారు.

తాతమ్మ రవ్వలపోగులు రజనత్త చెవులకు తగిలిస్తుంటే సాందీపని కళ్లు గర్వంతో మిలమిల మెరిసాయి !

పెండ్లి అయి మునిమనుమడూ మునిమనుమరాలూ వచ్చి కాళ్ళకు నమస్కరిస్తుంటే దీవిస్తూ తృప్తిగా చూసింది సువర్ణ, రజనీల వంక సీతమ్మ.

"వదినా ! గెలుపు నీదే !'' అంది రజని.

"సాందీపని ఇవాళ్టినుంచీ నీ కోడలు ! అందువల్ల గెలుపు నీదే'' అంది సువర్ణ.

"ఇంకా మీ తగూలు తీరలేదంట్రా !'' అంటూ బోసినోరు బయటపడేలా ఫకాలున నవ్వింది సీతమ్మగారు !

# శ్రీ రామ తీర్థం

వైష్ణవ సంస్కృతికి ప్రతీక శ్రీరామ తీర్థ పుణ్యక్షేత్రం ఇచటి దివ్య మంగళ స్వరూపుడు శ్రీరామచంద్రుడు

శ్రీరామచంద్రుని పేరు వినినవారు — కొలవనివారు అరుదు

ఈ క్షేత్రం — విద్యల నగరంగా ప్రసిద్ధి వహించిన విజయ నగరానికి పది కిలోమీటర్ల దూరంలో ఉన్నది క్రీ॥ శ॥ 1400 సం॥ ప్రాంతంలో విజయనగర రాజధాని అయిన కుంబిళాపుర (ప్రస్తుతం 'కుమిలి') రాజు గజపతి పరిపాలించేవారు ఆ కాలంనాటికి ఈ ప్రాంతం అంతా దట్టమయిన అడవి క్రూర జంతువులతో నిండి భయంకరంగా కనిపించేది

## పూర్వ గాథ

ఒకసారి ఒక ముసలి అవ్వ కర్రలకోసం అడవికి బయలుదేరింది అయితే సాయంత్రం వరకూ పుల్లలు ఏరుకుని యింక ఇల్లు చేరుదా మనుకునేసరికి ఆకాశం మేఘావృతమైంది ఉరుములు మెరుపులు మొదలైనాయి అడవంతా చీకటి అయిపోయింది కొంతసేపటికి వర్షం ప్రారంభమైంది ఆమెతోపాటు వచ్చిన కొంత మంది వర్షం ప్రారంభకాకమునుపే వెళ్లిపోయి నారు వారిని సాయం ఉండమనటానికి ఆమె మూగది కావడంవలన పిలవలేక పోయింది అందు వలన ముసలి అవ్వ దగ్గరగాఉన్న ఒక పాడుపడిన గుహలో తల దాచుకొని రామనామ జపం మనసులో చేస్తూ ఉండిపోయింది

ఆ సమయంలో అరణ్యవాస నిమిత్తం వచ్చిన సీతారామలక్ష్మణులకు రామనామ శబ్దం అయాచితంగా తమ హృదయాలలో మార్మోగి సాగింది "ఎవరీ భక్తశిఖామణి" అని దివ్య దృష్టితో తిలకించిన వెంటనే హనుమంతుడ్ని వెళ్లి ఆమె సంగతి కనుకొమ్మని పంపారు

ఒక్క క్షణంలో ఆ ముసలి అవ్వముందు హనుమంతుడు ప్రత్యక్షమై — ఆమె మూగదని గ్రహించి వెంటనే ఆమె నాలుకపై రామశబ్దాన్ని వ్రాసాడు వెంటనే ఆమెకు మాటలు వచ్చినాయి

తనకు మాటలు వచ్చాయనే ఆనందోద్వే గంతో హనుమంతుడికి ప్రణామములు ఆచరిం చింది. ఆ క్షణమే ఆంజనేయుడు మాయ మైనాడు

ఆ రాత్రి శ్రీరామచంద్రుడు ముసలి అవ్వ కలలో కనిపించి— "ఇచ్చట నేను వెలుస్తాను నా పేరు మీదుగా ఈ ప్రాంతంలో దేవాలయం నిర్మాణం జరగాలి సహాయానికి గజపతిని అర్థించు " అని చెప్పి అంతర్ధానమైనాడు

రాముని దివ్యమంగళ విగ్రహాన్ని గాంచి పులకించిపోయింది ముసలిఅవ్వ మర్నాడుదయం— రాత్రి జరిగిన సంఘటన సంబరంగా ప్రతీవారి తోనూ చెప్పింది కానీ ఎవరూ నమ్మలేదు పైగా హేళన చేయసాగారు ఈ విషయం — అలా అలా ప్రాకి గజపతికి వెళ్లింది ఆయనే స్వయంగా వచ్చి ప్రశ్నించారు

తనకు కలలో కనిపించి చెప్పినదంతా వివరంగా చెప్పింది ఆమె విగ్రహాలుగా వెలిసిన సీతారామలక్ష్మణులను చూపించింది అయినా గజపతికి నమ్మశక్యం కాలేదు —

కాని— ఇంతలో కొంతమంది ఆటవికులు— "ఈ ముసలిఅవ్వకు పుట్టుక నుంచి మూగతనం వుంది ఈమె మాట్లాడటం మాకు విచిత్రంగా ఉంది" అన్నారు

దాంతో— గజపతి యిలా అనుకున్నాడు — "ఆ దైవమే ఈ ముసలి అవ్వ మూగతనం పోగొట్టి వుంటాడని" —

ఆ మర్నాటి నుంచి దేవాలయ నిర్మాణ కార్యక్రమం చేపట్టి— అనతి కాలంలోనే పూర్తి చేసాడు

ఆ దే వా ల య మే — శ్రీరామస్వామి దేవాలయం

ఇచ్చట శ్వేతాచలమని, నీలాచలమని రెండు పర్వతాలున్నాయి శ్వేతాచలంలోని దే ము ని కి శ్రీరామచంద్రుడని, నీలాచలంపై దేముడికి కోదండ రామస్వామి అని నామములు

మొట్టమొదట ఈ శ్వేతాచలాన్ని ఆనుకుని వున్న సీతారామునిపేట అనే గ్రామం వద్దనున్న పంటపొలాల్లో విగ్రహాలు లభ్యమైనాయి వానినే దేవాలయంలో ప్రతిష్ఠ జరిపారు

ఇక్కడ లక్ష్మి సన్నిధి, కుంతీమాధవస్వామి సన్నిధి, వేణుగోపాలస్వామి సన్నిధి, భూభుజంగ వరహానరసింహస్వామి సన్నిధి ఉన్నాయి

శ్వేతాచలంపై ఉన్న శ్రీరామస్వామి దేవాలయం





వెండిమందిరంలో సీతా రామలక్ష్మణుల ఉత్సవ విగ్రహాలు

ఈ శ్వేతాచలం ఒడ్డున రామకోనేరు ఉంది ఇది యాత్రికులకు స్నాన పానాదులకు యోగ్యంగా ఉంది

ఇంక నీలాచల ప్రస్తావనకు వస్తే— ఇది హస్తి— (ఏనుగు) ఆకారంలో నల్లగా ఉంటుంది! దీనిపైకి అధిరోహించుటకు మెట్లు లేకపోయినా ఎక్కడానికి అనువుగానే ఉంటుంది శ్వేతాచలంపై శ్రీరాముడిని దర్శించడానికి వచ్చిన ప్రతీ భక్తుడూ— తప్పనిసరిగా కోదండరాముని సన్నిధిని తిలకిస్తారు

నీలాచలం ఎక్కాక— కోదండరామస్వామి ఆలయం ఉంది ప్రస్తుతం యిది కొంచెం శిథిలమై ఉంది దీని నానుకుని 'రామగుండము' అన్న నీటి కొలను ఉంది ఇది ఒకప్పుడు దాహ నిమిత్తం సీతాదేవి కొరకు లక్ష్మణుడు తన బాణ వేగంతో జల పుట్టించాడని— అదే యిదని చెపుతారు ఇది అంతులేని లోతు కలది నీళ్లు నిర్మలంగా, రుచిగా ఉంటాయి

ఈ పర్వతంపై ఉండే మరో విశేషమేమిటంటే—ఇక్కడ త్రేతాయుగపు రాముని గురించి ద్వాపరం నాటి పాండవుల గురించి సాక్ష్యాధారాలు దొరుకుతాయి

'రామ గుండం' దాటాక 'భీముని బుర్ర' అని ఒక గుహ ఉంది దీనిలోకి ప్రాకి వెళ్లాలి ఒకసారి కొండచరియ కూలిపోతుంటే భీముడు తన బుర్ర అడ్డుపెట్టి తన సోదరులను, ద్రౌపదిని రక్షించాడని ఒక కథ ఉంది దీనికి నిదర్శనంగా బుర్ర పెట్టేందుకు ఒక రంధ్రం ఉంది

ఇక్కడికి కొంత దూరంలో 'పసుపురాళ్లు' కనిపిస్తాయి కొంతమంది ఈ రాళ్లపైన పసుపుని బట్టలకు రాసుకుని కళ్లకద్దుకుంటారు

ఇక్కడే మరో విశేషం ఉంది అదేమిటంటే— ఒకసారి గంజివార్చడానికి చీపురులేక తన జుత్తుతోనే సీతాదేవి తుడిచింది ఆ చారలు మొత్తం కొండపై మరెక్కడా కనిపించవు

అలా యింకా ముందుకు పోయినట్లైతే 'సీత గుండం' కనిపిస్తుంది ఇది సామాన్యమైన లోతుకల కొలను

అక్కడనుంచి చూసినట్లైతే ఒక సుందరమైన లోయ సాక్షాత్కరిస్తుంది దానికి 'సప్తస్వరాల లోయ' అని పేరు కొండ ఒడ్డునుండి మనం గట్టిగా కేకలేస్తే ఏడుసార్లు ధ్వనిస్తుంది

ఇంకా క్రిందకు దిగినట్లైతే 'పాండవుల పంచ' అని ఒక ప్రదేశం ఉంది ఇక్కడ 'పాండవులు పాచికలు ఆడిన' నిదర్శనం అగుపిస్తుంది ఆ ప్రక్కనే సీతా అమ్మవారి పురిటి మంచం వుంది ఇది రాతితో నిర్మించబడింది దీనిలోంచి ఈనాటికీ పురిటి వాసన రావటం విశేషాంశం





మూడు వాహనముల సేవ

ఇక— ఆలయంలో — ఉదయం బాలభోగం మొదలు రాత్రి దూపదీప నైవేద్యాల వరకూ అన్నీ సాంప్రదాయ బద్ధంగా, నియమ నిష్ఠా పూర్వకంగా జరుగుతాయి మామూలు ఉత్సవాల కన్నా గొప్పగా చెప్పుకోదగ్గవి — శ్రీ స్వామివారి కల్యాణ మహోత్సవం— ఇది భీష్మ ఏకాదశినాడు జరుగుతుంది — మరో ఉత్సవం మహాశివరాత్రి పర్వదినం మూడునాలుగు రోజులు లక్షలాది జనం రాముల వారిని దర్శిస్తారు పేరుకు శివరాత్రి కానీ శివాలయ దర్శనానికి ఎవరూ ప్రాముఖ్య మియ్యరు ఇంకో చెప్పుకోదగిన ఉత్సవం శ్రీరామ నవమి తొమ్మిది దినముల పాటు వైభవోపేతంగా జరుగుతుంది

శ్రీ రామ స్వామి దేవాలయం యింకా ఎంతగానో పురోభివృద్ధి చెందవలసిన ఆవశ్యకత వుంది యాత్రికులకు ముఖ్యంగా రాత్రి ఉండటానికి వసతి సదుపాయం లేదు సత్వరమే సత్రములను నిర్వహించవలసిన అవసరం ఎంతైనా ఉంది ఇంకా వివాహాది శుభ కార్యములు ఆలయములో జరుపుకొనుటకు— కల్యాణమంటపములు కట్టించాలి—

ఈ ఆలయమును యిటీవలే శ్రీ సింహాచలం దేవస్థానం వారు దత్తత చేసుకుని — దేవాలయ అభివృద్ధికొరకు కృషిచేయుచున్నారు ఇది హర్షనీయాంశం వీరి కృషివలన ఆలయము అభివృద్ధి చెందిన ఎల్లరకునూ సంతోషదాయకమే !

ఫొటోలు, వ్యాసం కె. కె. రఘునందన

ఇటీవల హైదరాబాదులో జరిగిన 35వ ఇండియన్ ఫార్మస్యూటికల్ కాంగ్రెస్‌లో బి వి పటేల్ ఎడ్యుకేషనల్ ట్రస్టు (అహమ్మదాబాదు)వారు దేశ వ్యాప్తంగా నిర్వహించిన వ్యాస రచన పోటీలో మూడవ బహుమతిని ముఖ్యమంత్రిద్వారా అందుకుంటున్న ఒరిస్సా అసిస్టెంట్ డ్రగ్ కంట్రోలర్ శ్రీ పిప్పళ్ల సూర్యప్రకాశరావు,



సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

తెల్లవారిన దగ్గర్నుంచీ కృష్ణారావుని గమనిస్తూనే వున్నాడాయన. కృష్ణ దైవధ్యానం పూజా పునస్కారాలు మధ్యాన్నందాకా—యధావిధిగా సాగిపోయాయి. లక్ష్మి బాధ్యతగా అన్నీ అమర్చి పెడుతుంది.

తులశమ్మ ఎంత ముభావంగా వున్నా — వాతావరణం ఎంత గంభీరంగా వున్నా — కృష్ణారావు అనుకున్నది అనుకున్నట్టే జరిగిపోతోంది.

అయితే శ్రీహరి గారు గమనించకపోలేదు.

కృష్ణలో పరధ్యానం కన్పిస్తోంది. ఎంత దాచుకుందామన్నా—ఏదో బాధ తెలియటం లేదు. అతి ప్రయత్నం మీద నిగ్రహించుకున్నట్టు కన్పిస్తున్నాడు.

ఎందుకనలా ?

తల్లిని చూశా ? —కావచ్చు. రామకృష్ణలా మారిపోయి — చివరికి భర్తలాకూడా కాకుండా పోతాడేమోనని ఆ తల్లి బాధ స్పష్టంగా కన్పిస్తోంది.

**( గత సంచిక తరువాయి )**

అయినా అన్నయ్య కిచ్చిన మాట ఇంతై అంతై లక్ష్యానికి దగ్గర చేస్తోంది.

సంఘర్షణల్ని అదుపులోకి పెట్టుకోగలుగుతున్నాడు —

తనమీదే ఆశలు పెట్టుకుని అవి సఫలం కావేమోనని కుమిలిపోతున్న తల్లిని గమనించక పోవటం లేదు —

వదినా !! — ఆ వి డ కూ డా — బాధ్యతాయుతంగా సర్వం అమరుస్తోంది.

మానసికంగా క్షీణిస్తున్నా — లేని వోపిక తెచ్చుకుని — తన పూజకి కా వ ల్సిన వ న్నీ యంత్రంలా అమర్చి పెడుతూనే వుంది.

ఐనా... వాళ్ళకి తనేం చె య్య గ లు గుతున్నాడు ? ఏ రకంగా మనశ్శాంతిని అందించ గలుగుతున్నాడు ?

తనో ఇంటివాడు కావాలని ఆవిడ కోరిక. తపన.

కానీ అదెలా కుదుర్తుంది ?

అన్నయ్య కిచ్చిన మాటను తను అమలు పరచి తీరాలి.

— అది కుదుర్తుందా ?

ప్రతీ ఆత్మలోనూ దైవమే నిండివుంటుంది. అది... ఆ నిజం తన సిద్ధాంతాల్ని బలపరుస్తోంది కూడా.

మరి తన ఆత్మ సంతృప్తికోసం ... తను పొరపాటుగా ప్రవర్తిస్తున్నాడా ?

తన తల్లి ఆత్మను క్షోభ పెడుతున్నాడా?

ఇది న్యాయమా ?

న్యాయమెలా అవుతుంది ?

కృష్ణారావు మానసిక ప్రశాంతతకి దూరమౌతున్నాడని గ్రహించ గలిగాడు శ్రీహరిగారు. కృష్ణ వ్యక్తిత్వం అరుదైనది. ఇంత చిన్న వయసులో ఆ దైవభక్తీ, ఆ వివేకం, ఆ ఆత్మ నిగ్రహం, అటువంటి మనోనిశ్చయం, తల్చుకున్నది సాధించాలన్న ధీరోదాత్త హృదయం, మానవతా దృక్పథంలో, దైవత్వాన్ని పెంచుకుంటూ, పదిమందికోసం తనని తనే మలచుకోగల సున్నితత్వం, ఆ సౌశీల్యం, ఆ మంచి వర్చస్సూ సామాన్యమైనవి కావు.

మహాయోగి కాగలడో—

మహాజ్ఞాని కాగలడో—

ఐతే— భగవంతుడు ఇతనికి కొన్ని బాధ్యతలను కేటాయించాడు.

ఇతని ద్వారా కొంత ప్ర యో జ నా న్ని ఆశించాడు.

ఆ ప్రయోజనాన్ని రామకృష్ణయ్య ద్వారా చెప్పించాడా ?

కృష్ణ కూడా అదే ప్రయోజనాన్ని అంతర్గతంగా ఆలోచిస్తున్నాడా ?

అందుకేనా ఇంతటి సంఘర్షణ ?

ఈ సంఘర్షణని దూరం చెయ్యాలంటే...

సంఘర్షణ దూరమైతేనేగానీ ప్రశాంతి మిగలదు.

ప్రశాంతిలోనేగానీ అనుకున్నది సాధించటం సుసాధ్యంకాదు. ఆ ప్రశాంతి అందాలంటే ? అతన్ని కార్యోన్ముఖుడ్ని చెయ్యాలంటే ! ! ! ...

వయసు తెచ్చిన అనుభవం—

వివేకాన్ని అందించిన వార్ధక్యం—

విచక్షణతో ఆలోచింపదగ్గ నేర్పరితనం —శ్రీహరిగార్ని ఒక నిశ్చయానికి తెచ్చాయి.

ఆ రాత్రి —

ఆత్రంగా కృష్ణవైపు చూస్తున్నారు శ్రీహరిగారు.

పాలరాతి విగ్రహంలా మెరిసిపోతున్నాడు కృష్ణారావు.

అతని పాలభాగం మీద ఉంగరాల జుత్తు చిత్రకారుడు శ్రమతో గీసి తీర్చిదిద్దినట్టుంది. ఆ కళ్ళు సోగగా అర్ధనిమీలితంగా వున్నాయి. ఆకర్షనీయమైన అందమైన ఆ పె దా లు నిశ్చలంగా ధ్యానముద్రంలో వున్నట్టున్నాయి.

**జరిగిన కథ — 5 :** తులసమ్మ కుమారులు రామకృష్ణయ్య, కృష్ణారావు. రామకృష్ణయ్య కృష్ణ భక్తుడు. భార్య కళ్ళలోకూడ ఆయనకు నీలమేఘశ్యాముని దివ్యరూపమే కన్పిస్తుంది. కృష్ణారావుకి సంగీతం అంటే ప్రాణం. వీరిద్దరి ప్రవర్తన చూసి తల్లి తులసమ్మ తనువారిపై పెంచుకొన్న ఆశలు తీరవేమో అని భయపడింది. తులసమ్మ కృష్ణారావుని వంశం నిలపమని వేడుకొంటుంది. తల్లి కోరిక అన్నతోచెప్పి ఆయన సలహా అడుగుతాడు కృష్ణ. అడిగిన వాళ్లకు రాధ మాధవుల తత్వం బోధించమని కృష్ణను కోరుతాడు రామకృష్ణయ్య. అన్న పరిస్థితి బాగలేదని తల్లిని, వదినను వచ్చి చూడమంటాడు కృష్ణ. రామకృష్ణయ్య మరణిస్తాడు. లక్ష్మి తన శేష జీవితం అత్తగారింట్లోనే గడుపుతానని చెపుతుంది. కృష్ణారావుని పెళ్లి చేసుకొమ్మని తల్లి వేడుకొంటుంది. అత్తగారి కోరిక తీర్చమని కృష్ణకు చెపుతుంది లక్ష్మి. తల్లి ఆశను తీర్చాలా ! గృహస్థ ఆశ్రమం స్వీకరించాలా వద్దా ! అనే సందిగ్ధంలో పడతాడు కృష్ణారావు. శ్రీహరి బాబాయికూడా తులశమ్మగారి కోరిక న్యాయమైనదని, పెళ్లి చేసుకోమని బోధిస్తాడు. కృష్ణారావు తను తన అన్నగారి, వివేకానందుని, తండ్రిగారి అడుగుజాడల్లో నడుచుకోవాలనుకుంటునట్లు బాబాయి శ్రీహరిగారితో చెపుతాడు. సంసారం సాగిస్తూనే ఈ దీక్ష కొనసాగించవచ్చని నచ్చచెప్ప చూస్తారు శ్రీహరి బాబాయి. కృష్ణ గొప్పతనం ఆయన గుర్తించినా తులశమ్మగారి కోరిక తీర్చటం తన బాధ్యతగా తలచి కృష్ణను పెళ్లి చేసుకోమని కోరుతాడు.



''ఏం బాబాయ్ !!!''

''రేపు నేను వెళ్ళిపోవాలనుకుంటున్నా...'' చటుక్కున తల దించుకున్నాడాయన —

అయినా కృష్ణ చూపుల్నుంచి తప్పించుకోలేకపోయాడు.

''వెళ్ళేలోగా అడగదల్చుకున్నవన్నీ అడిగెయ్యి బాబాయ్ !''

రెప్పవాల్చకుండా చూశారు శ్రీహరిగారు.

''కృష్ణా ... మీ నాన్నగారూ — అన్నయ్యలతో నీ ధ్యేయం వేరుకదూ — ''

''అవును — నేనంత మహనీయుడ్ని కాను. అందుకే ధ్యేయం వేరైనా గమ్యం ఒకటే కావాలని నా తపన.''

''గీతని ఇంతగా అధ్యయనం చేస్తున్నావు.

సాక్షాత్తు వివేకానందుడ్ని చూస్తున్న అనుభూతి కలిగింది శ్రీహరిగారిలో.

అతనితో పోలిస్తే తనెంత ???—

సర్వ సామాన్యుణ్ణి. అందుకే ఇంత వయసు వచ్చినా కామ క్రోధాధి దుశ్చింతల్లో కొట్టుకు పోతున్నాను. 'నా' అన్న భావానికే ప్రాధాన్యతనిచ్చి ఐహిక చింతనలకే అంటుకుపోయి — జిహ్వా చాపల్యం వయసుకు మించిన కోరికల్తో కొట్టుకు పోతున్నాను —

అటువంటి తను — అసాధారణంగా కన్పిస్తున్న కృష్ణతో వాదించి నెగ్గటం సాధ్యమా ?

అసలా అర్హత తనకుందా ?

అతని త్రోవే మంచిదేమో !!!—

మరి భగవానుడు గీతలో పదే పదే చెప్పిన మరో త్రోవ ?

కృష్ణ ఆ త్రోవకి రాగలిగినా—ఒక విధంగా అన్నయ్య కోర్కెను తీర్చినవాడవుతాడు. ఎన్నో



లక్షలమందికి — మార్గదర్శకుడూ — ఆదర్శమూర్తి అవుతాడు.

ఆ త్రోవే అతను కోరుకున్న గమ్యానికి దారి తీస్తుంది —

''మరి.. ''

''బాబాయ్...ఏమిటలా చూస్తున్నావ్!!!—''

చిరుచీకట్లో అతని చిరునవ్వు వెన్నెల సోనలా వుంది.

''ఏంలేదు. నువ్వింత తదేక ధ్యానంతో చదివేదేమిటా అని !—''

''... ఏ పరిస్థితుల్లోనూ పద్దెనిమిది అధ్యాయాలూ పూర్తికావాలి బాబాయ్...''

''ఏమిటీ ? ప్రతీరోజూనా ?''

''ఆఁ... ఎన్ని ఆటంకాలొచ్చినా — రోజూ పూర్తిచెయ్యగలుగుతున్నాను —''

''నియమమా ?—''

''నా తృప్తి —''

''కృష్ణా —''

గమ్యం కూడా ఒకటే అవుతుందని నీకు తెలీదా కృష్ణా ...''

బదులుగా కృష్ణ పలువరుస మెరిసింది.

''కృష్ణా — నీ నిర్ణయంలో భగవదేచ్ఛ వుండచ్చు .. అయితే ఒక మాట .. నువ్వు పూర్తిగా ఏవైపునా మొగ్గు చూపించలేక పోతున్నావు. నీలో నువ్వే బాధపడిపోతున్నావు. కారణాలూహించగలను నీకు సంబంధించిన వారిని నీకు సంబంధించినంతవరకూ సుఖపెట్టాలనే తపనని కూడా నేను గ్రహించకపోలేదు. ఆత్మ అనంత తత్వాన్ని గ్రహించిన నువ్వు — ఈ విధంగా బాధపడటం అర్థంలేనిది కూడాకాదు

కృష్ణా ... నిష్కామ కర్మయోగిగా — లోక హితం కోసం నిన్ను నువ్వు మల్చుకోగలిగితే — నీతోబాటు నీ వాళ్ళుకూడా ధన్యులౌతారని నా ఆశ !''

దృష్టి మరల్చుకున్నాడు కృష్ణారావు.

''కృష్ణా ! తనంట తానుగా ముక్తికి

## క ర్మ యో గి

మార్గం వెతుక్కునేకన్నా - మనోవాక్కాయ కర్మలద్వారా — ఇతరుల్ని సుఖపెడుతూ — తనూ సుఖపడే జీవితం ధన్యం కాదా? ఆ పథంలో నీ లక్ష్యం నెరవేరదా?''

చిన్నగా నవ్వాడు కృష్ణారావు.

''శ్రీకృష్ణపరమాత్మ అర్జునుడితో ఇలాగే చెప్పినప్పుడు అర్జునుడేమన్నాడు బాబాయ్—''

తెల్సి తెలియనట్లు చూశారాయన.

చంచలం హిమనః కృష్ణ; ప్రమాధి
బలవద్ధృఢమ్
తస్యాహం నిగ్రహం ! మన్యేవీ మోరిన
సుదుష్కరమ్.

సరిగ్గా నీలాగే అనుకున్నాడు దేవిన్నైనా నిగ్రహించగలం కానీ వాయువును అరికట్టగలగటం అంత తేలికా? అలాగే మనసును నిగ్రహించాలనుకోటం అసాధ్యం కాదా? కావాలని విషయ వాంఛల్లో చిక్కుకుని — శ్లేష్మంలో పడ్డ ఈగలా - ఇహానికీ పరానికి చెడటం మంచిదా బాబాయ్!''

''ఆ అనుమానాలన్నీ నాలాంటి సామాన్యలకి కృష్ణా రావల్సింది! నీకు కాదు— నేను విన్న దాన్నిబట్టీ— కళ్ళారా చూసిన దాన్నిబట్టీ — 'నువ్వు' అంటే ఏమిటో అర్థం చేసుకున్నాను కఠోర నియమాలతో నిన్ను నువ్వే శాసించుకోగలవు. నీ మనసును నువ్వు స్వాధీన పర్చుకోగలవు తామరాకు పైన నీటి బొట్టులా వుండాలనుకుంటే వుండగలవు.. నీ జీవితం నువ్వు కోరిన విధంగా ధన్యం చేసుకోగలవు ఆ నమ్మకం నాకు కలిగింది కృష్ణా -''

కృష్ణారావు కళ్ళల్లో నీటిపొర మెరిసింది.

''కానీ బాబాయ్!— లోతు తెలియకుండా ఈతకు దిగటం అంతమంచి పనా? సంసార బంధంలోంచి బయట పడటం అంత తేలికా? మొదట్నుంచీ ఈ రకమైన బంధాల పైనా — సుఖాలపైనా ఏ మాత్రం మనసు లేదు. అసలు వాటిని గురించిన ఆలోచనే నాకు రాలేదు. నా లక్ష్యానికి సన్యాసమే సర్వోత్కృష్టమేమో ..

కానీ అమ్మ కన్నీళ్ళను చూస్తుంటే ... మనసు చలిస్తోంది... కానీ ఆవిడని తృప్తి పరచటానికి నా కిష్టంలేని పని చెయ్యనా?... చేసి లక్ష్యం సాధించగలనా?--''

శ్రీహరిగారు వాత్సల్యంతో నవ్వారు.

''నీకు సాధ్యమే కృష్ణా...ఏదైనా సాధ్యమే. అటువంటప్పుడు అందరికీ ఆమోదయోగ్యమైందీ —ముఖ్యంగా మీ అమ్మ మనసు సంతోషపెట్టేదీ... నువ్వు సంసారివి కావటం... ఆ దారే ఎందుకు ఎన్నుకోకూడదు నువ్వు? ఆర్థిక ఇబ్బందులు లేవు. మరే ఇతర బాధలూ — ఆలోచన్లూ నీకుండాల్సిన అవసరంలేదు! ఇప్పుడు

నువ్వనుభవించేదే నిజమైన శోభ. ఆ తరువాతే ముంటుందింక ?

నీ ధర్మం నువ్వు నిర్వర్తిస్తూ — నిష్కామంగా వుంటూనే — కృష్ణతత్వాన్నీ, గీతా రహస్యాన్నీ—నీ తృప్తి కోసం పదిమందికీ బోధించ వచ్చుగా— నీ లక్ష్యాన్ని ఆ రకంగా అమలు జరప వచ్చుగా— నీకు ఇష్టం కుతూహలం లేకుండా చేపట్టిన ఎటువంటి కర్మ ఐనా కేవలం పరుల కోసం. పరుల ప్రయోజనం కోసం. అటువంటి కర్మ చెయ్యటంలో అనుచితముంటుందా ?

ఇతరులు నీ మూలంగా బాధపడుతున్నారేమో... బాధ పెడుతున్నానేమోనన్న అనుమానాన్ని మనసులో దాచుకుని, సన్యాసివైనా — ఆ మనసుకి నిశ్చలత వుంటుందా ?

దానికన్నా— నిష్కామ బుద్ధితో— సంసారం చేస్తున్నా— మనసును నిశ్చలంగా వుంచుకున్న వాడు భగవంతునికి ఆత్మీయుడు కాడా ?

కృష్ణా !— సన్యసించమని చెప్పటం— సన్యసించాలనుకోటం తేలికే— కానీ ఆచరణ ఎంత కష్టం. ఈ రోజుల్లో పది మందినైనా సన్యసించమని వొప్పించగలవా నువ్వు !— కనీసం ఒక్కడైనా— సన్యసించి నీకు వారసుడుగా నిలబడగలడనుకుంటున్నావా ?...

అన్నిటికీ మించిందీ, అందరికీ ఆమోద యోగ్యమైందీ— కొందరికైనా ఆచరణయోగ్యమైందీ ఒక్క కర్మయోగమే.

ఈ ఒక్క విషయం ఆలోచించు కృష్ణా.. నిజానికి ఆ శ్రీకృష్ణ పరమాత్ముడే లోక నియంత కదా. మరి ఆయనెందుకు అగ్ని హోత్రుడికి నమస్కరించేవాడు ?...

సర్వజ్ఞుడు కదా— ఏమీ తెలియని వాడిలా— సాందీపుడి దగ్గర ఎందుకు చదువుకున్నాడు ?

సర్వ సామాన్యుడిలా బంధాలకు కట్టుబడినట్టు ఎందుకు నాటక మాడేవాడు ? తను కాలుడు కదా— అందరి నాశనానికీ అవతరించిన వాడు కదా— మరి పాండవుల పక్షపాతిగా కౌరవుల దగ్గరకు ఎందుకు రాయబారానికి వెళ్ళింది ?...

మూర్ఖుడైన దుర్యోధనుడి మనసు మారదనీ— యుద్ధం అనివార్యమని తెల్సీ— ఎందుకా మూర్ఖుల కంతగా బోధించటం ?...

ఒక్క చూపులోనే అందరి ప్రాణాలూ హరించి కూడా— అర్జునుడికి భ్రమ కల్గించి— ఆ భ్రమ తొలగించటానికి గీతని బోధించిందెవరి కోసం ?

కృష్ణా !— నువ్వు అందర్లా ఆలోచన్లో పడుతున్నావా !— మరి —కర్మయోగం ఎవరికి సాధ్యం ? నీ అంతట నువ్వు సన్యసించి ముక్కు మూసుకు కూర్చుంటే పవిత్రమైన ఆ యోగం యొక్క ప్రయోజనం అనుభవ పూర్వకంగా— ఎవరికి చెప్పగలవు ?...''

కృష్ణ వంక చూశారాయన.

చీకటిని చీల్చుకుని కూడా— ఆ భావాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

''...ఇతరులకోసం మాత్రమే చేసే ఏ కర్మలైనా నిన్ను అంటిపెట్టుకుని వుంటాయా? నువ్వు కోరుకునే గమ్యం గోలోకం. అది నీకు అందుతుంది. కారణం— నీకి శరీరంమీద కాంక్ష లేదు. ఫలాపేక్ష అంతకన్నా లేదు. సుఖాలమీదా— సౌఖ్యాలమీదా— పేరు ప్రతిష్టల మీదా— వ్యామోహం లేదు. కనీసం మోక్షాన్ని కూడా కోరుకోని నిన్ను ఏ అనుభూతులు బాధిస్తాయి ? బాగా ఆలోచించుకుని నీ నిర్ణయం చెప్పు కృష్ణా—''

కృష్ణారావు దీర్ఘాలోచనలో పడిపోయాడు

అతని మస్తిష్కంలో విపరీతమైన అలజడి చెలరేగింది.

ఆలోచన్లు ఉత్తుంగ తరంగాల్లా కలవరం కలిగిస్తున్నాయి.

హృదయ స్పందన అధికమౌతుంది.

లేత గులాబిరంగుగా మారిన చెక్కిళ్ళమీద కణతల అదురు స్పష్టంగా కన్పిస్తోంది.

అతని అరమోడ్పు కనులముందు—

కన్నీటి తెరల చాటున —

అంతరాంతరాలను ఛేదించుకుని — తన అంతరాత్మనుంచే బహిర్గతమైన — తేజో రూపమేదో కళ్ళముందు లీలగా కదిలింది.

ఆ రూపంలోనే అనేక రూపాలు —

ఆ తేజో పుంజాలలో — ఒకటి వివేకానందుని ప్రతిరూపం. మరొకటి రామకృష్ణుని దివ్యాకృతి — ఆ ఆకృతిలోనే శారదాదేవి పవిత్ర రూపం —

ఆ రూపంలోనే .

కృష్ణారావు కళ్ళు ఆర్ద్రతతో మెరిశాయి.

తల్లి తులశమ్మ రూపం — దైన్యంగా— ప్రేమగా—అనురాగంగా—అభిమానంగా, ఆర్తితో— ఆవేదనతో - అంతర్జ్వాలతో — మనోవేదనతో— మమతాపాశంతో —

చేతులు జాపి—పిలుస్తోంది —

ఆ మాతృ హృదయంలో—ఆ తల్లి అణు వణువులో — ఆ కన్నీటి బిందువుల్లో — తన మూర్తి—తన కోసమే ఆ ఆర్తి —

తన కోసమే ఆ తపన —

''అమ్మా !!! — ''

పెదాలు ఆవేదనతో కదిలాయి.

మగతలాంటిదేదో — దట్టమైన ముసుగు వేసింది —

అప్రయత్నంగా కళ్ళు తెరిచాడు కృష్ణారావు.

ఆ వెన్నెల వెలుగులో — ఆ అనంతాకాశంలో — ఆ నిశ్శబ్ద నిశీధిలో — ఆ భయంకర నిశ్శబ్దంలో —

కృష్ణారావు చూపులెటో దూసుకు పోతున్నాయి —

శరీరం గడ్డకట్టినట్టైంది —

హృదయ చలనం ఆగిపోయినట్టుంది.

తన ఉనికి తనకే — అనిశ్చయంగా—అనుమానాస్పదంగా అన్పిస్తోంది—తన ఉచ్ఛ్వాస నిశ్వాసలు తనకే— అసహజంగా విన్పిస్తున్నాయి —

తను ఉన్నాడా ? — లేడా ???

వుంటే—ఏమిటిలా అయిపోతున్నాడు ?

లేకపోతే — తనలో కల్గుతున్న మార్పుకు కారణమేమిటి ?

తనెవరు ???

ఎవరుతను ???

మరో మంచు తెర మందంగా కృష్ణను కప్పివేసింది

మత్తైన భావనేదో గమ్మత్తుగా కృష్ణను కమ్మివేసింది.

నీలి మచ్చుతునక —

నీలాలు పొదిగినట్టు వెలుగు —

ఆ వెలుగును చుట్టుముట్టిన విచిత్ర కాంతి వలయాలు —

ఆ కాంతిలో చల్లదనం —



ఆ చేరువలో తన్మయత్వం —
ఆ సన్నిధిలో అపూర్వానుభూతి —
అనిర్వచనీయమైంది ఆ దివ్యానుభూతి —
అతనిలోనుంచి మరో శరీరం మేల్కొంది—
తన మనోగుడిలో కోటి దీపాలు వెలిగాయి—
వేయి గంటలు మ్రోగాయి —
అలముకున్న సువాసనలమధ్య —
కమ్ముకున్న ధూపదీపాల నడుమ —
అరుదైన ఆ పవిత్ర దేవాలయంలో —
భగవన్నిర్మితమైన ఆ హృదయ పంజరంలో—
జాజ్వల్యమానంగా దైవత్వంవెలిగిపోతోంది—
నీరాజనలందుకుంటోంది —

నీరాజనలందించే తన మూర్తి కూడా దైవాంశతో వెలిగిపోతోంది.

దైవత్వం అభిషేకించబడుతోంది ఆనంద భాష్పాలతో —

పూజింపబడుతోంది హృదయ కుసుమాలతో —

అర్చింపబడుతోంది భక్తిభావనతో —

నిష్కామభక్తి దగ్గరకు అదుముకుంటోంది.

విరహంతో తపించే హృదయకుహరం తన భక్తితో దైవాన్ని బంధించివేస్తోంది.

దైవికమైన ఈ అనుభూతి అపూర్వం.
అసాధారణం.
అనిర్వచనీయం
"కృష్ణా!!!"

తనలో పీఠం వేసుకున్న ఆ దైవాన్ని ఆకృతితో గుర్తించగలిగిన కృష్ణారావు —
నిగ్రహించుకోలేని భావోద్రేకంతో —
అణుచుకోలేని భక్తి పారవశ్యంతో —
ఆర్తితో—
ఆర్ద్రతతో—
ఆవేదనతో—

కన్నీటితో పరవశమై తన్మయుడై పోయాడు—

ఆ ని[illegible]మచ్చుతునక—

అస్పష్టంగానే తను గుర్తించ గలిగిన ఆకృతి—

# కర్మయోగి

క్షణాలమీద రూపులు దిద్దుకుంది.

ఆ నవ్వులో ముత్యాలు కురుస్తున్నాయి—

ఆ విశాల నయనాలలో కాంతి పుంజాలు మెరుస్తున్నాయి—

నుదుట కస్తూరి మిరుమిట్లు గొలుపుతోంది—

శిఖిపించమౌళి అలవోకగా నవ్వుతుంటే —

విలాసంగా వేణువుతో తన హృదయం ద్వారం తీస్తుంటే —

అప్యాయతతో అణువణువునూ స్పర్శిస్తుంటే—

సిద్ధులకూ, సాధ్యులకూ, యోగులకూ— తపోనిష్ఠులకూ— అనితరసాధ్యమూ, అతి కష్టతరమూ ఐన ఆ శ్యామసుందరుని దివ్యమంగళ రూపం—

అంతర్గతంగానే— స్పష్టంగా దర్శించ గలిగిన కృష్ణారావు పులకాంతితుడై తన్మయత్వంతో— బాహ్య స్మృతినే కోల్పోయాడు—

అంతలో మెలకువ—
కొంతలో మైకం—
ఏమీ తెలియని అంధకారంలో—
అన్నీ తెల్సినట్టున్న చిత్ర భ్రమలో—
తెలిసీ తెలియనిఅయోమయ స్థితిలో—
తెలివే స్థంభించిన విచిత్ర క్షణాన—
చిత్రంగా అంతర్వాణి పలుకుతున్న భావన—

ఆ వాణిలో లోకాన్నే శాసించగల నియంత స్వరం—
కఠినంగా—
గంభీరంగా—
మృదువుగా —
మధురంగా—
శాసిస్తూ— ఆజ్ఞాపిస్తూ—
లాలిస్తూ— పాలిస్తూ—
ఆత్మీయంగా—ఆదరంగా—

తనువునూ, మనసునూ, మరో లోకానికి తీసుకుపోతూ—

ఆధారమే కోల్పోతున్నట్టున్న తనకి ఆధారంగా తానున్నానంటూ—
అనాధననే భావాన్ని—పారద్రోలుతూ—
సనాధగా తనని ఆశీర్వదిస్తూ —
సందేహాలను పటాపంచలు చేస్తూ—
కర్తవ్యాన్ని బోధిస్తూ—
కార్యాన్ని సూచిస్తూ — భవిష్యత్ ను నిర్దేసిస్తూ—
ప్రయోజనాన్ని ఆపాదిస్తూ—

భవిష్యత్‌ను నిర్దేసిస్తూనే పరమపదానికి దారి చూపుతూ—

ఆ శ్రీకృష్ణ భగవానుని వాణి — కంచు గంటలా గుండెల్లో మ్రోగుతోంది — మనసులో హత్తుకుపోతోంది.

తత్క్షణమే కర్తవ్యాన్ని పాటించాలనే కాంక్ష కలుగుతోంది.

భగవానుడు నిర్దేశించిన దారిలో—

మాతృ ఋణం తీర్చుకునే అవకాశాలున్నాయి —తీర్చుకోవాలనే ఆంక్షతో వున్నాయి.

తక్షణమే లేచి ఆ అవకాశాలను వినియోగించుకోవాలని వుంది—

ఆ ఆంక్షలను మహదానందంగా శిరసావహించాలనీ వుంది—

చిత్రంగా మళ్లీ మైకం—
మళ్లా చిత్రాతి చిత్రమైన అనుభూతి —
ఆ అనుభూతిలోనే అంతర్వాణి —

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతియః
లిప్యతే నసపాపేన పద్మపత్రమి వాంభసా

కర్తృత్వము భగవంతుని మీదవేసి — కర్మలు చేసేవానికి పాపము అంటదు.

యజమాని ఆజ్ఞలు నెరవేర్చు సేవకునికి పుణ్య పాపాలతో సంబంధం వుండదు —

తేనెలూరే పెదాలనుంచి అమృతం కురుస్తున్నట్టుంది.

సమ్మోహనమైన వేణునాదంలా—హృదయ తంత్రులు మీటుతోంది —

ఆత్మోపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వాయది వా దుఃఖం సయోగీ పరమో మతః

ఆత్మ అన్నిటిలోనూ—సమంగా వుందన్న జ్ఞానం వున్నా— దేహ సంబంధములైన ఇతరుల సుఖదుఃఖాలను తనవిగా చూసుకునే వాడే శ్రేష్ఠుడు.

ఫన్దనం చపలం చిత్తం దురక్షం దున్నివారయం—
ఉజాంకరోతి మేధావీ ఉసుకారోవ తేజనం.

(ఇంకా వుంది)



# భలే బేరం!

ఒక అందమైన
స్టీలు గ్లాసు
కేవలం
రూ.2-25లకు











సూపర్ పవర్

# రీగల్

మురికిని నిర్మూలిస్తుంది
బట్టలను కాపాడుతుంది




షా వాలెస్ వారి విశిష్ట ఉత్పాదన.

సూపర్ పవర్ రీగల్ బహుమతి లేకుండాను లభించును

ACIL/0743/84 Tel




### కె. కె. ఆర్. – హైదరాబాద్

నా కుడి కన్నుకు మెల్ల వున్నది దీనిని నేను మూడు సంవత్సరముల క్రితం నుండే గమనిస్తున్నాను. దీనిని నివారించుటకు ఆపరేషన్ చెయ్యాలా? ఆపరేషన్‌కి ఎంత ఖర్చవుతుంది ? హాస్పటల్‌లో ఎన్నిరోజులు వుండాలి ?

★ ఆపరేషన్ చెయ్యటం అన్నది ఆ మెల్ల ఏర్పడటానికి కారణమైన పరిస్థితిని అనుసరించి ఉంటుంది. కొన్నిరకాల మెల్ల కనులకి ఆపరేషన్ అవసర మవుతుంది. కొందరికి కంటి ఎక్సర్‌సైజులు సరిపోతాయి. మరికొందరికి కళ్లజోడు వాడవలసి ఉంటుంది. నిపుణులైన నేత్ర వైద్యులను కలసి సంప్రదించండి.

### జి. వి. – ఆదోని

నా వయస్సు 19 సంవత్సరములు. నా ఎడమ చెవి పోగుల పెట్టుకునే రంధ్రం దగ్గర గచ్చకాయ సైజులో గడ్డ లేచింది డాక్టరు ఆపరేషన్ చేసి గడ్డను తీసేసారు. నాలుగు నెలల తరువాత మరలా గడ్డ వచ్చినది. ఈ గడ్డ ముందున్న కంటె పెద్దదిగా వికారంగా కనిపించుచున్నది. వేరే డాక్టర్‌కి చూపించాను. మరలా ఆపరేషన్ చెయ్యాలన్నారు. మీ సలహా ఏమిటి ?

★ దీనిని కీలాయిడ్స్ అని అంటారు. శరీర తత్వాన్నిబట్టి కొందరికి మాత్రం ఇలా రావటం జరుగుతుంది. మరలా ఆపరేషన్ చేసినా అధికం అయ్యే అవకాశం లేకపోలేదు.

### వి. యస్. ఆర్. – ఈదేపల్లి

నాకు 66 సం॥లు రెండు సం॥ క్రితం టి యు. ప్రోస్టెక్టమీ ఉస్మానియా ఆస్పత్రిలో జరిగింది – కాని మూత్ర ధార యధాస్థితికి రాలేదు. మొదట సన్నగా దారం వలె పడి తర్వాత బొట్లుగా పడుతుంది—మూత్ర విసర్జన చాలాకాలం పడుతుంది.

★ మీకు స్ట్రిక్చర్ యూరిత్రా ఉన్నది. అంటే మూత్ర నాళంలోని రంధ్రం ఒకచోట చాలా చిన్నదిగా ఉందని అర్థం. దీనికి అప్పుడప్పుడు డైలటేషన్ చేయించటమే ప్రస్తుతం ఉన్న చికిత్సా విధానం.




### ఎస్.ఎస్. – కొత్తగూడెం

నా వయస్సు 21 సంవత్సరములు. నాకు కంట్లో నీరు కారుతూ వుంటుంది. డాక్టర్‌కి చూపిస్తే కళ్ళజోడు వాడమన్నారు. కళ్ళజోడు వాడినా, మందులు వాడినా నీరు కారుట తగ్గలేదు, ఇప్పుడు కంట్లో పుసులు కడుతున్నాయి. ఇలా పుసులు కట్టటం కంటిచూపుకి ఏమైనా హానిచేస్తుందా ? దీనికి ఏమి వైద్యము చేయాలి?

★ మీరు నిపుణులైన నేత్ర వైద్యునికి చూపించుకోవలసి ఉంది. వారు పరీక్షించి కంటి పైపొరలో వాపు ఉన్నదీ లేనిదీ, కన్నీటి నాళంలో వాపు ఉన్నదీ (డాక్రోసిస్టైటిస్) లేనిదీ నిర్ణయిస్తారు పుసులు కట్టటం సూక్ష్మ క్రిములు ప్రవేశించాయనటానికి నిదర్శనం ఇలా పుసులుకడుతూ ఉన్నప్పుడు వైద్యునికి చూపించి కంటికి ఆయింట్‌మెంట్ వాడవలసి ఉంటుంది అలక్ష్యంవేస్తే ఇతర రోగాలు వచ్చే అవకాశం ఉంటుంది.

### ఆర్. బి. – నెల్లూరు

బ్రెయిన్ ట్యూమర్ అంటే ఏమిటి ? ఈ వ్యాధి ఎందువలన వస్తుంది ? దీనికి మందేమీ లేదా ?

★ మెదడులోని ఏ భాగంలోనైనా "కురుపు" వంటిది వస్తే దానిని బ్రెయిన్ ట్యూమర్ అని అంటారు.

ఈ రోగం రావటానికి ఫలానా కారణం అని ఇంతవరకు ఏదీ కనుగొనబడలేదు.

న్యూరో సర్జన్లు ఈ ట్యూమర్‌లను శస్త్ర చికిత్స ద్వారా తీసివేయగల అవకాశం ఉంటుంది.

తలనెప్పి, వాంతులు, బుద్ధిమాంద్యము, ఫిట్లు, మగత, దృష్టి మాంద్యము మొదలయినవి ఈ రోగ లక్షణాలు.

### ఎస్. ఆర్. – నెల్లూరు

నా వయస్సు 18 సంవత్సరములు. నాకు క్రిందటి సంవత్సరము ఏక్సిడెంట్ అయి తలకు దెబ్బ తగిలినది. బ్లడ్ క్లాట్ అయినది. మందులు వాడాను. కాని ఇప్పుడు తలనెప్పి తీవ్రముగా వచ్చుచున్నది. నిద్రపోయి లేచిన తరువాత తలనెప్పి చాలా ఎక్కువగా వుంటుంది. ఇది తగ్గాలంటే ఏమి చెయ్యాలి ?

★ బ్లడ్ క్లాట్ అయిందని ఎవరు చెప్పారు? అలా అయి ఉంటే వెంటనే శస్త్ర చికిత్స ద్వారా తీసివేసి ఉంటారు. తల పైభాగంమీద ఒకవేళ మీరు అన్న క్లాట్ ఏర్పడి ఉంటే (ఒకవేళ బొప్పి కట్టి ఉంటుందేమో) దానికీ తలనెప్పికీ సంబంధం లేదు. న్యూరో ఫిజీషియన్లకి చూపించండి.



ప్రియమైన నారాయణా !

మీకు ఆశీస్సులు !!

ఈ ఉత్తరం బహుశః నేను బూడిదై పోయాక నీ కళ్ల బడుతుందని అనుకొంటున్నాను ! పక్షవాతంతో కుడిచెయ్యీ, కాలూ పడిపోయిన పధ్నాలుగు సంవత్సరాల తర్వాత— ఇప్పుడు ఎడంచేత్తో పట్టేపట్టి వ్రాస్తూ ఉంటే చాలా చిరాగ్గా, బాధగా ఉంది ! అయినా వ్రాస్తాను ! ఈ నాలుగు మాటలూ కూడా నేను వ్రాయకపోతే నా గుండె బరువు తగ్గదురా !!




బాబూ ! నిన్ను కలక్టర్ చెయ్యాలని మీ అమ్మ కలలుకనేది నీ చిన్నప్పుడు ! నిర్భాగ్యుణ్ణి ! నిన్ను కలక్టరాఫీస్‌లో గుమాస్తాగా మాత్రమే చేయగలిగాను ! అందులో నీ తప్పేమీ లేదురా ! కలక్టరవడానికి తగిన తెలివితేటలు నీకున్నా, నీతి నిజాయితీగా గుమాస్తాగా ఉద్యోగం వెలగబెట్టిన నేను నీకు పెద్ద చదువులు చెప్పించలేకపోయాను !

నీకు పదేళ్ల వయస్సప్పుడు—నీకు జ్ఞాపకం ఉందా ? మీ అమ్మకు పచ్చకామెర్లు వచ్చాయ్ ! పెద్ద డాక్టర్‌కు చూపెట్టడానికి డబ్బుల్లేవు నా దగ్గఱ. నా స్థితి నెరిగిన మీ అమ్మ ఏవో ఆకుపసర్లూ—అర్థంలేని పధ్యాలూ చేసింది. కామెర్లు తగ్గినట్లే తగ్గి, మళ్ళీ తిరగబెట్టి మీ అమ్మను ఈ లోకం నుంచి తీసుకుపోయాయ్! ''పెళ్లానికి సరైన వైద్యం చేయించక చేతులారా చంపుకున్నాడు—'' అని లోకం కాకుల్లా పొడుస్తున్నా మొండిగా బతికాను ! ఎందుకో తెలుసా ! నీ కోసం !!

ఆ రోజు...నువ్వు ఉద్యోగంలో చేరవలసిన రోజు !! నేను మనస్సులో ఎంత కుమిలిపోయానో! నిన్ను కలక్టర్ చదువు చదివించాలని తల్లడిల్లిన మీ అమ్మ పైనుండి ఎంత క్షోభపడ్డదో ? మెడ దగ్గర చిరిగిపోయిన చొక్కాతో సర్టిఫికెట్లు పట్టుకుని గుమాస్తా ఉద్యోగంలో జాయిన్ అవడానికి నువ్వు వెళుతుంటే నాకు నిజంగా ఏడుపొచ్చిందిరా! నారాయణా!! ఎల్లాగో దిగమింగుకుని అన్నాను ''బాబూ ! మొదటి జీతం అందుకోగానే రెండు జతల బట్టలు కుట్టించుకో'' అని. కానీ నీ చిరునవ్వే నాకు సమాధానం అయ్యింది అప్పుడు ! నువ్వు అచ్చం మీ అమ్మ పోలిక కదా ! కష్టాల్ని చిఱునవ్వుతో ఎదుర్కోడం దానికీ, నీకే చేతవును !

నెలాఖరుని కొత్తపంచ, చొక్కాగుడ్డ తెచ్చి ''నా మొదటి జీతంతో కొని తెచ్చాను ! కాదనకు నాన్నా !'' అని నా చేతిలో పెట్టి, నా కాళ్లకు నమస్కారం పెట్టావ్ ! నీ పితృప్రేమకు నా మనస్సు గర్వంతో నిండిపోయిందిరా ఆనాడు !

నేను దూరదృష్టి లేనివాణ్ణి! చవటనోయ్! చవటను !

''నాన్నా ! పెళ్లి జీవన్మరణ సమస్యకాదు! నైట్ కాలేజీలో బి. యె చదువుతాను ! నాకు వచ్చే జీతం తక్కువ ! నా జీతంమీద ఈ రోజుల్లో ముగ్గురు బ్రతకాలంటే కష్టం !'' అని నువ్వు నాకు చెబుతున్నా, ''ఏమో. కుఱ్ర సన్నాసి సిగ్గుపడి అల్లా అంటున్నాడేమో చక్కని గుణవంతురాలైన పిల్ల దొరికింది'' అనుకుని నిన్ను పోరి పోరి పెళ్లిపీట ఎక్కించాను! తర్వాత్తర్వాతగానీ నువ్వు చెప్పిన మాటలు నాకు నిజం అని తోచలేదు !

ఈ రోగిష్ఠి వాడికోసం...

అన్ని సరదాల్నీ చంపుకుని పదేళ్లుగా కాపురం చేస్తున్న మిమ్మల్నిద్దర్నీ ఏవని మెచ్చుకోవాలో నాకు మాటలు దొరకడంలేదు !

మంచంమీంచి కదల్లేని నాకు ఏం అవసరం వస్తుందోనని మీరు సినిమాలు మానుకున్నారు ! షికార్లు మానుకున్నారు ! చిలకాగోరింకల్లా — స్వేచ్ఛగా ఆడుతూ, పాడుతూ ఉండవలసిన ఈ వయస్సులో ఈ ముసలి రోగిష్ఠివాడికోసం సరదాలన్నీ చంపుకుని— రాత్రీపగలూ వంతులు వేసుకుని నా అవసరాల్ని కనిపెట్టుకుని ఉన్నారా ? నా వెఱ్ఱినాగన్నల్లారా !!

చిన్నప్పుడు నా నేస్తాలు తూనీగల్ని పట్టుకుని వాటి తోకలికి చిన్నరాళ్లు కట్టి వదిలేవారు ! అవి పైకి ఎగురుతూ మళ్లీ కిందకు దిగిపోతూ పడిపోతూఉంటే వాళ్లంతా తప్పట్లు

కొట్టి ఆనందించేవారు నాకు నిన్నూ, కోడల్ని చూస్తుంటే ఆ రాళ్ళు కట్టిన తూనీగలే జ్ఞాపకం వస్తున్నాయ్‌రా !!

కోడలు సుగుణ !! ఆ అమ్మాయ్‌ని కోడలు అని పిలవడమే తప్పేమో ! నాకు కూతురులేని లోటు తీర్చింది !

నన్ను ఈ పదేళ్ళుగా కంటికి రెప్పలా కాచింది !

కాలూ చేయీ బాగుండి చాకిరీ చేసే అత్తమామల్నే చీదరించుకునే కోడళ్ళు ఎక్కడబడితే అక్కడ సాక్షాత్కరిస్తున్న ఈ రోజుల్లో కోడలుపిల్ల తప్పబుట్టిందిరా ! సుగుణ నిజంగా సుగుణే !!

ఎడంచేత్తో నేను అన్నం తినడానికి ఉపక్రమిస్తుంటే, తాను అన్నం కలిపి నా నోటికి అందించింది !

ప్రతి అరగంటకు వచ్చి నా అవసరాల్ని అడిగింది !

ఊడిపోతున్న పంచను బిగించి కట్టుకోలేక చేతికి పట్టుదొరక్క సిగ్గుతో అవస్థలు పడుతుంటే నా కోడలు వచ్చి నాకు పంచ బిగించి వెళ్ళేది !

ఎలా ? చిరాకుతో కాదు! విసుగుతోకాదు

దేవుణ్ణి పూజించేటప్పుడు "వస్త్రం సమర్పయామి" అన్నప్పటి భక్తి ప్రపత్తులతో !!

"నా కొడుకూ, కోడలూ నన్ను సరిగ్గా చూడ్డంలేద"ని కనిపించిన వాడికల్లా చెప్పుకుని ఏడ్చే నా స్నేహితులకి నా భాగ్యాన్ని చెప్పి, వాళ్ళు అసూయతో ఏడ్చి ఛస్తుంటే నాకు చూడాలని ఉంది ! కాలూ చేయీ లేని నాకు ఈ కోరిక తీరలేదురా !

నా కోసం, ఈ కదలలేని, ముసిలివాడి కోసం, మీ ఆశలు సరదాలూ అన్నీ చంపుకొని — మీ ఇద్దర్లో నాకొరకు కాలైతే, ఒకరు చెయ్యి అయి నా బతుకును ఏ లోటూ లేకుండా నడిపి

# పండుటాకు - పసిచిగురు

స్తుంటే— నాతో నేను—నా మీద నేను— సంతోషపడనా ? జాలిపడనా ? గర్వపడనా? ఏడవనా ??

చాలా సార్లు అనిపించేది ! ఆత్మహత్య చేసుకోవాలని ! కానీ ! విషం కొనుక్కోడానికి కూడా నాలుగడుగులు వేయలేను కదా ! "నన్ను ఈ లోకం నుండి త్వరగా తీసుకుపో ! తండ్రీ!" అని భగవంతుణ్ణి ప్రార్థించడం తప్ప ఏమీ చెయ్యలేకపోయాను !

ఆ పరమాత్ముడికి నా మీద దయలేదు ! సుమారు పధ్నాలుగేళ్ళు నాకు కఠిన కారాగారశిక్ష విధించి పడేసాడు

జీవితం చాలించే శుభఘడియలు నాకు దగ్గర్లోనే ఉన్నాయనిపిస్తోందిరా ఈ మధ్యన !

కానీ, ఒక్క కోరిక మాత్రం నాకు తీరలేదురా !

నువ్వు ఆఫీసుకు వెళ్ళిపోతావ్ ! కోడలు వంట ఇంట్లో ఏవో పనుల్లో మునిగిపోతుంది ! అప్పుడు ఈ గదిలో నాకేమీతోచేది కాదు ! "ఒక్క చిన్ని మనవడు ఉంటే కాలం ఎంత బాగా గడిచేదో !" అనిపించేది ! మీరు వాణ్ణి మన మధ్యకు ఎందుకు తీసుకురాలేదో నాకు తెలుసు ! నీ చిన్ని జీతంలో నలుగురైతే బ్రతకలేమనే కదూ ?

ఈ ఆలోచన నాకు వచ్చినప్పుడల్లా నా వ్యర్థ జీవితం మీద నాకు ఎంత అసహ్యం కల్గుతోందో చెప్పలేను !

నా జీవితం ముగింపుకి వస్తోంది ! నా స్థానంలో ఏడాది తిరక్కుండా మీరు ఒక బుజ్జిగాణ్ణి ఈ ఇంట్లోకి తీసుకురావాలి ! ఇది అభ్యర్థనకాదు నీ ప్రియాతి ప్రియమైన తండ్రి శాసనం అనుకో !

ఎక్కడో చదివాను "పండుటాకులు రాలిపోతేనే పసి చిగుళ్ళకు స్థానం" అని !

ఈ సంసార వృక్షంలో పసిచిగురు మొలకెత్తడానికై పండుటాకునైన నేను ఎంత గమ్మున రాలిపోతే అంత అదృష్టవంతుణ్ణి !"

నాల్గురోజులబట్టీ ఈ ఉత్తరం కొంచెం కొంచెం వ్రాస్తున్నాను ! ఇంక ఎక్కువ వ్రాయలేను ! చెయ్యి బాధ పెడుతోంది !

ప్రతినెలా ఒకటో తారీఖుని జీతం అందుకుని నువ్వు నాకు పదిరూపాయలు ఇస్తూ వచ్చేవ్ "నాకెందుకురా! మంచం దిగలేనివాణ్ణి" అంటే "నీకు ఏదైనా తినాలనిపిస్తే పక్కింటి పిల్లల చేత తెప్పించుకో" అనేవాడివి !

ఈ పధ్నాలుగేళ్ళుగా నువ్విచ్చిన డబ్బు నా తలగడలో దాచి ఉంచాను ! సుమారు పదిహేను వందలకు దగ్గరగా ఉంది ! అది తీసుకోండి !

నేను చచ్చిపోతే నా కోసం మీరు ఒక్క కన్నీటి చుక్కకూడా విడవడానికి వీల్లేదు ! ఇన్నాళ్ళూ ఇన్నేళ్ళూ మీ అభిమానాన్ని, ప్రేమనీ, సహనాన్నీ, సేవనీ, నేను భరించలేకపోయాన్రా ! రేపు నేను చచ్చేకైనా మీరు నన్ను ఒక్కసారి ఒక్కసారైనా ద్వేషిస్తేనే నాకు ఆత్మతృప్తి !!

నేను దాచిన డబ్బులో అయిదు వందలు మీ ఇద్దరినీ దానితో హాయిగా, సరదాగా నాల్గాళ్ళూ తిరిగి రండి ! వెయ్యి రూపాయలు మాత్రం ఈ ఇంట్లో పుట్టబోయే నా మనవడికి తాతయ్య బహుమతి !!

ఏడాది తిరక్కుండా ఈ ఇంట్లో నా మనవడు తప్పటడుగులు వేస్తూ తిరగాలి ! నా చివరి కోరిక తీరుస్తారు కదూ ??

భగవంతుడు మళ్ళీ జన్మించమని నాకు శిక్ష విధిస్తే, ఆనందంగా మీ కడుపునే పుడతానని కోరుకొని మీ రుణం తీర్చుకోవాలనుందిరా !!

ఒరే నారాయణా ! సుగుణా !

మీ ఇద్దరికీ నా ఆశీస్సులు ! కాదు నమస్కారాలు !!

ఇట్లు
శ్రీరామచంద్రమూర్తి

* * *

నారాయణా, సుగుణా పీటల మీద కూర్చున్నారు

సుగుణ ఒడిలోని బిడ్డ కేరింతలు కొడుతున్నాడు

"చెప్పండమ్మా ! అబ్బాయికి ఏం పేరు పెడుతున్నారు ? అయ్యా ! ఉంగరంతో ఆ అబ్బాయి పేరు మీరు బియ్యంలో వ్రాయాలి !!" అన్నాడు పురోహితుడు !!

నారాయణ ప్రశ్నార్థకముగా సుగుణకేసి చూసాడు !

ఆమె భక్తితో అంది "శ్రీరామచంద్రమూర్తి"

బియ్యంలో శ్రీకారం చుడుతున్న నారాయణ కళ్ళు ఆర్ద్రమైనాయ్ !! ★

చంద్రమోహన్ ఫాన్స్ అసోసియేషన్, విజయవాడ వారు ఇటీవల ప్రముఖ రేడియో, సినీ సంగీత దర్శకుడు శ్రీ మల్లిక్‌కు సన్మానం చేసిన సందర్భంగా తీసిన చిత్రం మల్లిక్ దంపతులని, శ్రీయుతులు పి సత్యనారాయణ, డి. వి ఎస్ ప్రకాష్, కె దామోదరరావులని ఫొటోలో చూడవచ్చు



# ప్రభుత్వోద్యోగులు త్యాగమును చూపవలెను

## ప్రధానమంత్రిగారి హెచ్చరిక



సి. రాజగోపాలాచారిగారు

ఈ నెల 2–తేదీన లాలీహాలులో దక్షిణ యిండియా మహామ్మదును ఎద్యుకేషనలు అసోసియేషను వారు యీమధ్య జరిగిన కాన్వొకేషనులో పట్టములను బడసిన ముస్లిము యువజనుల కందరికిని స్వాగత మొసగిరి. ఆ సంఘమువారి కోరిక ప్రకారము ఆ సభలో ప్రధానమంత్రి ఆనరబులు సి. రాజగోపాలాచారి గారు ఉపన్యసించిరి.

“మీరు వీలైనంతవరకు భోగములను త్యజింపవలెను. దురదృష్టవంతులగు సోదర మానవులకు శక్తివంచన లేకుండ సేవచేయుచుండవలెను. టాకుటీకుగా నగరములలో భోగపరాయణులై యుండుట కంటె గ్రామములలో బడి పంతులు పనిచేసి చాలమంది పిల్లలకు విద్యాదానము చేయుటయే ఉత్తమము.

ఇపుడు మనదేశమునందు దారిద్ర్యము చాల అధికమైనది. కావున విద్యనేర్చిన యువజనులు చాల శ్రద్ధగా పనిచేయవలెనుగాని వెనుకటివలెనే యుండగూడదు. పునాదులు సుస్థిరముగానున్నచో ప్రమాద మేమియును కలుగదు. ప్రస్తుతము ప్రభుత్వ వ్యయములు మిక్కిలి హెచ్చుగా నున్నది గాన అందువలన దొరతనమువారి కెట్టి సహాయమును చేయజాలకుండ నున్నారు. కావున అనుకూల స్థితిలో నున్నవారందరును చాలా త్యాగమును చేసి బీదవారికి తోడ్పడవలెను.

ప్రభుత్వ శాఖలలో నొకశాఖలో వ్యయముతను తగ్గింపజూచినచో యింకొకశాఖలో మొదట తగ్గింపకూడదా అను ప్రశ్న కలుగుచున్నది.

ఇపుడు ప్రజలును మంత్రులును కూడా చాల సద్భావమును వెల్లడించుచున్నారు. ఇది స్థిరముగా నున్నచో మేము చాలపని చేయగలుగుదుము. మేము తీరా పనిని ప్రారంభించిన పిమ్మట స్వార్థపరత్వము వలన నీ సద్భావము తొలగిపోయినచో మంత్రులు మేమియును చేయజాలరు. ప్రజలలో త్రాగుడు వ్యసనము మిక్కిలి హెచ్చుగా నున్నది. సాయంకాలము ఫ్యాక్టరీలో కూలీ చేతికి రాగానే పనివాండ్రు మొదట కల్లు దుకాణము కడకే వెళ్లెదరు. అందువలన యింటికేగుసరికి చేతిలో ధనమును ఒంటిపైని స్మృతియును గూడ లేకుండపోవును. దీనిని నిర్మూలించుటకు దొరతనము వారిపుడు పూనుకొనదలచిరి అందువలన మొట్టమొదట ఆదాయము తగ్గిపోవును. కానదానికి సరిపడునట్లు వ్యయములను తగ్గించవలెను. దొరతనము వారి పరిశీలనకు లోబడిని వ్యయము చాల హెచ్చుగానిపుడు ఒరుగుచున్నది. సైన్యమునకు 50–60 కోట్లు వ్యయమగుచున్నది. వీనిని తగ్గింపవలెనని నేనడుగ వీలులేదు. సివిలు సర్వీసు వారి జీతములను తగ్గించవలెననిన దానిని ఇండియా మంత్రియే చేయవలెను. అంత వరకును నేను మిన్న కుండవలసినదేనా? సైనిక వ్యయములను సివిలు సర్వీసుశాఖ వ్యయములను తగ్గించబడు వరకును తమకిపుడు లభించుచున్న జీతములను తగ్గించుటకు ఇతరులు తమంతట తామే అంగీకరించవలెను. వారు జీతములను తగ్గించుకొను నెడల వారి కుటుంబ వ్యయములను గూడా వారు తగ్గించుకొనవలసియె యుండును.

ప్రాచీన కాలమునందు కాలీఫులు పరిపాలకులుగా నున్నపుడు ఇప్పటి ప్రభుత్వోద్యోగుల వలె వారు భోగపరాయణులుగా నుండియుండ లేదు. వారు చాపలమీద కూర్చుండియె రాచ కార్యములను నెరవేర్చు చుండిరి. వారికి ఎలక్ట్రిక్కు దీపములు పంకాలు లిఫ్టులు కాలుబెల్లులు మున్నగున వేమియునుండ లేదు. అందువలన వారివలెనే మనము గూడ వ్యయములను తగ్గించుటలో కష్టమేమియును లేదు ప్రతి విషయములోను వ్యయములను తగ్గించవలెను అందరును గాంధి మహాత్ముని వలె సర్వసంగ పరిత్యాగమును చేయవలెనని నేను కోరుట లేదు కాని చాల వరకు వ్యయములను తగ్గింప వచ్చునని యే నేను తెలుపుచున్నాను ఇతరుల బలవంతము వలన గాక స్వేచ్ఛకముగానే మీరిట్టి త్యాగమును చేయవలెను మీకు సమానులగు నితరులు త్యాగము చేయకపోయినను మీరు త్యాగము చేసి వారికి మార్గదర్శులు కావలెను. మేము అధిక సంఖ్యాకులవలన ఎన్నుకొనబడితిమి గాన ప్రజల అధికారము పేరట మేము నిర్బంధించి అనేకపనులను చేయింపగలముగాని అది నాకిష్టము లేదు. ప్రజలు ఐచ్ఛికముగానే త్యాగము చేయవలెను.

ఇటుపైని ప్రభుత్వోద్యోగములలో చేరగోరు వారికి జీతములను తగ్గించుటకు మేము విధిగా నిశ్చయించితిమి. కాని ఇపుడు ఉద్యోగములలో నున్నవారు ఐచ్ఛికముగానే తక్కువ జీతములను పుచ్చుకొనవలెను. ఇపుడు పట్టములనుబడసిన మీరీ విషయమున మార్గదర్శులు కావలెను కోట్ల కొలదిగానున్న బీదవారికి మేలు చేయుటకు ప్రజలందరును వ్యయములను తగ్గించవలెను మీరు ఆచరణపూర్వకముగా వారికి బోధించవలెను. ప్రజలందరును, ఇపుడు ప్రభుత్వోద్యోగులుగానున్నవారును ఇటుపైని ప్రభుత్వోద్యోగ



## ప్రధానమంత్రి హెచ్చరిక

ములను బడయుగోరువారును గూడ త్యాగము చేయవలెను లేనిచో మంత్రులేమియును చేయజాలరు వివేకము గలవారికి భోగమువలనగాక త్యాగమువలననే అధికమగు ఆనందము కనబడును పరుల కష్టములను తొలగించుటవలన కలుగునట్టి సంతోషం మరి దేనివలనను కలుగదు స్వార్థపరత్వము వలన శరీరారోగ్యమును ధీశక్తియును గూడ చెడిపోవును భగవద్భక్తి అంతరించును వారు త్వరలోనే అతి నీచముగా మృతినొందెదరు త్యాగమువలన అత్యధికమగు ఆనందముకలుగును

వెనుక రివిన్యూ మెంబరుగానుండిన సర్ చార్లెసు సౌటరుగారు వేలకొలది జీతమును పుచ్చుకొనుచుండిరి ఇపుడు నేను నెలకు 500 రూపాయలను మాత్రమే పుచ్చుకొనదలచితిని అందువలన సౌటరుగారికున్న సంతోషము నాకు లేదని మీరు తలచెదరా ? వెనుక పబ్లికు వర్క్సు మంత్రిగా నున్నవారికి 5000 రూపాయిలు జీతమిచ్చుచుండిరి ఇపుడా పదవిలోనున్న యాకూబు హాస్సేనుగారుగూడ నెలకు 500ను మాత్రమే పుచ్చుకొనుట కంగీకరించిరి ఇందువలన యాకూబు హాస్సేనుగారికే అధికమగుసంతోషము కలదు ఇపుడు సబుజడ్జీల కియ్యబడుచున్న జీతములో సగము జీతమిచ్చిననే మాకు చాలును, మేము సబుజడ్జీలుగా పనిచేసెదము అది మీరు తెలుపునెడల అది ప్రశంసనీయము

ఇటుపైన ప్రభుత్వోద్యోగములను బడయ గోరువారు యే మతమువారైనను సరే నూరు రూపాయలకు పైబడిన జీతముగల ఉద్యోగములకు సగము జీతము మాత్రమే పుచ్చుకొనవలెను విశ్వవిద్యాలయమువారు విద్యార్థులలో యిట్టి త్యాగభాగమును కలిగించునెడల దేశమునకు చాల మేలు చేసినవారగుదురు

ఇపుడు సివిలు సర్వీసు ఉద్యోగులుగా నున్న వారి విషయమును తలపెట్టకుడు ఇటుపయిని చాల మార్పు కలుగగలదు భారత భావిభాగ్యము మీ చేతులలో నున్నది చిరకాలమునుండి నిరంకుశాధికారులుగానున్న ప్రభుత్వోద్యోగులుకూడ నిపుడు మీ ఆశయములపట్ల సానుభూతిని తెలుపుచున్నారు నాకు వారితో యెక్కువ సంబంధము కలిగినది కావున వారి నిజాభిప్రాయమును నేను తెలుసుకొనగలిగితిని చిక్కులన్నియు దేశీయులవలననే కలుగునుగాని సివిలు సర్వీస్ వారి వలన కలుగవు అని రాజగోపాలాచారిగారు నుడివిరి 

ఆంధ్రపత్రిక
1937 ఆగష్టు 11
పంచిన మంచి



# సినిమా విశేషాలు

-జి. వి. జి.



''నాకు మేకప్ టెస్టు చేసి చూసారు రాజకీయాల్లోకి పనికిరానని తేల్చేశారు !''

## "పులిజూదం"లో ప్రాయశ్చిత్తం

సొప్పకట్టను పడేసినట్లు కరణాన్ని (పి ఎల్ నారాయణ) ఆస్పత్రి బెంచీమీద పడేశాడు వేణు (కృష్ణ) ''డాక్టరమ్మా, పెద్ద మనిషొచ్చాడు చూడు,'' అన్నాడు

రాధ (జయసుధ) చూసింది ''ఏమిటి ? ఏమైంది ? చెయ్యి విరిగిందా ?'' అడిగింది

''కాదు, కాలు,'' అన్నాడు వేణు

''పంచాయతీకి ప్రతీకారమా ?''

కరణం బాధతో మూల్గి, ''ఇది ప్రతీకారం కాదమ్మా, ప్రాయశ్చిత్తం,'' అన్నాడు

''ఏయ్ ! సంస్కృతం మాని తెలుగులో చెప్పు డాక్టరమ్మ నన్నసలే రౌడీగాడ్ననుకుంటుంది,'' అన్నాడు వేణు

''పంచాయితీలో ఆ అమ్మాయిచేత అబద్ధం చెప్పించాము,'' అన్నాడు కరణం హీనస్వరంలో

''మరి, నువ్వు చేసిన ఆ పాడుపని ఏమిటో కూడా అలాగే తేటతెలుగులో చెప్పు !''

''ఏముందీ కుండ కనబడితే కుక్క మూతి పెట్టకుండా ఉంటుందా ?''

''సిది కుక్కబుద్ధే అనుకో తరువాత ?''

''ఏముందీ – మీరొచ్చి నా మూతి పగల గొట్టారు ఎముకలిరగ్గొట్టారు ఇక్కడ తెచ్చి పడేశారు అసలే ఆర్డినెన్సులో ఉద్యోగం పోయి ఏడుస్తున్నా, నువ్వొక్కో అల్లరి చెయొద్దు,'' అంటూ వేణు కాళ్ళట్టుకుని లేచిన కరణం, రాధవంక తిరిగి, ''ఎముకలు విరగలేదు కదమ్మా ?'' అని అడిగాడు

''అబ్బే ఏం లేదు చక్కగా ఇంటికెళ్ళి కాపడం పెట్టుకోండి,'' అంటూ ఆయింట్‌మెంట్ ఇచ్చింది రాధ

''ఈ విషయం తెలిసి నా భార్య నాతో కాపరం చేయటమే పదివేలు, ఇంకా కావడం కూడానా ?'' అంటూ కరణం ఏడ్పుముఖంతో వెళ్ళిపోయాడు

నవ్వుతూన్న రాధను చూసి, ''ఏంటలా నవ్వుతున్నారు ? ఇంకా నేనంటే ఎగతాళిగా ఉందా ?'' అన్నాడు వేణు

''లేదు, సరదాగా ఉంది ''

''ఇప్పటికి నేనంటే ఎవరో తెలిసిందన్న మాట ?''

''ఎప్పుడో తెలిసింది కాని, నేనంటే ఎవరో నీకు తెలియదు పద చెప్తా ''

''ఎక్కడికి ?''

''గుడికి ''

అయోమయంగా చూస్తూ రాధను అనుసరించాడు వేణు

పి చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో పి జె ప్రభాకరరెడ్డి నిర్మించిన ఉషశ్రీ క్రియేషన్స్ ''పులిజూదం'' మార్చి 30న విడుదల సుమలత, సత్యనారాయణ, కాంతారావు, నూతన్‌ప్రసాద్, సంకాయల, వేలు, వీరభద్రరావు, జీవా, ప్రకాష్, లక్ష్మీనారాయణ, కె విజయ, అన్నపూర్ణ ఇతర పాత్రధారులు ఉషశ్రీ కథ, స్క్రీన్ ప్లే కు మోదుకూరి జాన్సన్ సంభాషణలకర్త కె వి మహదేవన్ సంగీతం, సుఖదేవ్ ఛాయ, కళాధర్ శిల్పం, ఆదుర్తి హరనాధ్ కూర్పుతో కె నరసింహారావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్

'పులిజూదం'లో కృష్ణ, జయసుధ.





భానుప్రియ, శరత్‌బాబు, 'సితార'లో

## "సితార"లో సినీ తార

సినిమా డైరెక్టర్ (జనార్దన్) చెప్పిన విషయంతో సితార (భానుప్రియ) ఏకీభవించ లేకపోయింది. "నో ... ప్రియుడు చనిపోయి నంత మాత్రాన ఆడపిల్ల ఆత్మహత్య చేసుకోవాలా? నూరేళ్ళ జీవితాన్ని నాశనం చేసుకోవాలా? దయచేసి ఆ పాత్రని చంపకండి, డైరెక్టర్‌గారూ! మరో ముగింపు ఏదైనా ఆలోచించండి."

"ఎటు చూసినా చీకటి కనిపించే ఆ పాత్రను ఇక చీకట్లో నడిపించడం కంటె — చంపేస్తేనే మంచిదనిపిస్తుంది, మేడమ్! అలా ముగిస్తేనే ఆ పాత్రకు ఒక సంపూర్ణత్వం చేకూరుతుంది," అన్నాడు డైరెక్టర్.

"మనం తీసే సినిమా ప్రభావం చూసే వాళ్ళపైన ఎంతో ఉంది. ఇలాంటి అర్థంలేని పరిష్కారాలను చూపించడం ప్రాక్టికల్‌గా ఉండదు. పైగా, పిరికితనాన్ని సపోర్ట్ చేసి నట్టుంటుంది ... ఆ కథానాయికను చంపకండి, డైరెక్టర్‌గారూ, చంపకండి! నా మనశ్శాంతి కోసం ఒక నిర్ణయం తీసుకుని, బ్రతికేలా చేయండి."

"ఇట్సాల్‌రైట్. ఆలోచిస్తాను. ఈ సీన్ ఆక్ట్ చేస్తే, ఈ సినిమాలో మీ పోర్షన్ మొత్తం అయిపోతుంది. కాల్షీటు త్వరలోనే ఇవ్వాలి మీరు."

"ష్యూర్," అంది సితార. డైరెక్టర్ వెళ్ళిపోయాడు.

ఏడిద నాగేశ్వరరావు నిర్మించిన పూర్ణోదయా మూవీ క్రియేషన్స్ "సితార" చిత్ర దర్శకుడు వంశీ పై షాట్‌ను ఓ-కే చేశాక కొన్ని కారణాలవల్ల సితార కాస్సేపటికి డైరెక్టర్ ఇంటికి ఫోన్‌చేసి, 'డైరెక్టర్‌గారూ, మీరు చెప్పిన ఆత్మహత్యా పరిష్కారమే చాలా బాగుంది. నా పెళ్ళి కాన్సిల్ అయింది. రేపే మీరు షూటింగ్ పెట్టుకోండి,' అని చెప్పింది," అంటూ వివరించారు.

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు!

మంత్రాలయ ఆర్ట్ పిక్చర్స్ "నాగదేవత మహిమ", క్రాంతి ఇండస్ట్రియల్ క్రియేషన్ "కాశీ" శ్రీ విజయసారథి ఆర్ట్ పిక్చర్స్ "నాట్యమయూరి", విజయ ఆదిత్య క్రియేషన్స్ "ప్రేమ సామ్రాజ్యం", ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ "తెలుగింటి ఆడపడుచు", శ్రీ విజయ కళా మందిర్ "అగ్నిరాజు", రాజలక్ష్మి మూవీస్ "కరోడా", శరత్ ఆర్ట్స్ "రాజదర్బార్", పితల్ ప్రొడక్షన్స్ "నవమోహిని", లక్ష్మి ఆర్ట్స్ అండ్ ఆర్ట్స్ "ఆడది ఆదిశక్తి అయితే ...", ప్రగతి క్రియేషన్స్ "ఆక్రోశం", రాఘవేంద్ర ఆర్ట్ మూవీస్ "అమ్మాయిల సవాల్", టి. వి. ఎన్. పిక్చర్స్ "అరుణోదయం", జగన్ క్రియేషన్స్ "బుద్ధిమంతుడు", జయలక్ష్మి ఆర్ట్ ప్రొడక్షన్స్ "ఢాకూ", రాజ్యలక్ష్మి మూవీస్ "కిలాడి దొంగ", రెడ్డి అండ్ ప్రకాష్ కంబైన్స్ "కులమతభేదాలు", మంచిని చంపకండి",



# సినిమా

శ్రీకాంత్ పిక్చర్స్ "మరో వియత్నాం", శ్యామలా ఫిలిమ్స్ "సంగీత సమ్రాట్", శ్రీ కమల కంబైన్స్ "సుహాసిని", ఎం.ఆర్.సి. ప్రొడక్షన్స్ "సెంట్రల్ రౌడీ", షా ఆర్ట్స్ క్రియేషన్స్ "మరోజన్మ", శ్రీ సాయిరాం ప్రొడక్షన్స్ "నాసేరే భయంకర్—నేనంటే భయం భయం", శ్రీలక్ష్మి శ్రీనివాస మూవీస్ "ద్రోహి", సాయ్ ఫిలిమ్స్ కంబైన్స్ "గలగల గోదారి."

## టి. కృష్ణ దర్శకత్వంలో వై. హరికృష్ణ చిత్రం

"కృష్ణా చిత్ర బానర్‌లో ప్రముఖ డిస్ట్రిబ్యూటర్ వై. హరికృష్ణగారు ఒక చిత్రాన్ని ప్రారంభించ బోతున్నారు. దీని షూటింగ్ జూన్ జూలై మాసాల్లో పూర్తవుతుంది. సుమన్, సుహాసిని నాయకానాయికలు," అని తెలియజేశారు డైరెక్టర్ టి. కృష్ణ.

'డిస్కో కింగ్' బాలకృష్ణ



# "నాకు ఏమేమి ఇష్టమో చెప్పనా మీకు. మమ్మీ, డాడీ, చిన్నీ... ఇంకా రస్నా కూడా!"

పిల్లలకు ఎంతో ఇష్టం రస్నా ప్రతి రస్నా
పేకెట్ నుండి 32 గ్లాసుల మధుర పానీయం

రస్నా చేయటం ఎంతో సులభం
పంచదార, నీళ్ళలో కలపండి. నిముషాల్లో
తయారవుతుంది 2 సీసాలకు సరిపడే సిరప్
ఇహ సేవించి, ఆనందించటమే తరువాయి

రస్నా ఎంతో ఆదా కూడా
మిగతా సిరప్, స్క్వాష్‌లతో పోలిస్తే,
ధర సగం కన్నా కూడా తక్కువే. రస్నా
మీకు నోరూరించే 8 రకాల రుచులలో లభిస్తుంది

సాఫ్ట్ డ్రింక్ కాన్‌సెన్‌ట్రేట్

**ఎంతో రుచి !**
**ఎంతో ఆదా !**

తయారుచేయువారు పయోమ ఇండస్ట్రీస్, అసర్వా, అహమదాబాద్-380 016

Mudra PI/1569 TEL

# సినిమా

## మాధాల కథ నిర్మాణ సారథ్యంలో "జనం-మనం"

"శాస్త్రీయ, లలిత, జానపద సంగీత భావ రాగ సమ్మేళనంతో, ఆశయాల సంఘర్షణ లోని అనుభవ సంగతులు జోడించి, జనరంజకంగా—సంగీతానికి సరికొత్త విలువలను సంతరించుకునేలా ఈ చిత్రాన్ని రూపొందిస్తున్నాం. సంగీతానికి నిఘంటువు అయిన పరమేశ్వరశాస్త్రి పాత్రను గుమ్మడి అపురూపంగా నిర్వహిస్తున్నారు. వారి సతీమణిగా అలనాటి మేటి నటీమణి విజయకుమారి నటిస్తున్నారు. ఈ చిత్రంలోని పదిపాటల్లో అయిదుపాటలు పరమేశ్వరశాస్త్రిపై చిత్రీకరింపబడతాయి. మార్చి 1 నుంచి ఒకే షెడ్యూల్లో చిత్రీకరణ పూర్తవుతుంది," అన్నారు మాధాల రంగారావు. ఈయన కథ, నిర్మాణ సారథ్యంతోపాటు ప్రధాన భూమికను నిర్వహిస్తున్న నవతరం పిక్చర్స్ "జనం—మనం" చిత్రంలో డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, మల్లిక్ పాడిన పాటలు అదనపు ఆకర్షణ.



'నిర్దోషి' చంద్రమోహన్

డాక్టర్‌గా నటించే ప్రభతో పాటు నల్లూరి వెంకటేశ్వర్లు, సాక్షి రంగారావు, పి. జె. శర్మ, గరగ, శివరామరెడ్డి, ప్రకాష్‌రెడ్డి, నారాయణమూర్తి, శశిమోహన్, లక్ష్మిచిత్ర, పద్మ, జయశీల, లక్ష్మి ఇతర పాత్రధారులు. టి. చలపతిరావు సంగీతం, వి. ఎస్. ఆర్. కృష్ణారావు ఛాయ, ఉర్చి శిల్పం, చౌదుల సుబ్బారావు కూర్పు, మణి ప్రొడక్షన్, నాగేశ్వరరావు నిర్వహణతో ఈ చిత్రానికి సంభాషణలు సమకూర్చి, దర్శకత్వం వహించే మోహన్‌దాస్ "శాస్త్రీయ సంగీతం పండితులవరకే పరిమితంకాకుండా పామరులందరి దగ్గరికి రావాలన్నదే ఈ చిత్ర కథాంశం," అని తెలిపారు.

## ఆంధ్రలో 'ముజేఇన్సాఫ్‌చాహియే' త్వరలో విడుదల

ఎల్. వి. ప్రసాద్ సమర్పణలో డి.వి.ఎస్. ప్రొడక్షన్స్ అధినేత డి. వి. ఎస్. రాజు నిర్మించిన పై హిందీ చిత్రం ఉత్తర భారతంలో రజతోత్సవాలు చేసుకోబోతోంది. విజయా ఫిలిమ్స్ ద్వారా ఈ చిత్రం త్వరలో మన రాష్ట్రంలో విడుదలవబోతోంది. మిథున్‌చక్రవర్తి, రేఖ, రతి అగ్నిహోత్రి, డేనీ, అమ్రాపీ ప్రభృతులు నటించారు. తాతినేని రామారావు దర్శకుడు.

'మాయదారి మొగుడు' లో ఒక దృశ్యం

మీరు వాడేది ఏ టూత్‌పేస్ట్ అయినా కానివ్వండి...

# సిగ్నల్- ఇచ్చేదేమిటో- కనుక్కోండి!

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

## సదుపాయం కాలపరిమితి పొడిగించబడింది!
## సిగ్నల్ 2 ఇచ్చేదేమిటో కనుక్కునే అవకాశాన్ని వదులుకోకండి.

### సిగ్నల్- ఇచ్చేదేమిటో- కనుక్కోండి

★★★★★★★★★★★★★★★★★★★★★★

వాడేసిన ట్యూబును (అది ఏ టూత్ పేస్ట్‌దైనా, ఏ సైజుదైనాసరే) మీ దుకాణదారుడికి తిరిగి ఇచ్చెయ్యండి. సిగ్నల్ 2ని కొనుక్కోండి: బ్రహ్మాండమైన తగ్గింపు ధరలో.

- ★ 300గ్రా. పైన రూ. 3.00 ఆదా చెయ్యండి
- ★ 200 గ్రా. పైన రూ. 2.00 ఆదా చెయ్యండి
- ★ 125 గ్రా. పైన రూ. 1.00 ఆదా చెయ్యండి
- ★ 75 గ్రా. పైన 50 పై ఆదా చెయ్యండి




## సిగ్నల్ 2 పిప్పిపళ్లను నిరోధించే టూత్‌పేస్టు

వాడిచూసారంటే, మరిక వదిలిపెట్టలేరు మీరు, ఎప్పడికీ!

హిందుస్తాన్ లివర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS SG 2 46 2315 TL



ఇటీవల విశాఖపట్నంలో ప్రఖ్యాత వైణికులు శ్రీ చిట్టిబాబుగారికి ఆంధ్ర విశ్వ విద్యాలయం అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ రామ్‌లాల్ ''కళా ప్రపూర్ణ'' బిరుదుని ప్రదానం చేసిన సందర్భంగా తీసిన చిత్రం.

## ధవళ సత్యం దర్శకత్వంలో కొత్త చిత్రాలు

''హైదరాబాద్ శ్రీ వంశీకృష్ణ అధినేత సాంబశివరావుగారు సమర్పించే శ్రీ విశ్వనాధ్ ఆర్ట్స్ పిక్చర్స్ చిత్రం మే నుంచి జూన్ లోగా ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది,'' అన్నారు ధవళ సత్యం ఈయన కధ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో విశ్వనాధం, కోటిలింగం నిర్మించే ఈ చిత్రంలో మురళీ మోహన్, శివకృష్ణ, నూతన్‌ప్రసాద్, ప్రభ, అశ్వని, డాక్టర్ శివప్రసాద్ ప్రభృతులుంటారు చక్రవర్తి సంగీత దర్శకుడు రవీంద్రబాబు సంకలనకర్త

''గుడిగంటలు మ్రోగాయి'' అనంతరం మనోరంజని క్రియేషన్స్ రూపొందించే చిత్రానికి, దర్శక నిర్మాత యు విశ్వేశ్వరరావు అల్లుడు ఎ కె వి ప్రసాద్ నిర్మించే చిత్రానికి, మరో నూతన సంస్థ చిత్రానికి ధవళ సత్యం రచన, దర్శకత్వ భారాలు వహించనున్నారు

## "దేశంలో దొంగలు పడ్డారు"

''మార్చి 20 నుంచి గుంటూరు ప్రాంతాలలో నిర్విరామంగా షూటింగ్ ముగిస్తాం,'' అన్నారు టి కృష్ణ ఈయన కధ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ''నేటి భారతం'' అనంతరం ఈ తరం పిక్చర్స్ అధినేత పోకూరి వెంకటేశ్వరరావు నిర్మించే పై చిత్రానికి మార్చి 2 న తొలిగీతం ధ్వనిముద్రితమైంది సుమన్, విజయశాంతి, పి ఎల్ నారాయణ, నర్రా వెంకటేశ్వరరావు ఆదిగాగల వారు పాల్గొంటున్నారు ఎం వి ఎస్ హరనాధరావు సంభాషణలు రాశారు అదృష్టదీపక్, లక్ష్మీనారాయణ గీతాలకు చక్రవర్తి స్వరకర్త ఆర్ రామారావు ఛాయ, చౌదుల సుబ్బారావు కూర్పు, బెజవాడ కోటేశ్వరరావు—సుబ్బారావు—నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు

## నూతన సంస్థ నిర్మించే చిత్రానికి నవదర్శకుడు

''జంగిల్ బాక్‌గ్రవుండ్‌లో ఆక్షన్ చిత్రం,'' అన్నారు కె ఎస్ ఆర్ దాస్ చిత్రాలకు ఎడిటర్‌గా విశేషానుభవం గడించిన పి సి మోహన్ ఈయన స్క్రీన్‌ప్లే, కూర్పు, దర్శకత్వంలో సత్యసాయి ఆర్ట్స్ క్రియేషన్స్ నిర్మించే తొలి చిత్రానికి ఇటీవల పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది శరత్‌బాబు, రంగనాథ్, జీవా, సిలోన్ మనోహర్, వేలు, వీరభద్రరావు, జయమాలిని, స్మిత, అనూరాధ, నాయిక పాత్రలో నవనటి పాల్గొంటారు వి జె కుమార్ కధ, సి గోపాల్ ఛాయ, బాబ్జీ శిల్పంతో కడియం సత్యనారాయణ నేతృత్వంలో నిర్మాణం జరుగుతుంది

## జంధ్యాల రచన, దర్శకత్వంలో "రావూ గోపాలావూ"

''కడుపుబ్బ నవ్వించే చిత్రం,'' అన్నారు జంధ్యాల ఈయన కధ, మాటలు, దర్శకత్వంలో శ్రీ భ్రమరాంబికా ఫిలిమ్స్ పతాకంలో కోగంటి కేశవరావు నిర్మించే '' రావూ గోపాలావూ '' చిత్రంలో చంద్రమోహన్, రావు గోపాలరావు, శుభాకర్, అరుణ, అన్నపూర్ణ ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు రమేష్‌నాయుడు సంగీతం, లోక్‌సింగ్ ఛాయ గౌతంరాజు కూర్పు, భాస్కరరాజు శిల్పంతో ఈ చిత్రాన్ని సమర్పించే జయకృష్ణ ''మార్చి 7 నుంచి ఏప్రిల్ 15 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తయిపోతుంది,'' అని తెలిపారు



## తెలుగు నిర్మాతల కొత్త హిందీ చిత్రాలు

అమితాబ్‌బచ్చన్, కమల్‌హాసన్, శ్రీదేవి, జయప్రద వగైరా తారాగణంతో తాతినేని రామారావు దర్శకత్వంలో అట్లూరి పూర్ణచంద్రరావు నిర్మించే లక్ష్మీ ప్రొడక్షన్స్ నాలుగో హిందీ చిత్రానికి ఇటీవల బొంబాయిలో లక్ష్మీకాంత్ — ప్యారేలాల్ స్వరకల్పనలో ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం, ఆశాభోంస్లే పాడిన గీతాలు రికార్డు చేయబడ్డాయి

''మహాన్'' అనంతరం సత్యనారాయణ, సూర్యనారాయణ నిర్మించే సత్యచిత్ర ఇంటర్నేషనల్ వారి కొత్త హిందీ చిత్రంలో అమితాబ్ బచ్చన్, శ్రీదేవి, వహీదా రెహమాన్, నిరుపారాయ్, శక్తికపూర్, రంజిత్, కాదర్‌ఖాన్ ఆదిగా గలవారుంటారు ఆర్ డి బర్మన్ సంగీతం, వి ఎస్ ఆర్ స్వామి ఛాయతో ఎస్ రామనాదన్ దర్శకుడు

ఇటీవల విజయవాడ రోటరీ ఆడిటోరియంలో నటరాజ ఆర్ట్స్ అకాడమీ ఆధ్వర్యాన జరిగిన నృత్య ప్రదర్శనలో బాల నర్తకి సి. పి. ఉష కూచిపూడి, భరతనాట్యం ప్రదర్శించి ప్రేక్షకులను అలరించింది. ఈమె నాట్యాచార్యులు శ్రీ భాగవతుల యజ్ఞనారాయణశర్మగారి కుమారులైన శ్రీ వెంకటరామశర్మగారి శిష్యురాలు.



# అవీ - ఇవీ

★ బేబీగా తొలుత కొన్ని మలయాళ చిత్రాల్లో నటించిన ఊర్వశి అసలు పేరూ కవిత ఈమె సోదరీమణులు కళారంజని, కల్పన కూడా తారలే.

★ సాయిబాబా పిక్చర్స్ వారి హిందీ చిత్రంలో పద్మినీ కొల్హాపురి తండ్రిగా డైరెక్టర్ బాసు ఛటర్జీ నటిస్తున్నారు.

★ ''షరాబీ'' చిత్రంలో కిశోర్ కుమార్ తో కలిసి అమితాబ్ బచ్చన్ ఓ పాట పాడారు.

★ ''హస్లితి ఫస్లి'' అనే మరాఠీ చిత్రంలో మిథున్ చక్రవర్తి, అమ్జద్ ఖాన్‌లు గెస్టులుగా నటిస్తున్నారు.

★ జారియాలోని దేశబంధు థియేటర్‌లో మన్‌మోహన్ దేశాయ్ చిత్రం ''కూలీ'' 50వ రోజు ప్రదర్శనలకు రైల్వే కూలీలను ఆహ్వానించి, వారికి తేనీటి విందు ఇచ్చి, 'కూలీ' అని ముద్రించబడిన బనీన్‌లను కానుకగా ఇచ్చారు.

★ ''తోఫా'' చిత్రంలో ''తోఫా తోఫా'' అనే పాట చిత్రీకరణలో జయప్రద ధరించిన చీర డిజైన్‌తో 'తోఫా' చీరల పేరున విరివిగా విక్రయం జరుగుతోంది. హైదరాబాద్ అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనకు హాజరయ్యే మహిళలు ఎక్కువగా ఈ చీరలనే కొంటున్నారట.

★ ''ఆక్టోపస్సీ'' చిత్రంలో జేమ్స్‌బాండ్‌గా నటించిన రోజర్‌మూర్‌కు చెల్లించబడిన పారితోషికం రెండు మిలియన్ పౌనులు. ఆ చిత్రంలో విలన్‌గా నటించిన డేవిడ్ బోవైను రోజర్ మూర్ నటించబోయే కొత్త జేమ్స్‌బాండ్ చిత్రంలోకూడా విలన్‌గా నటించమని నిర్మాత కబ్బీబ్రొకోలీ అడిగితే, మూర్‌కు ఇచ్చేంత పారితోషికమే తనకూ ఇవ్వాలని డేవిడ్ బోవై కోరాడట అందుకు నిర్మాత సమ్మతించక తప్పలేదట.

★ ''హిమ్మత్'' చిత్రానికి మొదట మనరాష్ట్రంలో బిజినెస్ కాలేదు ఉత్తర భారతంలో విడుదలైన ఏడాదికి కూడా కొనుగోలుదార్లు ఎవరూ రాకపోయేసరికి నిర్మాతలే 3 ప్రింట్లు తీసి కొన్ని కేంద్రాలలో విడుదల చేశారు. మన ప్రాంతాలలో కూడా సూపర్ హిట్ అయ్యేసరికి 2వ వారానికే మరో రెండు ప్రింట్లు తీయవలసి వచ్చింది 3వ వారానికి మరో మూడు ప్రింట్లు తీశారు. ఒకప్పుడు 75 వేలకన్నా అమ్మాలనుకున్న నిర్మాతలకు ఇప్పుడు 15 లక్షలకు పైగా మన ప్రాంతంలో వసూలవుతుందని అంచనా.

★ ''కల్లిముల్లి'' అనే మలయాళ చిత్రం ఓ విధంగా అసాధారణమైనదని చెప్పవచ్చు. వేర్వేరు జాతులకు చెందిన ఒక అంధ యువకుడు, ఒక అంధ యువతి ప్రేమించుకుంటారు. విశేషమేమిటంటే – హీరో రవీంద్రన్, హీరోయిన్ లల్లి ఇద్దరూ అంధులే. రవీంద్రన్ ఒలావో అంధ పాఠశాలలో, లల్లి తిరువనంతపురంలోని ఒక కాలేజీలో చదువుకుంటున్నారు. ఇతర పాత్రధారులు కూడా చాలామంది అంధులే.

★ ''యాదిన్'' చిత్రాన్ని సునీల్‌దత్ తీసినప్పుడు అది తన కథకు కాపీ అని ఇండోర్‌లోని ఓ వ్యక్తి కేసు పెట్టాడు. అప్పుడు ఇండోర్‌లోని కోర్టుకు సునీల్‌దత్ హాజరయితే, ఫిర్యాది తన కుటుంబంతోసహా వచ్చి సునీల్‌ను పుష్పమాలాలంకృతుడ్ని చేసి, మిఠాయి ఇచ్చాడు. జడ్జి, సునీల్‌ను తన ఇంటికి విందుకు ఆహ్వానించాడు !



సీరియల్

# తీరాగాని కదే తాళం

## చక్కిలం విజయలక్ష్మి

ఆ మధ్యాహ్నం ఎవరూ భోజనాలకు రాలేదు

సాయంకాలం నాలుగు గంటలకు సుమిత్రమ్మ వచ్చింది. స్నానం చేసి, టీ తీసుకునే సమయంలో జయంతిని పిలిచి దగ్గర కూచో బెట్టుకుంది

''ఆఁ, ఇప్పుడు చెప్పు. నీవు ఏం చదువు కున్నావు ? కుట్లు, అల్లికలు, సంగీతంలాంటి వేమైనా వచ్చా ? సాహిత్యం ఏమైనా చదివావా ?''

బిడియపడ్తూ చెప్పింది జయంతి. ''పెద్దగా ఏమీ చదువుకోలేదు. కానీ ఇంట్లోనే నాన్న నా చేత చాలా పుస్తకాలు చదివించారు కుట్లు, అల్లికలు వచ్చు మా యింటి పక్కన సంగీతం మాష్టారు వుండేవారు వారి వద్ద అభ్యాసం చేసేదాన్ని. దురదృష్టవశాత్తూ మధ్యలోనే ఆయన వూరు వదలి వెళ్ళిపోయారు ''

''ఫరవాలేదులే. నీకు వుత్సాహం వుంటే ఆ మిగిలింది ఇక్కడ నేర్చుకోవచ్చు'' అంది సుమిత్రమ్మ.

జయంతి సంతోషంగా చూసింది.

''నీకు వంట చేయడం వచ్చా ?''

నవ్వింది జయంతి.

''మా ఇంట్లో అన్ని పనులూ నేనే చేసేదాన్ని'' అంది.

''ఆడపిల్లకు అన్నీ వచ్చి వుండాలి. మీ అక్కకు కాఫీ ఎలా కలుపుతారో తెలీదు'' నిట్టూర్చింది సుమిత్రమ్మ.

జయంతి ఆశ్చర్య పడింది.

''వంట చేసే అవసరం నీకు లేదు. కానీ ఒక రోజు నీ చేతి వంట రుచి చూపించు.''

అలాగే అన్నట్లుగా తలవూపింది జయంతి

అంతలో రఘునాధరావుగారు వచ్చారు.

సుమిత్రమ్మ లేచి ఆయనకు ఎదురు వెళ్లి ''మధ్యాహ్నం భోజనానికి రాలేదటగా ?'' అంది ముఖం చిట్లిస్తూ.

''అయితే నీవూ రాలేదన్నమాట ? నీవు రావనే నేనూ రాలేదు'' అన్నారు ఆయన.

''బాగుంది మీ వరస'' అంటూ నవ్వింది సుమిత్రమ్మ.

రఘునాధరావుగారు జయంతిని పలకరించి సుమిత్రమ్మతో లోపలకు వెళ్లిపోయారు

### 3

వారం రోజుల్లో ఆ ఇల్లూ, పరిసరాలూ బాగా అలవాటయ్యాయి జయంతికి.

ఓ ఉదయం సుమిత్రమ్మ లేచి వంట గదిలోకి వచ్చేసరికి తలస్నానం చేసి, జారుముడి

(గత సంచిక తరువాయి)

వేసుకుని, పైటచెంగు నడుముకు బిగించి వంట గదంతా కలియ తిరుగుతూన్న జయంతి కనిపించింది పూజ కూడా ముగించినందుకు గుర్తుగా ఆమె కనుబొమల నడుమ కుంకుమా, జారుముడిలో పువ్వూ వున్నాయి

తృప్తిగా చూసి స్నానానికి వెళ్ళింది సుమిత్రమ్మ

రఘునాధరావుగారు సుమిత్రమ్మతో ఏదో అవసరం వచ్చి వంటగదిదాకా వచ్చారు మధ్యాహ్నం భోజనం అంత లెక్కలోకి రాదు ఆయన వస్తే వస్తారు లేదా రారు సుమిత్రమ్మయినా మధ్యాహ్నం ఇంట్లో వుంటే వుంటుంది లేదా లేదు మహిళా మండలి కార్యక్రమాల్లో ఆమె చాలా బిజీగా వుంటూ వుంటుంది. ఉదయం టిఫిన్, రాత్రి భోజనం మాత్రం సుమిత్రమ్మ స్వయంగా భర్తకోసం తయారుచేస్తుంది. ఇంట్లో భార్యచేతివంటగానీ తినరు రఘునాధరావుగారు. ఆయన భోజనానికీ, మిగిలిన కుటుంబ సభ్యుల భోజనానికీ చాలా వ్యత్యాసం. ఆయన కారం చాలా తక్కువ తింటారు. శాఖాహారి. ఆయనకు నచ్చేలాచేయటం ఏ వంటవాడికీ చేతకాలేదు. ఆ కిటుకేదో సుమిత్రమ్మకే తెలుసులా వుంది.

ఆయన వచ్చేసరికి సుమిత్రమ్మ, జయంతి వంట గదిలో బిజీగా వున్నారు.

''ఈ రోజు ఏమిటి విశేషం ?'' అని అడిగారు రఘునాధరావుగారు కనుబొమలు ఎగరేస్తూ.

''ఏముంది ? కొత్త కోడలు వంట గది ప్రవేశం'' నవ్వింది సుమిత్రమ్మ.

''ఈరోజు విశేషమే !! నీవు మొదటి మాట నవ్వుతూనే మాట్లాడ్తున్నావు !!''

''చాల్లెండి మహా శాంత పురుషులు'' చిటపటలాడింది సుమిత్రమ్మ.

**జరిగినకథ—1:** ప్రముఖ ఇండస్ట్రియలిస్ట్ రఘునాధరావుగారు జయంతిని తన ఇంటికి తీసుకొనివచ్చి, భార్య సుమిత్రకు పరిచయం చేస్తారు. ఆమె జయంతిని గుర్తిస్తుంది. తరువాత ఇంటిలోని సభ్యులకు ఒక్కొక్కరికి జయంతిని పరిచయం చేస్తారు. జయంతి మరునాడు ఒక్కొక్కరి గది పరిశీలిస్తూ మన్‌మోహన్ గదిలో అతని ఫోటోను చూస్తుంది.

''మొదట శాంతపురుషుణ్నే. సహవాస దోషంతో...'' నసిగారాయన.

''ఇన్నాళ్లు సహవాసం చేసీ మీ మాటలు మాత్రం నేను నేర్చుకోలేకపోయాను.''

''ఇంతకూ తమరు ఇలా వస్తారా లేదా ?''

''అయ్యో, ఆగండి. మీతో మాటల్లోపడి కూరలో కారం వేశానో లేదో మరచిపోయాను.''

''ఈ ఇంట్లో వంటకాల్లోకి కారంతో పనేముంది ?''

''మరి?'' కోపంగా చూసింది సుమిత్రమ్మ

''ఇంటి యజమానురాలి కోపమే చాలు.''

జయంతి అవతలికి తిరిగి ముసిముసిగా నవ్వుకుంది.

''అమ్మాయి వుందన్న ధ్యాస కూడా లేదు'' గొణుగుతూ ఇవతలకు వచ్చింది సుమిత్రమ్మ.

* * *

''ఆ అమ్మాయితో వంట చేయిస్తున్నావేం ?'' కోటు తొడుక్కుంటూ అన్నారు రఘునాధరావుగారు

''బాగుంది ! ఒక కోడలి కెటూ వంట అన్న మాటకు అర్థం కూడా తెలీదు ఇక ఈ అమ్మాయయినా వంటా వార్పూ పట్టించు కోకపోతే ఎలా ?'' కనుబొమలు చిట్లించింది సుమిత్రమ్మ

''వంట చేయించడానికే తీసుకు వచ్చామని అనుకోదూ ?''

''ఆ మాత్రం నాకు తెలీదంటారా? వంట చేయమని నేను మాత్రం చెప్పానా ? పనీ పాటా నేర్చిన పిల్ల. ఊర్కే వుండలేక తనే చొరవగా పనులు చేస్తోంది. ఆ బాధ్యత బరువు వహించ వలసిన మనిషే కాబట్టి నేనూ చూసీ చూడ నట్లున్నాను.'' అని నవ్వింది సుమిత్రమ్మ.

''ఇంతకూ కొడుకుతో చూచాయగానైనా అన్నావా ?''

''ఏదీ ? వాడు ఈ మధ్య ఇంట్లో వుండటమే లేదు ఏవో మేచెస్ జరుగుతున్నా యటగా ?''

''ఊ.''

* * *

''మంగమ్మా, ఈ గదులన్నీ ఎప్పుడూ ఇలాగే వుంటాయా ! అత్తయ్య ఏమీ అనరా ?'' జయంతి అడిగింది.

''అమ్మగారికి గుండె జబ్బు. అందుకని ఎప్పుడోగానీ పైకిరారు. వచ్చినప్పుడు మాత్రం కేకలేసి సర్దిస్తూ వుంటారు. అయినా రోజూ సర్దినా ఇంతే అమ్మాయిగారూ. హడావిడిగా

అన్నీ ఎక్కడి వక్కడ పడేసి పోతూ వుంటారు'' పని మనిషి మంగమ్మ చెప్పింది.

''అందుకని ఇలాగే వదిలేస్తావన్నమాట?'' కొంచెం గట్టిగానే అన్నది జయంతి.

బిత్తరపోయింది మంగమ్మ.

''రా, ఇద్దరం కలిసి సర్దుదాం'' నవ్వుతూ పిల్చింది జయంతి.

## 4

బాల్కనీలో కూర్చుని పువ్వులు కడ్తోంది జయంతి. గీత వచ్చి పక్కన కూర్చుంది. ఇద్దరికీ బాగా చనువు పెరిగింది.

''అబ్బ ! ఎంత బాగుందో కాంబినేషన్ !'' అంది గీత, మల్లెలు, మరువం, కనకాంబరాలు కలిపి కడ్తూన్న కదంబమాలను చూసి.

జయంతి నవ్వింది;

''ఇలాంటి కదంబమాల అంటే నా కెంత ఇష్టమో !'' అంది ఆశగా గీత.

''మరి ఎప్పుడూ పెట్టుకోవేం ?'' అంది తల ఎత్తి జయంతి.

''మాల కట్టడం నాకు రాదు. వదినకు వస్తుందిగానీ 'పల్లెటూరి వాళ్లలా ఆ కదంబ మాల లేమిటి' అంటుంది. ఆవిడెప్పుడూ చీరెలకు మేచ్ అయేలా సింగిల్ రోజ్ పెట్టుకుంటుంది. మంగమ్మ క్కూడా మాల కట్టడం వస్తుందిగానీ ఇంత బాగా రాదు. ఇక అమ్మకు పని తీరిక వుండదు. ఆమెకు తీరే సరికి నాకు కాలేజ్ టైం అయిపోతుంది.

జాలిగా చూసింది జయంతి. ఇంటి తోట నిండా పువ్వులే. కట్టుకుని పెట్టుకునే వీలు మాత్రం లేదు !

''ఇకనుంచి నేను రోజూ కట్టిపెడ్తానుగా. తిరుగు.''

గీత జయంతి ముందుకు జడ తిప్పి కూర్చుంది. పొడుగాటి జడలో కదంబ మాల తురుముతుండగా గీత అంది ''జ యం తీ, నా గది సర్దింది నీవేనా ? ''

''కాదు. మంగమ్మ చేత సర్దించాను'' అంది జయంతి.

జయంతి వైపుకు తిరుగుతూ ''మంగమ్మ సర్దుబాటు నాకు తెలుసులే. అంత అందంగా, ఆర్టిస్టిక్ గా ... దాని మొహం, అదేం సర్దుతుంది ! ''

''గీతా, మరి గది సర్దితే చాలా బాగుంది కదూ ? ''

''ఔను. చాలా బాగుంది. కొత్త లోకం లోకి వెళ్లినట్లుగా అనిపించింది.''

''మరి నీ గది అలా దిబ్బలా వుంచు కుంటావేం ? ''

''ఏం చెయ్యను ? సర్దుకోవటం నాకు రాదు.''

నవ్వింది జయంతి ''మరి నీకేం వచ్చు ?''

నిస్సహాయంగా చూసింది గీత.

''రాదనుకుంటూ వుంటే ఏదీ రాదు. నేర్చుకోవాలి. అలవాటయితే అదే వస్తుంది. ఇల్లు అశుభ్రంగా వుంటే మనసుక్కూడా ఏమిటో చికాగ్గా వుంటుంది. అసలా గదిలో నీకు చదువెలా వంటబడ్తోందో నాకు అర్థం కావటంలేదు ! ''

''ఔను సుమా.. నీవు చెబుతోంటే నిజమే ననిపిస్తోంది కానీ వదినకు అలాంటివి ఇష్టం వుండవు. 'నౌఖర్లలా మనం ఇల్లు సర్దుకోవడ మేంటి ?' అంటుంది. ఆవిడ చాలా పెద్ద ఇంట్లోంచి వచ్చింది'' అంది గీత.

గీత మీద పద్మిని ప్రభావం చాలా వుందని గ్రహించింది జయంతి.

నవ్వుతూ అడిగింది ''నౌఖర్లంటే ఇల్లు



శుభ్రపరిచే వాళ్ళూ, మనం అశుభ్రం చేసేవాళ్ల మనేనా అర్థం ?''

ఎదురు చిట్లించి ఒక్కక్షణం ఆలోచించి ''అంతేలా వుంది మరి'' అంది గీత

''అంటే మనకంటే నౌఖర్లు కాస్త పై స్థాయి వాళ్లన్నమాట !''

''అదేలా!'' ఆశ్చర్యంగా అంది గీత

''అంతే కదా మరి అశుభ్రం చేసిన వాళ్ల కంటే శుభ్రం చేసిన వాళ్లు పై స్థాయి వాళ్ళే అన్నమాట ఏం ?''

''బాగుంది! నౌఖర్లు వుండేదెందుకు? పని చేయడానిక్కాదూ? వాళ్లు మనకంటే పై స్థాయి వాళ్లెలా అవుతారు?''

''నౌఖర్లంటే మనం చేయకూడని హీనమైన పనులు చేసే వాళ్లు కాదు మనకు తీరకలేక వదిలేసిన పనులు చేసేవాళ్లు మాత్రమే'' అంది జయంతి

''ఏమో బాబూ ఈ తిరకాసు నా కర్థం కాదు'' భుజాలెగరేస్తూ అంది గీత

''ఆలోచిస్తే అంతా అర్థం అవుతుంది''

పిడికిలి బిగించి బొటనవ్రేలు అటూ ఇటూ వూపుతూ ''ఆలోచించేంత టైం వుండదు చదువుకో వలసింది చాలా వుంటుంది ఇలాంటి వేమైనా వుంటే వదిన చెప్తుంది'' అందీ గీత

''ఇలాంటి లౌకిక విషయాలు తెలుసు కోవడం కూడా చదువేనని నీకెవరూ చెప్పలేదా?''

''అబ్బ! మెదడుకు ఒకేసారి చాలా మేత వేస్తున్నావు అజీర్ణం అయితే కష్టం ఇప్పటికి వస్తాను టాటా'' లేచి లేడిలా ఎగురుతూ వెళ్ళిపోయింది గీత

నవ్వుకుంటూ మళ్ళీ మాల కట్టసాగింది జయంతి



జయంతి వచ్చినప్పటి నుండీ పద్మిని తత్వం గమనిస్తూనే వుంది ఆమెకు ఎవరన్నా లెక్క లేదు ఇంట్లోని ఎవరన్నా కూడా తన స్థాయివి అందుకోలేని తక్కువ వాళ్ళన్న చిన్నచూపు జయంతి అంటే మరీ, పనిని పరిశీలించేందుకు టెంపరరీగా పెట్టుకున్న నౌఖరులా తేలిగ్గా చూస్తుంది జయంతితో ఆమె మాట్లాడదు ఆమె చూపే చాలు, జయంతిని అల్లంతదూరాన నిలబెట్టేస్తుంది

ఈ ఇంటికి వచ్చాక పువ్వుల మాల కట్టడం ఈ రోజే ఏమైనా మాల కట్టికూడా ఇంటి కోడలికి ఇవ్వకుండా వుండడానికి మనసొప్పలేదు జయంతికి మాల తీసుకుని పద్మిని గదిలోకి వచ్చింది

చాలా ఆసక్తికరమైన నవల ఏదో చదువు తూన్నట్టుంది పద్మిని, సాయంకాలమైనా పడక దిగలేదు రేగిన తలతో, నలిగిన బట్టలతో చీరె మోకాలి వరకు వెనక్కు జారిపోగా, ఒక కాలు పైకీ కిందికి వూపుతూ, బోర్లాపడుకుని దీక్షగా చదువుతోంది

జయంతి రాక నామె గమనించలేదు తల తిప్పి చూడలేదు ఇదంతా చూసిన జయంతి మౌనంగా, అతి మెల్లగా నడచి వెళ్లి, మాల డ్రెసింగ్ టేబుల్‌మీద వుంచి తిరిగి వచ్చింది జయంతి గడపదాటి రెండడుగులు కూడా వేయలేదు ''మంగమ్మా'' అంటూ పిలిచింది పద్మిని మంగమ్మ క్రింద వుందనీ, ఏం కావాలో చెప్పమనీ అడుగుదామని వెనుదిరగబోయింది జయంతి మంగమ్మ సమాధానాన్ని ఆశించకుండా అంది పద్మిని ''పరాయివాళ్లు నా అనుమతి లేకుండా నా గదిలోకి రాకూడదని చెప్పు''

నివ్వెరపోయి నిలబడిపోయింది జయంతి

## 5

ఈ మధ్య గీత కాలేజీ నుండి రాగానే కాసేపు జయంతితో కబుర్లు చెబుతూ సమయం గడుపుతుంది ఆ రోజు ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ తోటలో గులాబీ చెట్లకు గొప్పులు తవ్వడంలో మాలికి సహాయం చేస్తున్నారు మొదట్లో గీతకు తోటలో మట్టి పని చేయడం ఇష్టం వుండేది కాదు జయంతి చేస్తూ వుంటే చూస్తూ కబుర్లు చెప్పేది ఒకరోజు అలాంటి సమయంలో గీత అంది ''ఇంట్లో అంటే మంగమ్మకు చేతకాని పనులు చేస్తుంటావు సరే అందులో అర్థం వుంది మరి మాలి వున్నాడు కదా? తోటపని చేసి చేతులు, బట్టలు మట్టి కొట్టుకోవడం ఎందుకు?''

''చేతులు కడుక్కుంటే శుభ్రం అవుతాయి బట్టలు మురికి కాకుండా జాగ్రత్తగా చేయవచ్చు ఇక తోటపని చేస్తే మనసుకెంతో వుల్లాసంగా వుంటుంది నాలుగు గోడల నడుమ కూర్చునే కంటే ఈ మొక్కల నడుమ, మౌనంగా వూసులాడే ఈ వూల మధ్య చైతన్యవంతమైన పని చేయటం బాగులేదా? బుట్టల కొద్దీ పూలు పూస్తున్నా నీ చేతుల్తో శ్రమపడి పెంచిన మొక్క తొలిమొగ్గ వేసిననాడు నీకెంత సంతోషం కల్గుతుందో నీవు అనుభవిస్తే గానీ తెలీదు'' అంది జయంతి

''ఏమో బాబూ మొత్తానికి నీకు పని అంటే చాలా ఇష్టంలా వుంది''

''ఇష్టమే కాదు పని చేయటం అవసరం కూడా''

''ఏం, మీ అత్తగారు పని చేయకపోతే అన్నం పెట్టనందా?'' కిలకిల నవ్వింది గీత

గీత కేసి ఓరగా చూస్తూ అంది జయంతి ''అదేంకాదు పని చేస్తే శరీరంలోని ప్రతి అవయవం కదులుతుంది శక్తి ఖర్చుపడి చెమట పడ్తుంది రక్తం బాగా ప్రవహిస్తుంది కొవ్వు పెరిగే అవకాశం తక్కువై శరీరం సన్నగా, దృఢంగా వుంటుంది ముఖ్యంగా అలసిన శరీరానికి త్వరగా నిద్ర పడ్తుంది. సుఖనిద్ర పోయేవాళ్లు ఆరోగ్యంగా వుంటారు.''

జయంతి చూపు, మాటలు అర్థం అయిన గీతకు చిరుకోపం వచ్చింది.

''నీవు నన్నే అంటున్నావు'' అంటూ బుంగమూతి పెట్టుకుని అక్కణ్ణించి పరిగెత్తి పోయింది. వెంటపడి సముదాయించి మళ్లీ తీసుకు వచ్చేసరికి నిజంగానే అలసిపోయి చెమట పట్టింది జయంతికి.

ఆ రాత్రి పడుకున్నా గీత కళ్లముందు జయంతి సన్నటి, తీగలాంటి శరీరం చాలాసేపు కదలాడింది. చివరకు లేచి నిలువుటద్దంలో తన పూర్తి ప్రతిబింబాన్ని చూసుకుని అసం

ఇటీవల నాగార్జున సాగర్ రచయితల సంఘం (నాగార్జున సాగర్) ఆధ్వర్యంలో శ్రీ కె భగవాన్ కృష్ణ రచించిన 'గాయత్రి' కథల సంపుటిని ఆవిష్కరించినపుడు తీసిన చిత్రం చిత్రంలో శ్రీయుతులు కె బి కృష్ణ, శార్వరి, డా టి రామకృష్ణమూర్తి, డా వి వి యల్ నరసింహారావుగార్లను చూడవచ్చు



# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.






కోల్గేట్ తాలూకు నమ్మకమైన
ఫార్ములా మీ నోటి శ్వాస
శుభ్రంగా, తాజాగా వుండేలా
చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా,
దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

GK&E B82 86 TL,

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

తృప్తిగా సెదిమ విరిచింది. మరునాడు జయంతి పిలువకుండానే గీత పార ఒకటి పట్టుకుని తోటలో ప్రవేశించింది. ఆ రోజు నుంచీ రోజూ కాసేపు తోటపని చేయటం అలవాటుగా మార్చుకున్నారు.

ఈ రోజూ ఇద్దరూ కబుర్లాడుతూ సరదాగా తోటపని చేస్తున్నారు.

''ఇదిగో ఈ తీగ గులాబీ పెద్దన్నయ్య బెంగుళూరు నుండి తీసుకు వచ్చాడు. పెద్దన్నయ్యకు పూల మొక్కలంటే చాలా ఇష్టం'' అంది గీత తీగ గులాబీ మొక్కను చూపిస్తూ.

''మీ ఇంకో అన్నయ్యకు ?''

''మనూ అన్నయ్యకా ? వాడికి ఆటలంటే భలే ఇష్టం. మంచి స్పోర్ట్స్‌మన్.''

''మరి ఇంట్లో ఇంత మంచి కోర్టు వుంది కదా ? ఎప్పుడూ ఆడరేం ? అసలెవరూ ఆడుతూన్న గుర్తులే లేవు. ఎందుకు తయారు చేసుకున్నట్టు ?'' అని అడిగింది జయంతి.

''మనూ అన్నయ్య ఎప్పుడూ బయట ఆడుతూ వుంటాడు. అంత పెద్ద ఆటగాడికి ఇంట్లో సమ ఉజ్జీలు లేరు మరి. పెద్దన్నయ్యకు పగలంతా ట్యుటోరియల్ కాలేజీలోనే సరిపోతుంది. సాయంకాలం మాత్రం కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని మళ్లీ వయోజన విద్యా కేంద్రానికి వుచితంగా చదువు చెప్పడానికి ప్రక్కగ్రామానికి వెళ్తాడు. ఇక వదిన మహా సుకుమారి. కదిలినా జ్వరం వస్తుందంటుంది. కూర్చుని పేకాట ఆడుతుంది. చస్, కేరమ్స్ ఆడుతుంది. అమ్మకు అనారోగ్యం, సంసారం, మహిళామండలి సేవలు. నాన్నకు క్షణం తీరని బిజినెస్. ఇక నేనంటావా? నాకు గేమ్స్ అంటే ఇష్టమే. కానీ ఎవరితో ఆడుకోను ? ఎప్పుడైనా టామీ (కుక్కపిల్ల)తో బంతి ఆట ఆడుకుంటాను'' కిసుక్కున నవ్వింది గీత.

జయంతి కూడా నవ్వుతూ ఏదో అనబోయింది. అప్పుడే బయటినుండి వచ్చిన పద్మిని వీళ్ల నవ్వు విని కారు స్లోచేసి ''గీతా ఓసారి నా గదిలోకి రా'' అంటూ పోర్టికోలోకి వెళ్లిపోయింది.

## 6

డైనింగ్ హాల్లో మన్‌మోహన్ భోజనం చేస్తున్నాడు. సుమిత్రమ్మ దగ్గర వుండి వడ్డిస్తోంది. మగవాళ్లు భోజనం చేసేటప్పుడు జయంతి ఆ పరిసరాల్లో వుండకుండా వెళ్లిపోతుంది.

''గుత్తి వంకాయ చాలా బాగుంది'' అన్నాడు మన్‌మోహన్.

''జయంతి చేసింది'' సుమిత్రమ్మ వుత్సాహంగా చెప్పింది.

# ఈ రాగానికదే తాళం

''జయంతి... కొత్త వంటమనిషా ?''

''మనూ !'' తీవ్రంగా అంది సుమిత్రమ్మ.

తల ఎత్తి తల్లి ముఖంలోకి చూశాడు మన్‌మోహన్.

''జయంతి నీకు మరదలవుతుంది ''

''ఓహో ! పనిమనిషిలా వుంటేనూ...''

''ఏమిటుంది పనిమనిషిలా ?''

''బట్టలూ అవీ...''

''బట్టలు చూసి మనుషుల విలువ గుర్తిస్తావన్న మాట ?'' కోపంగా అంది సుమిత్రమ్మ.

''నేనేకాదు. అందరూ అంతే.''

''బట్టలు సరే. దాని ముఖం చూశావా?'' సౌమ్యంగా అంది, సుమిత్రమ్మ.

''పని మనుషుల ముఖాలు పరిశీలనగా చూసే అలవాటు నాకు లేదు.''

''పని మనిషా ! ? '' అసహనంగా ముఖం చిట్లించింది సుమిత్రమ్మ.

''ఇప్పుడు కాదులే. చెప్పావుగా.''

''నీవు చాలా పెడసరపు మనిషిలా తయారవుతున్నావు సుమా'' నొచ్చుకున్నట్లుగా అంది.

నవ్వాడు మన్‌మోహన్.

''అవాలని నేను అనుకోను. కాకతాళీయంగా సంభాషణ అలా దారి మళ్లుతుంది. అంతే.''

''సరే. జయంతి నీకు మరదలన్న విషయం గుర్తుంచుకో.''

''అంత గట్టిగా గుర్తుంచుకోవలసిన అవసరం నాకేముంది ? పని మనిషిలా పనులు చెప్పను. సరేనా ? '' చేయి కడుక్కుని లేచి వెళ్లాడు మన్ మోహన్.

*       *       *

బాల్కనీలో నిలబడి స్కూటర్ మీద వెళ్తూన్న మన్ మోహన్‌ను ఆరాటంగా చూసింది జయంతి.

తను వచ్చి దాదాపు నెల దాటింది. ఇన్ని నాళ్లలో మన్‌మోహన్ కనీసం కన్నెత్తి కూడా తనను చూడలేదు. తానెవరో అతనికి తెలీదా ? అత్తయ్యగానీ, మామయ్యగానీ తానెవరో చూచాయగానైనా అతనితో చెప్పలేదా ? లేక బిడియమా ?

చిన్నప్పటి నుంచయినా తను అర్హతను మించిన ఆశలు పెంచుకోలేదు. అనుకోకుండా తానిక్కడికి, ఈ ఇంటికి కాబోయే కోడలుగా వచ్చింది. కాబోయే భర్తగా మన్‌మోహన్ ఎడల ఆసక్తి సహజంగానే కలిగింది. మరి అతనికి తన విషయంలో ఆసక్తి లేదా ? లేక తన విషయం అతనికి తెలీదా ?

''జయంతీ ! ఇక్కడున్నావా ? అబ్బ ! నీకోసం ఇల్లంతా వెతికాను. రా రా. పేక ఆడుకుందాం'' అంటూ వచ్చింది గీత.

''నాకు రాదు గీతా''

''నేను నేర్పిస్తానుగా'' బలవంతంగా లాక్కు వెళ్ళింది గీత.

''నీవు పేక నేర్చుకుంటే ఇద్దరం సరదాగా ఆడుకోవచ్చు. వదినకు వస్తుందిగానీ నాతో ఆడదు సామాన్యంగా'' అంది గీత ముక్కలు పంచుతూ .

''మరి ఎవరితో ఆడుతుంది ?''

''క్లబ్బుకెళ్ళి ఆడుతుంది. ఎప్పుడైనా అన్నయ్యా ఇద్దరూ ఆడుకుంటారు.''

''క్లబ్బులో పేకాడితే బావగారు ఏమీ అనరా ! ? ''

''ఊహూ· అన్నా లెక్కచేయదు. ఆమెకు మహా టెక్కులే గొప్పింటి బిడ్డనని.''

''మీరూ గొప్పవారేగా ?''

''వాళ్లు మరీ గొప్పలే. అబ్బ నీకు ముక్కలు పట్టుకోవడం కూడా చేతకాదు'' చాలా కష్టపడి ఆట నేర్పుతోంది గీత.

''గీతా'' గట్టిగా కేకపెట్టింది పద్మిని.

''చూశావా ? నీతో మాట్లాడ్డం వదినకు ఇష్టం వుండదు. నీతో గనుక చూసిందంటే అనవసరంగా పిలిచి ఏదో అర్థంలేని పని చెబుతుంది.''

''అదేం వుండదు. నీ వూహ. అంతే'' అంది జయంతి.

''గీతా'' మళ్లీ పిల్చింది పద్మిని.

'చూశావా ?' అన్నట్లు కళ్లతోనే సైగ చేసి పరుగుతీసింది గీత.

(ఇంకా ఉంది)



## ఎమ్. ఎస్. బి. — ఆకివీడు

మనదేశంలో మానభంగాలు ఎక్కువ జరగడానికి కారణం ఆడవారా? మగవారా?

★ ఏ ఒక్కరూ కాదు. ఆడదాన్ని చూచే తీరు! ఈ దేశంలో ఆడదంటే లోకువ. చిన్న చూపు — 'తన' ఆడవాళ్లని మినహా — ఇతరులని గౌరవంగా చూడలేని జనాభా ఎక్కువ 'తన' ఆడవారిని కూడా — జడపదార్థాలుగానే చూడడం — ఆనవాయితీ. యీ కుసంస్కారాన్ని పురుషులకి ఉగ్గుపాలతో పోసి పెంచేది— స్త్రీలు. అవి జీర్ణించుకుని తమ తడఖా చూడమనేది పురుషులు. అందుకే — ఏ ఒక్కరినీ నిందించి ప్రయోజనం లేదు. తనని తను మనిషిగా గుర్తించుకుని, గుర్తింపమని కోరుకునే స్త్రీలినాడు — సంఖ్యా రీత్యా పెరుగుతున్నారు. దీన్ని తిరుగబడడం అని కొందరంటున్నారు. బరితెగించడం అని కొందరంటున్నారు. పరిస్థితి అయోమయం వల్ల — యీ సంధికాలంలో కొందరు సమిధలైపోతున్నారు. కాని పశుబలానికి శాశ్వతశక్తి ఎప్పుడూ వుండదు. స్త్రీ వ్యక్తిగా గుర్తింపవలసిన రోజులు వస్తున్నాయి. దాని కామెకు రాజకీయరంగంలో దన్నుకావాలి అధికారం లేనిదే — శక్తనెవరు గుర్తిస్తారు? వినలేదా కర్రలేనివాని గొర్రె కరచె అని. ప్రస్తుతం ఆడదాని పని అలాగే వుంది — కర్ర చేతలేక గొర్రెలు తరుముతున్నాయి.

## యు. ఎమ్. — కాశీబుగ్గ

ప్రేమ పేరుతో మగవాడి గొంతు కోస్తున్న ఆడవారిని వెనకేసు కొస్తున్న మిమ్మల్ని తలుచుకుంటే నాకు చాలా జాలి వేస్తుంది

★ కీపిట్ ఫర్ యువర్ సెల్ఫ్. యూ నీడ్ ఇట్ మోర్ దేన్ మీ!

నేనొక కథ రాశాను. తిప్పి పంపించారు. దాన్లో లోపం ఏమిటో తెలియ చేయలేదు. మీకు కథ పంపిస్తే చదివి మీ అభిప్రాయం చెప్తారా?

★ సారీ... నా కంత టైముండదు

## బి. ఎస్. కె. బి. — కాజీపేట

రామలక్ష్మిగారూ, మనసు మూగదా?

★ ఒక్కొక్కప్పుడు!

ఆకర్షణ అనేది ఎలా వుదయిస్తుంది?

★ చెప్పలేం? బాలమురళి పాడేతీరు, చిట్టిబాబు మీటే వేళ్లు, బాలసరస్వతి చేతుల కదలిక ... ఎందుకు ఆకర్షిస్తాయంటే ఏమని చెప్పకలం? అలాగే — మిగిలినవీ.

## కె. ఆర్. పి. — బోడపకుర్రుపాలెం

పెళ్లితోనే జీవితానికి సార్థకత లభిస్తుందా?

★ రాదు. పెళ్లి జీవితంలో ఒక భాగం మాత్రమే.




## జి. ఎ. ఆర్. — కొత్తూరు

మీరు రాస్తున్న నవల పేరు ఏమిటి?

★ సుడిగాలి. (సాధారణంగా సినిమాకై రాసిన కథలను నేను సీరియల్‌గా యివ్వను. నవలగా అచ్చుకిస్తాను).

## కె. వి. ఎల్. — దర్శి

కె. రా. గారూ జీవితం అంటే ఏమిటి?

★ చావు పుట్టుకల మధ్య కాలం.

మీరు రాసిన మొదటి నవల పేరు?

★ అవతలి గట్టు.

నాకు మిమ్మల్ని చూడాలని వుంది.

★ కళ్ళు మూసుకుని నన్ను తల్చుకుంటే— కన్పించనా సోదరీ?

## కె. డి. బి. — మచిలీపట్నం

"మనుషులతోనే స్నేహంచెయ్—మనసులతో మాత్రం చేయకు." ఏమంటారు?

★ పిచ్చిమాలోకంగా వుందంటాను. మంచో చెడో మనసులేని మనుషులుంటారా?

## జి. ఎస్. ఆర్. — దెందులూరు

మీ అమ్మాయికి కూడా కట్నం యిచ్చారా?

★ ఇవ్వలేదు—యివ్వనుకూడ.

## రామనాథ్ — పెద కాకాని

నేడు దేశంలో స్త్రీలపై ఎన్నో అవమానకర సంఘటనలు జరుగుతున్నా దేశంతో ఉన్న అనేక మహిళా సంఘాలు నోరెత్తడంలేదు. ఎందుకని?

★ మీరు చదివే పేపర్లేమిటి? ఆశ్చర్యంగా వుంది... మహిళా సంఘాల హోరు సుధగోయెల్ కేసుని తిరగతోడించేలా లేదా? మధుర మానభంగం కేసులో మహిళా సంఘాల అలజడి వల్లేకదా — రేప్‌లాలో మార్పులు తెచ్చింది. పసందైన వార్తలుగా మానభంగాలని ప్రచురించడమేకాదు — వాటిని ఫాలో అప్ చేసే పనికూడా చేయాలి పత్రికలు.

## అవార — ఖర్గపూరు

సారీ మేడమ్. ఆడదానికి మగవాడు అన్ని గుట్టులు యివ్వకూడదని సామెత. మీరు నాతో ఏకీభవిస్తారా?

★ ఏకీభవిస్తాను. కొందరి గట్టర్ మైండ్సులో ఏ ఊహాలు తిరుగుతాయో — తెలుసుకోకుండా వుండడమే — మంచిదనిపిస్తుంది — కొన్ని రాతలు చదువుతూంటే. దీనికి పెద్ద ఆడా — మగా అవసరంలేదు...

## ప్రఫుల్ల — ధర్మవరం

మంచి ప్రశ్నకు అప్పడం ప్యాకెట్. చెత్త ప్రశ్నకు అప్పడాల కర్ర ఇస్తే బాగుంటుందేమో?

★ నన్నడిగే వాళ్లని—అవమానించన్నేను! అయినా పేరుకు తగ్గ టేస్టులేదు మీకు!

## వి.ఎమ్.ఆర్. — విశాఖపట్నం

విరక్తి క ఏరుగుడు?

★ రక్తి మటుకు కాదు! చేస్తున్న పని నొకసారి పర్యావలోకించండి — కారణం — తెలుసుకునే ప్రయత్నం చేయండి.

★





# జర్నీ

రావినూతల సువర్ణాకన్నన్

సెంట్రల్ స్టేషన్ వచ్చేపోయే ట్రైన్స్‌తోనూ, జనంతోనూ కిటకిటలాడిపోతోంది.

హైదరాబాద్–మద్రాస్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫామ్ మీద నిల్చివుంది! జనం సీట్లకోసమూ, బర్త్‌లకోసమూ వెతుక్కుంటూ హడావిడిగా తిరుగుతున్నారు. పోర్టర్‌లు గంపెడు బరువుతో పరుగులు తీస్తుంటే...పట్టి చేతులతోనే వాళ్ళ ననుసరించలేక, హైరానా పడిపోతున్నారు కొందరు ప్రయాణికులు.

బైట అంత గొడవగా వున్నా, ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో వంటరిగా కూర్చుని, ఏకాగ్రతతో ఏదో పుస్తకం చదువుకుంటున్న వేణు ఎవరి సాధక బాధకాలతో నిమిత్తం లేనట్టు అలా చదువుకుంటూనే ఉన్నాడు.

వేణు ఒక ప్రఖ్యాత రచయిత! అందంగా, హుందాగా వుంటాడు...మితభాషి!

అతనికన్నా అతని రచనలు మరీ బావుంటాయి. అతను మాట్లాడుతుంటే మరీమరీ బావుంటుంది!

చాలామంది ఆడపిల్లలు అతన్నారాధిస్తారు, అతని ప్రమేయం లేకుండానే.

అతను ప్రస్తుతం చదివేది అతని నవలే! ప్రింటవగానే ఓసారి మళ్ళీ చదువుకోవడం, వాటిలోని తప్పొప్పుల్ని బేరీ~ వేసుకోవడం అతని కలవాటు.

"ఎక్స్‌క్యూస్‌మీ!"

తృళ్ళిపడి చూశాడు వేణు.

ఎదురుగా ఓ ఇరవైఏళ్ళ యువతి చేతిలోని హేండ్‌బేగ్ ఎదురు సీట్లోపెట్టి, వేణుకేసి తిరిగి —

"ప్లీజ్!...మీ పెన్నోసారి ఇస్తారా?" అంది.

ఆమెలాగే...ఆమె గొంతుకూడా స్వీట్‌గా వుంది.

"ష్యూర్ ..." అంటూ లేచి పెన్నుతీసి ఆమె కిచ్చాడు వేణు.

అతనికి థాంక్స్ చెప్పి, ఓ తెల్లకాయితం మీద ఏదో రాసి పెన్నుతిరిగి ఇచ్చేసింది.

చేతిలోని కాయితాన్ని నాలుగు మడతలుగా మడిచి కంపార్ట్‌మెంట్ పక్కన నిల్చున్న ఓ వ్యక్తికిచ్చి —

"ఇదుగో! యాదవ్! ఇది అమ్మకిచ్చెయ్యి!... ఆఁ... నేను జాగ్రత్తగానే వెళ్తాను గానీ... ఇంక నువ్వెళ్ళిపో!" అంది.

బహుశా అతను వారి సర్వెంట్ కావచ్చు. ఓసారి వినయంగా ఆమెకి నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఆమె తన సామాన్లన్నీ ఓ చోట పొందిగ్గా పెట్టుకుని తన సీట్లో కూర్చుని తను తెచ్చుకున్న పుస్తకం తిరగెయ్యడం మొదలుపెట్టింది.

ఓరకంట అంతా గమనిస్తున్నాడు వేణు. అయితే... ఆ సంగతి ఆమెకి తెలియనివ్వకుండా పుస్తకం సీరియస్‌గా చదివేస్తున్నట్టుండిపోయాడు.

ట్రైన్ పెద్దగా రంకెపెట్టి బయల్దేరింది కంపార్ట్‌మెంట్‌లో చిత్రంగా వేణు, ఆమె తప్ప మరెవ్వరూ లేరు.

అతని మౌనం ఆమె కేమాత్రం నచ్చలేదని మధ్య మధ్య అతనికేసి చూసే ఆమె చూపులే చెప్తున్నాయి!

ట్రైన్ వేగం పుంజుకుంది!

"సర్!... ఈ పుస్తకం..."

"తీసుకోండి!" ఆమె మాట పూర్తి కాకుండానే తన పక్కనున్న ఓ మేగ్జైన్ ఆమె సీట్లో పడేస్తూ అన్నాడు వేణు.

"థాంక్యూ!" అంటూ పుస్తకం తిరగేస్తున్న ఆమె తృళ్ళిపడింది!... అసలే పెద్దవైన ఆమె కళ్ళు మరీ పెద్దవయ్యాయి. ఆనందం ముఖమంతా నిండిపోయింది.

"సర్!... మీరు... రైటర్ వేణుమాధవ్ గారా?" ఉత్సాహంగా అంది.

వేణు వింతగా చూశాడామెకేసి.

"చెప్పండి సర్! మీరు... వేణుమాధవ్ గారే కదూ?" అదే ఉత్సాహంతో అంది.

"అవును!" అన్నాడు వేణు.

ఇలాంటివతనికి కొత్తకాదు.

"అబ్బ! ఇవాళెంత మంచిరోజు మాధవ్ గారూ! మీ రచనలంటే నాకు చచ్చే ఇష్టం!... మార్కెట్‌లోకి వచ్చీరాగానే కొని చదివేస్తాను! ఓ రేక్‌నిండా మీ పుస్తకాలే ఉన్నాయండీ!. అంతెందుకు... మీరంటే... సారీ... మీ రచనలంటే పడిచస్తాననుకోండి!"

చిన్నపిల్లలా చెప్పకుపోతోందామె

"థాంక్స్!"

ముభావంగా వుండే వేణు కూడా ఆమె మాటలకి హాయిగా నవ్వేశాడు.

"సారీ! నా పేరు చెప్పలేదు కదూ! ఏమిటోనండీ! నా కిష్టమైనవాళ్ళు కనిపిస్తే నేను సర్వం మర్చిపోతాను! సారీ! ఏమనుకోకండి! ఆ ... ఏం చెప్తున్నాను?"

"మీ పేరు!" నవ్వుతూ అందించాడు వేణు.

"ఓ! నా పేరు రేవతి. బి.ఏ. పాసయ్యాను. సంగీత సాహిత్యాలంటే చాలా ఇష్టం .. నా అభిమాన రచయిత మిస్టర్ వేణుమాధవ్ ఇప్పుడు హైదరాబాద్ అక్కయ్య గారింటికెళ్తున్నాను ... ఇంకా .."

"ఇంక చాలు!" నవ్వేశాడు వేణు

"ఓ! సారీ!" నవ్వేసింది రేవతికూడా

ఆమె వాగ్ధాటి ముందు అతని ముభావం తల వంచేసింది. చిత్రంగా ఎన్నో కబుర్లు చెప్పాడు. ఆమె అడిగిన వాటన్నింటికీ ఓపిగ్గా జవాబులు చెప్పాడు.

"మీ కథలన్నింటిలోనూ ... నాకు చాలా నచ్చింది ... ఆఁ ... పల్లెటూరు ... బాల వితంతువు ..."

"కుంకుమరేఖ!" అందించాడు వేణు.

"ఎస్! ఎస్! కుంకుమరేఖ నాకు చాలా నచ్చింది!" అంది గంభీరంగా రేవతి.

"ఆ కథంటే నాకూ ఇష్టమే!" అన్నాడు వేణు ఆరాధనగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

అతని చూపులకి బిత్తరపోయింది రేవతి.

"ఏమిటా చూపు?" అంటూ డబాయించింది.

బిత్తరపోయిన వేణు —

"సారీ!" అనేశాడు కంగారుగా.

"ఎందుకు?"

"అదే ... మీ కళ్ళల్లోకి చూసినందుకు!"

"భలేవారే! ఓ ఆడపిల్ల మాటలకంత కంగారు పడిపోతున్నారు. మీరేం రచయితలండీ బాబూ!" పకపక నవ్వింది రేవతి.

వేణు మాట్లాడలేదు.

"సరే! ప్రస్తుతం ఏం రాస్తున్నారు?" మాట మార్చింది రేవతి.

"అది సరే!... ఇన్ని కథలలో నా కథ

కుతూహలంగా అడిగాడు వేణు.

ఆ ప్రశ్నకి తృళ్ళిపడింది రేవతి.

"బావుంది కనుక!" అంది ఏదో ఆలోచిస్తూ.

"అయితే మిగతా కథలు బాగాలేవా ?"

"అబ్బెబ్బె !... అదికాదు..." కంగారు పడిపోయింది రేవతి.

ఆమె కంగారుకు చిన్నగా నవ్వాడు వేణు

"మీరు చక్కగా నవ్వుతారు !" సిగ్గు పడుతూ అంది రేవతి.

"థాంక్స్!..." చిలిపిగా ఆమెకేసి చూస్తూ అన్నాడు వేణు.

అతని ప్రవర్తన అతనికే వింతగా తోచింది. "ఎప్పుడూ లేంది ఓ ఆడపిల్లని చూసి ఇంత ఇదైపోతున్నానేమిటా" అనుకుంటె ఆదొరకమైన మందహాసం అతని పెదవులమీద లాస్యం చేసింది.

"ఏమిటి మీలోమీరే నవ్వుకుంటున్నారు ?" అంది రేవతి ఓరగా చూస్తూ.

"ఏదో గుర్తొచ్చింది !" మళ్ళీ నవ్వాడు వేణు.

"నాకు చెప్పకూడదా?" చిన్ననోటిని మరీ చిన్నగా ముడుస్తూ అంది రేవతి.

"చెప్తే మీరు నన్నో రౌడీకింద జమకడతారేమోనని !" భయం నటించాడు వేణు.

"అలాంటి భయం ఏమీ అక్కర్లేదు ! మీ మనసులో వున్నది నిర్భయంగా చెప్పండి!" అంది రేవతి కుతూహలంగా చూస్తూ.

"ఇంత అందమైన ఆడపిల్ల నన్ను నా కథల్ని పొగుడుతూంటే ఓహ్ !... పండు వెన్నెల్లో మల్లెలనడుమ శయనించినట్టుంది !" అన్నాడు వేణు తన్మయత్వంగా.

"ఎంతైనా రచయితకదా... ఎప్పుడూ ఊహాలోకంలోనే ఉంటారు !" నవ్వింది రేవతి.

చాలాసేపు ఇద్దరూ ఎన్నో కబుర్లు చెవుకున్నారు.

హైదరాబాద్‌లో వాళ్ళింటికి తప్పకుండా రమ్మని అడ్రస్ ఇచ్చింది రేవతి.

రైలు వేగంగా పరుగులు తీస్తూనే వుంది. ఇద్దరూ పక్కలు పరుచుకున్నారు.

"మిస్ రేవతీ !... ఒక మాటడుగుతాను ! మరోలా అనుకోరుగా ?" హటాత్తుగా అన్నాడు వేణు.

"నేనేమనుకుంటాను ?" నల్లని కాటుక కళ్ళు తిప్పుతూ అమాయకంగా అంది రేవతి.



"అహాఁ!... ఒంటరిగా ఓ ఆడపిల్ల ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో, నైట్ జర్నీ చెయ్యడానికి సాహసించిందంటే ... ఆమె ... నిజంగా ఝాన్సీలక్ష్మి అయిుండాలి! అవునా ?"

"అంటే ?" తీక్షణంగా చూసింది రేవతి.

"అబ్బె!... మీరు అపార్థం చేసుకో కూడదు. నేనా మీకు కొత్త! అసలే రోజులు బాగా లేవు! ఒంటరిగా వెళ్ళిన ఆడపిల్ల ... ఏ మాత్రం క్షేమంగా ఇల్లు చేరుతుందో చెప్పలేని కాలం!... ఇప్పుడు నేను ... మిమ్మల్ని ఏమైనా చేస్తే?" అదోలా చూస్తూ అన్నాడు వేణు.

"చెయ్యరు!" గభాల్న అంది రేవతి.

"ఏమిటంత నమ్మకం ?"

"మీ మొహం చూస్తే తెలియడంలా ?" ఫక్కున నవ్విందామె.

"అంటే...నేనో చవటననా మీ ఉద్దేశం?" వేణు ముఖం ఎర్రబడింది.

"ఛ! ఛ!... నా వుద్దేశం అది కాదు మాధవ్‌గారూ! మిమ్మల్ని చూస్తుంటే హీరోలా వున్నారే గానీ విలన్లా లేరు! అందుకే అలా అన్నాను!" అంది రేవతి అనునయంగా.

"అయితే నేనే వస్తానని... అయ్‌మీన్ .. నాలాంటి మంచివాళ్ళే తారసపడతారని ముందే ఎలా వూహించారు ?" అన్నాడు వేణు వాదనగా.

"కలొచ్చింది!" అల్లరిగా నవ్వింది రేవతి.

"అంతేనా లేకపోతే జ్యోతిష్యుడైనా చెప్పాడా నాలాంటి హీరో పరిచయం అవుతాడని ?" నవ్వుతూ అన్నాడు వేణు.

"రెండూనూ !"

"మరి విలన్..."

"అమ్మ బాబోయ్! ఇప్పుడు విలన్ మాట తేకండి బాబు! మిమ్మల్ని పట్టుకుని ఇంక తెల్లవార్లూ నిద్దర పోనివ్వను!" భయంగా చూస్తూ అంది రేవతి.

ఆమె భయానికి మళ్ళీ నవ్వాడు వేణు.

"నాకు నిద్దరొస్తోంది!" ఒళ్ళు విరుచు కుంటూ అంది రేవతి

"ఓ! కే!... పడుకోండి! గుడ్‌నైట్!" అనేసి తన సూట్‌కేస్ తలవైపు పెట్టుకుని ముసుగు బిగించాడు వేణు.

రేవతి లేచి బాత్‌రూమ్‌కేసి వెళ్ళి, తిరిగి వచ్చి తన పక్కమీద పడుకుంది.

రైలు సాగిపోతూనే వుంది!

గాఢ నిద్రలోవున్న వేణు తృళ్ళిపడి చూశాడు.

ఎదురుగా రేవతి నౌకర్ యాదవ్ అన్న వ్యక్తి నిల్చుని తనకేసే... తీ క్ష ణం గా చూస్తున్నాడు.

అతని చేతిలో పిస్టలుంది!

కంగారుగా లేచి కూర్చున్నాడు వేణు.

యాదవ్ అతనికేసి పిస్టల్‌ని గురిపెట్టి, స్థిమితంగా నిల్చున్నాడు.

అయోమయంగా చూశాడు వేణు.

"మిస్టర్ మాధవ్! మీ సూట్‌కేస్ ఇలా ఇస్తారా ?" సన్నగా నవ్వుతూ అంది రేవతి.

కొయ్యబారిపోయాడు వేణు.

"ఏమిటీ అన్యాయం ?" అన్నాడు తెచ్చి పెట్టుకున్న ధైర్యంతో. అతనికి ముచ్చెమటలు పోస్తున్నాయి!

"అన్యాయం ఏం లేదు మాధవ్‌గారూ!... మర్యాదగా మీ దగ్గరున్న ఆ సూట్‌కేస్ ఇలా ఇచ్చేస్తే వచ్చే స్టేషన్‌లో మేం దిగేస్తాం! ... ఆపై హాయిగా పడుకుని నిద్రపోవచ్చు!..." అదే నవ్వుతో అంది రేవతి.

చిత్తరపోయాడు వేణు.

"కంగారుగా వుంది కదూ!... నిజమే! మనం ఊహించనివి జరుగుతూంటాయప్పు డప్పుడు. అందులోనే వుంది థ్రిల్!... ప్లీజ్! ఇచ్చెయ్యండి! క్విక్!"

మెల్లగానే అన్నా ఆమె మాట కఠినంగా ఉంది!

"ఇ...ఈ ... పెట్టెలో . . ఏం లేవు!" తడారి పోతున్న గొంతుతో అన్నాడు వేణు.

"ఏం లేవూ ?"

"అ...దే...ఒక జత బట్టలు తప్ప!

పెద్దగా నవ్వింది రేవతి.

---

ఆమె నవ్వుకు తృళ్ళిపడ్డాడు వేణు.

"మిస్టర్ మాధవ్!.. అందులో ఓ జత బట్టలే వున్నాయో ఓ రెండు లకారాలే వున్నాయో మాకు బాగా తెలుసు! అల్లరి చెయ్యకుండా ముందా పెట్టె ఇచ్చెయమ్మా!" అతని చెంపల్ని మృదువుగా నొక్కుతూ అంది రేవతి.

దీనంగా చూశాడతను.

"తొందరగా ఇయ్ బే!" అరిచాడు యాదవ్.

"నిజంగా. ఇందులో బట్టలు తప్ప ఇంకేం లేవు యాదవ్!" అన్నాడు ఆఖరి ప్రయత్నంగా.

"ఏయ్! మిస్టర్! ... ఇందులో బట్టల్లేవు. కానీ రెండులక్షల కరెన్సీ వుంది! అది నీ పొలం అమ్మిన తాలూకు సొమ్ము! స్నేహితులు డ్రాఫ్ట్ రూపంగా తీసికెళ్ళమన్నా వినకుండా మొండి ధైర్యంతో డబ్బుగానే తీసికెళ్ళున్నావు! ఇవి చాలా...ఇంకా వివరాలు కావాలా?" వ్యంగ్యంగా అన్నాడు యాదవ్.

వేణు ముఖం పాలిపోయింది.

"నిజంగా నీ ధైర్యానికి నా జోహార్లు మాధవ్! త్వరగా ఆ పెట్టె ఇలా ఇచ్చెయ్యి!... అవతల స్టేషన్ వచ్చేస్తోంది" తొందర పెట్టింది రేవతి

"అంటే...నువ్వు నా అభిమానివి కాదా?" లోగొంతుతో అన్నాడు మాధవ్.

ఆమె పెద్దగా నవ్వింది.

"నీ అభిమానినా? వాట్ ఎ జోక్! అసలు నువ్వు రైటర్‌వన్న సంగతే నాకు తెలియదు! మా బాస్ నీ గురించి చెప్తూ, నువ్వో రచయితవనీ, ఆ రూట్‌లోనే వెళ్ళమనీ చెప్తే...కాస్త సమయస్ఫూర్తిగా నాటకం ఆడి రక్తి కట్టించాను" అంది.

నిరాశగా తలవంచేశాడు వేణు.

"అదిగో స్టేషనొచ్చేస్తోంది! పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యాలని ప్రయత్నించావో ... ఈ రివాల్వర్‌లో ఉన్న గుళ్ళు సరాసరి నీ గుండెల్లోకి చేరుకుంటాయి!" అంటూ అతని చేతిలోని సూట్‌కేస్ లాక్కుంది రేవతి.

నిస్సహాయంగా చూడ్డం తప్ప మరేం చెయ్యలేకపోయాడు వేణు.

"థాంక్యూ! మిస్టర్ వేణుమాధవ్!" అతని చెంపమీద సున్నితంగా ముద్దుపెట్టుకుంది రేవతి.

అతను ఎంజాయ్ చేసే పరిస్థితిలో లేదు.

"మిస్ రేవతి! నా మొత్తం ఆస్తి అది! అదంతా తీసుకుని నన్ను బికారిని చెయ్యకు! ప్లీజ్!" రెండు చేతులూ జోడించాడు.

ఈసారి ఇద్దరూ నవ్వారు, అతని అమాయకత్వానికి.

"ఎక్కడో పిచ్చాడిలా వున్నావే! పులికి వైష్ణవ మతం బోధించినట్టు, మా దగ్గరా నీ వేడికోళ్ళు? సారీ! నువ్వో పెద్ద రైటర్‌విగా... మళ్ళీ ఇంతకన్నా ... ఎక్కువే సంపాదించుకో వమ్మ! ఇంక మాకు శలవిస్తావా?" అంది అల్లరిగా రేవతి.

ట్రైన్ భయంకరంగా అరిచింది!

తృళ్ళిపడి స్టడీగా నిల్చున్నారు రేవతి, యాదవ్. స్టేషన్‌లో బండి ఆగింది!

దాదాపు పదిమందికూడా దిగలేదక్కడ.

ట్రైన్ తిరిగి కదిలింది.

పిస్టల్ వేణుకేసి గురిపెట్టి రన్నింగ్ ట్రైన్‌లోంచి దిగేశారు.

దాదాపు ఏడుస్తున్నట్టు చూస్తున్న వేణుకేసి నవ్వుతూ చూసి, గాలిలో ఓ ముద్దు విసిరి — "గుడ్‌బై మైడియర్ ఫ్రెండ్!... నా తెలివిముందు నీ తెలివి బలాదూర్!" గర్వంగా నవ్వుతూ నిశీధిలో కలిసిపోయింది రేవతి యాదవ్‌తోసహా.

ట్రైన్ వెళ్ళిపోయేదాకా — దూరంనించి చూసి, గబగబా ఉత్సాహంగా నిర్ణీత ప్రదేశానికి చేరుకున్నారిద్దరూ.

ఆతృతగా పెట్టె తెరిచింది రేవతి.

"మైగాడ్!" అప్రయత్నంగా అంది.

"ఏమిటి?" కంగారుగా చూశాడు యాదవ్.

పెట్టెలో ఏవో పుస్తకాలుతప్ప కరెన్సీకాదు కదా... ఒక మంచి పేంట్‌కూడా లేదు.

ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

పుస్తకాలన్నీ ఎడాపెడా పడేసిన రేవతికి ఓ కాయితం కనిపించి తృళ్ళిపడింది.

దానిమీద "మిస్ రేవతికి" అమంది.

ఆతృతగా విప్పి చదివింది.

అందులో ఇలా వుంది!

మైడియర్ రేవతి!

పాపం! ఆడపిల్లని పెద్ద సాహసమే చేశావ్!... కానీ... ఏం లాభం... చిత్తుగా ఓడిపోయావ్! ఏం చేస్తాం అన్ని రోజులు మనవి కావు!

నీ వాలకం నేను స్టేషన్‌లోనే కనిపెట్టాను. అంతేకాదు. నీ నౌకరుగా కనిపించిన వ్యక్తి మరో కంపార్ట్‌మెంట్ ఎక్కడం చూసి... ఇదేదో ఆలోచించతగ్గ కేసే అనుకున్నాను.

నీతో మాటలు కలిపాను. నా కథలగురించి చాలా మెచ్చుకున్నావ్!... కానీ... నువ్వు నా కథ ఒక్కటీ చదవలేదని ఊహించడానికి ఎంతోసేపు పట్టలేదు. అసలు నీకోటి తెలుసా? కుంకుమ రేఖ అన్న కథ నేను రాయనేలేదు.

నాకు సంగతి కొంతవరకు అర్థమైంది. నువ్వు బాత్‌రూమ్‌కి వెళ్ళినప్పుడు నా డబ్బంతా తీసి తలకింద పెట్టుకుని పుస్తకాలు గట్టా సర్ది పెట్టాను పెట్టెలో. ఈ ఉత్తరం రాసి పెడుతున్నాను.

నువ్వనుకున్నంత వెధవను కానుసుమా! అది చెప్పడానికే ఇది రాసి పెడుతున్నాను.

ఒకందుకు మాత్రం మీ ఇద్దరికీ థాంక్స్ చెప్పుకుంటున్నాను. అదే నా సూట్‌కేస్ అక్కడే తెరవనందుకు

పోతే... మరోకందుక్కూడా చెప్పుకోవాలి. నేను రచయితని!...ధైర్యంచేసి ఈ ప్రయాణం చేసినందుకు... మంచి అనుభవం! నామెదడుకి మంచి మేత!

ఏది ఏమైనా... ఒంటరిగా ప్రయాణం చేస్తున్న నాకు ఓ అందమైన ఆడపిల్ల చక్కని కంపెనీ ఇవ్వడమే గాక... తియ్యని ముద్దు కూడా పెట్టింది. నిజంగా చాలా థ్రిల్లింగ్‌గా వుంది.

బై!... మీరీ ఉత్తరం చదివేసరికి నేను చాలా దూరం వెళ్తుంటాను! ఇంకెలాంటి ప్రయత్నాలు చెయ్యకు! ఎందుకంటే పక్క స్టేషన్లో పోలీసు సహాయం కోరుతాను.

ఎనీ... వే!... ఆడపిల్లవి! చాలా ఎడ్వంచర్ చేశావ్ ... సారీ!... వెరీ వెరీ సారీ.

వేణుమాధవ్! ★



# నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : 14 14 : 21. మల్లిఖార్జునరావు వీధి, విజయవాడ 520003

## ప్రజలనుంచి, వాటాదార్లనుంచి ఫిక్సెడ్ డిపాజిట్లు / ఋణములు అంగీకరించుట / పునరుద్ధరించుట జరుగును.

### షరతులు, నిబంధనలు :

1. కనీస మొత్తం రు. 2000లు లేదా ఆపై రు. 1000లో హెచ్చింపబడు మొత్తమునకు డిపాజిట్లు అంగీకరించడం/ పునరుద్ధరించడం జరుగుతుంది.
2. డిపాజిట్లు/ఋణములు కనీస పరిమితి 1 సంవత్సరమునకు గరిష్ఠ పరిమితి 3 సంవత్సరముల కాలమునకు అంగీకరించ బడును.
3. దరఖాస్తు ఫారములో పేర్కొన్నటువంటి షరతులు, నిబంధనలకు లోబడి డిపాజిట్లు, ఋణములు అంగీకరించడం జరుగుతుంది. దరకాస్తుఫారములు విజయవాడలోగల మా రిజిష్టర్డుకార్యాలయంలోనూ, హైదరాబాదు నెం.5—9—49, బషీర్‌బాగ్ లోని మా బ్రాంచి కార్యాలయం నందును లభ్యము కాగలవు.
4. డిపాజిట్లు/ఋణములు తిరిగి చెల్లింపులుగాని, వడ్డీ చెల్లింపులు గాని డిపాజిటు స్వీకరించిన ఆయా ప్రదేశములలోని కంపెనీ బ్యాంకర్లు, క్రాస్‌చేసిన చెక్కులద్వారా చెల్లించ బడుతుంది.
5. కొత్తగా దరఖాస్తు పెట్టుకొని, వున్నడిపాజిట్లు పునరుద్ధరించుకోవచ్చును.
6. తిరిగి చెల్లించే గడువు ముగియక మునుపే, డిపాజిటు మొత్తంను తిరిగి చెల్లించే హక్కు కంపెనీ కలిగి యుంటుంది.
7. వడ్డీని ప్రతి ఆరునెలలకు అంటే ఏప్రిల్ 30వ మరియు అక్టోబరు 31న ఈ క్రింది రేట్లపై చెల్లించబడుతుంది.

| | |
|---|---|
| ఒక సంవత్సరానికి | సాలుకు 13% |
| రెండు సంవత్సరాలకు | సాలుకు 14% |
| మూడు సంవత్సరాలకు | సాలుకు 15% |
| ( డైరెక్టర్ల నుండి | సాలుకు 12% |

1956 కంపెనీల చట్టంలోని సెక్షన్ 51 ఏ క్రింద సవరించిన 1975 కంపెనీల నిబంధనల ప్రకారం (డిపాజిట్లు అంగీకరించు విషయంలో) కంపెనీ యొక్క వివరాలు :

I. కంపెనీ పేరు : నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్,
14—14—21 మల్లిఖార్జునరావు వీధి, విజయవాడ—520 003.

II. స్థాపించిన తేది : 4 మే 1955.

III. వ్యాపారము . వార్త పత్రికలు, తదితర పత్రికలు అనగా ఆంధ్రపత్రిక, (దిన పత్రిక), ఆంధ్ర సచిత్రవార పత్రిక, (వారపత్రిక) భారతి, (మాస పత్రికలను) విజయవాడ, హైదరాబాద్‌లలోని కంపెనీ స్వంత రోటరీ, మరియు ఆప్‌సెట్ ముద్రణ యంత్రములపై ప్రింటు చేసి ప్రచురిస్తున్నది.

IV. మేనేజిమెంటు : బోర్డు ఆప్ డైరెక్టర్ల కంట్రోలు, మరియు సూచనల మేరకు మేనేజింగ్ డైరెక్టరుచే కంపెనీ నిర్వహించబడుచున్నది.

V. బోర్డ్ఆప్ డైరెక్టర్ల పేర్లు, చిరునామా, వృత్తి.

| | పేరు | చిరునామా | వృత్తి |
|---|---|---|---|
| 1. | శ్రీ ఎస్. రాధాకృష్ణ (మేనేజింగ్ డైరెక్టర్) | 14-14—21, మల్లిఖార్జునరావువీధి, గాంధినగరం, విజయవాడ—3. | డైరెక్టర్. |
| 2. | శ్రీమతి ఎస్. కామాక్షమ్మ, | నెం. 1, లజ్ ఎవెన్యూ, మైలాపూరు, మద్రాసు—4. | డైరెక్టర్. |
| 3. | శ్రీ ఎస్. నాగేశ్వరరావు, | నెం. 1, లజ్ ఎవెన్యూ, మైలాపూరు, మద్రాసు—4. | డైరెక్టర్. |
| 4. | శ్రీ సి.హెచ్. పూర్ణచంద్రరావు, | కేరాప్ విజయాపిక్చర్స్,గాంధినగరం, విజయవాడ—3. | డైరెక్టర్. |

VI గడచిన మూడు ఆర్థిక సంవత్సరములలోనూ పన్నులు డివిడెంట్లు, కేటాయింపులకు ముందు, తర్వాత కంపెనీ, లాభాలు (ఆడిట్‌కాబడిన బ్యాలెన్స్ షీట్లు నుండి అంకెలు)

| 30 ఏప్రిల్ సం. అంతమునకు | పన్నుకు ముందు లాభము | పన్ను తర్వాత లాభము | ప్రకటించిన డివిడెంటు% |
|---|---|---|---|
| 1981 (నష్టము) | రు. 152005 (నష్టం) | రు. 152005 (నష్టం) | లేదు |
| 1982 | రు. 39721 | రు. 39721 | లేదు |
| 1983 (నష్టము) | రు. 238108 (నష్టం) | రు. 238108 (నష్టం) | లేదు |

**VII** ఆడిట్ కాబడిన గడచిన రెండు బ్యాలెన్స్‌షీట్లులో సూచించిన కంపెనీ ఆర్థికస్థితి గతుల సంగ్రహ రూపము.

| 1. | 2. అప్పులు | 3. 30.4.1983 నాటికి ఆడిట్ కాబడిన లెక్కలలో ముగిసిన గత ఆర్థిక సంవత్సరానికి అంకెలు | 4. రెండవకాలంలో సూచించిన ఆర్థికసంవత్సరానికి ముందు సంవత్సరానికి 30.4.1982 నాటికి ముగిసిన అంకెలు. | 5. ఆస్తులు | 6. 30.4.1983 నాటికి ఆడిట్ కాబడిన లెక్కలలో ఆరంభించిన గత ఆర్థిక సంవత్సరానికి అంకెలు | 7. రెండవకాలంలో సూచించిన ఆర్థిక సంవత్సరానికి ముందు సంవత్సరానికి 30.4.1982 నాటికి ముగిసిన అంకెలు |
|---|---|---|---|---|---|---|
| | షేర్‌కాపిటల్ | 3,71,000 | 2,55,000 | ఫిక్సెడ్ ఆస్సెట్స్ | 15,46,449 | 12,53,786 |
| | రిజర్వులు సర్‌ప్లస్ | 3,51,802 | 5,91,356 | పెట్టుబడులు | 11,545 | 11,545 |
| | సెక్యూర్‌డ్‌లోన్స్ | 19,55,228 | 13,99,931 | కరెంటు ఆస్సెట్స్ | 51,91,342 | 48,22,867 |
| | అన్‌సెక్యూర్‌డ్‌లోన్స్ అండ్ డిపాజిట్లు | 3,09,056 | 2,77,000 | లోన్స్ అండ్ అడ్వాన్సెస్. | 2,06,032 | 1,94,541 |
| | | | | మిసలేనియస్ ఖర్చులు, | — | — |
| | వర్తమానఅప్పులు కేటాయింపులు | 39,68,282 | 37,59,452 | లాభాలు, నష్టం అకవుంటు. | — | — |
| | మొత్తం | 69,55,368 | 62,82,739 | మొత్తం | 69,55,368 | 62,82,739 |

**VIII** కరెంట్ లయబిలిటీ కేటాయించబడలేదు.

| | 30—4—19 నాటికి | 30—4—1982 నాటికి |
|---|---|---|
| లెటర్ ఆఫ్ క్రెడిట్ ద్వారా కొనుగోలుచేసిన ముడివస్తువులు | 11,51,873 | రు. 5,29,000 |

**IX** డిపాజిట్ల ద్వారా కంపెనీ సేకరించ గల మొత్తం రు. ,

**X** ఆర్థిక సంవత్సరమునకు ముందురోజున (30.4.1983) ఉన్నటువంటి నగటు డిపాజిట్లు. రు. 1,83,000

**XI** ఈ ప్రకటన తేదీనాటికి, అన్‌క్లెయిమ్డ్ డిపాజిటు మినహా నోవర్‌డ్యూ డిపాజిట్లు కంపెనీ కలిగియుండలేదని ఇందు మూలకంగా కంపెనీ తెలియ జేస్తున్నది.

**XII** కంపెనీ ఇందు మూలంగా ప్రకటించు చున్నది.

1. 1975 నవరించిన కంపెనీ నిబంధనలను (డిపాజిట్లు అంగీకరించుట కంపెనీ గౌరవిస్తున్నదని, 31మార్చి 1984న ఆలోగా డిపాజిట్లు గడువు పూర్తయ్యేలోగా తిరిగి చెల్లించడానికి ఒక జాతీయ బ్యాంకులో అవసరమైన మొత్తం జమ చేయబడినది.
2. డిపాజిటు మొత్తాలు తిరిగి చెల్లించే విషయంలో కేంద్రప్రభుత్వం పూచి ఉంటుందనే నిబంధన ఇందులో లేదు.
3. కంపెనీ అంగీకరించిన డిపాజిట్లు అన్ సెక్యూర్‌డ్ లోన్స్, ఇవి ఇతర అన్ సెక్యూర్‌డ్ లయబిలిటీస్‌తో పాటు పరిగణించ బడతాయి.
4. డిపాజిట్లు ద్వారా పునరుద్ధరణ ద్వారా వచ్చిన మొత్తాన్ని కంపెనీ వర్కింగ్ కాపిటల్ క్రింద ఉపయోగించు కొనవచ్చును.

**XIII** (1). ఈ ప్రకటన, కంపెనీ బోర్డుఆఫ్ డైరెక్టర్ల ఆమోదము మేరకు ఇవ్వ బడుచున్నది.

(2) ప్రకటన అంశము, కంపెనీయొక్క బోర్డ్‌ఆఫ్‌డైరెక్టర్లచే 26 12.1983న జరిగిన సమావేశంలో ఆమోదించబడినది.

(3) బోర్డు ఆఫ్ డైరెక్టర్లచే ప్రకటన అంగీకరించు నపుడు మెజారిటి సంఖ్యలో డైరెక్టర్ల సంతకంగల ఈ ప్రకటన కాపీని రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీస్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్ వారికి రిజిస్ట్రేషన్‌కోసం దాఖలు చేయబడినది.

బై ఆర్డర్ ఆఫ్‌ది బోర్డు.

**ఫర్ నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్,**

**(ప్రొప్రయిటర్స్ ఆఫ్ ది ఆంధ్ర పత్రిక),**

**(సం) ఎస్. రాధాకృష్ణ,**

మేనేజింగ్ డైరెక్టర్.

మద్రాసు.

తేది : 26.12.1983




**జరిగిన కథ — 17 :** 'గోరంత దీపం' పత్రిక దినదినాభివృద్ధి చెందుతోంది. పరశురాం కట్టించిన బిల్డింగ్‌లోకి పరశురాం అండ్ కం., 'గోరంత దీపం' పత్రిక ఆఫీసు మారిపోయాయి. అనంతపురంలో తన స్నేహితుని కూతురి పెళ్ళికి రమణని వెంటపెట్టుకొని వెళుతాడు విశ్వమూర్తి. విక్టోరియా నర్సింగ్‌హోమ్‌లో ఒక ఆస్తమా పేషంటు నర్సు మేరీ నిర్లక్ష్యానికి బలైపోయాడనే వార్త 'గోరంత దీపం' పత్రిక మొదటి పేజీలో ప్రచురిస్తాడు విశ్వమూర్తి, ఆ సిస్టర్‌ని ఆ వార్త చదివిన వారంతా యాగీ చేయగా ఆమె నిద్రమాత్రలు మింగి ఆత్మహత్య చేసుకుంది. ఈ సంగతి తెలిసి ఆమె మరణానికి పరోక్షంగా తనుకారణ మయ్యానని కుమిలిపోతాడు విశ్వమూర్తి. ఏక్సిడెంట్‌లో కాళ్ళుపోగొట్టుకున్న పార్థసారధి జీవితాన్ని కథగా 'గోరంత దీపం'లో ప్రచురిస్తాడు విశ్వమూర్తి. హరిప్రసాద్, రమణల పెళ్ళికి వచ్చిన రావును అతని కోరికపై అరుణకు పరిచయం చేస్తాడు హరి. 'గోరంత దీపం' పత్రిక ఎడిటర్ పదవి హరిప్రసాద్ చేతుల్లోకి వచ్చింది. రావు 'గోరంత దీపం' బిజినెస్ మేనేజరుగా చేరుతాడు. గర్భంతో ఉన్న రమణ కోరికపై రమణ, హరి వూళ్ళు తిరిగిరాను వెళుతారు. అరుణకి ఫోన్‌చేసి పార్కుకి రమ్మని కోరుతాడు రావు. అరుణ రావును పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంటుంది. కర్నూల్లో త్రీ స్టార్ హోటల్ ప్రారంభోత్సవ సందర్భంలో ఆ హోటల్ యజమానిని ఇంటర్వ్యూ చేస్తాడు హరి. విశ్వమూర్తికి గుండె పోటు వస్తే హాస్పిటల్లో చేరుస్తాడు హరి. హాస్పిటల్లో విశ్వనాధంగారు, రమణ ఒకే క్షణంలో కన్నుమూసారు. హరిప్రసాద్ కుప్పకూలిపోయాడు. పరశురాం కూడ ఈ సంఘటనతో కృశించిపోయారు. కర్నూలు సాఫ్ట్ డ్రింక్స్ ఫాక్టరీవాళ్ళు తయారుచేస్తున్న 'జాలీకోలా'లో ఆల్కహాలు మిక్స్ చేస్తున్నారని ఆ విషయం 'గోరంత దీపం'లో పబ్లిష్ చేస్తానని హరి పరశురాంకు చెపుతాడు. ఆయన దానికి అంగీకరిస్తారు.

## (గత సంచిక తరువాయి)

**త**ను చేయదలచుకున్న 'జాలీకోలా' ఇన్వెస్టిగేషన్ గురించి ఎవరికి చెప్పదలచుకోలేదు హరి. అందుకని తనకి సహాయం గోపీనాథ్, రామ్మూర్తి మాత్రం ఉంటే చాలు అనుకుని, వాళ్ళిద్దర్నీ ఒకరోజు ఇంటికి రమ్మని చెప్పాడు. ఒకర్ని పిల్చినట్లు మరొకరికి తెలీదు.

ఇద్దరూ టయిముకి సరిగ్గా ఇంటిముందే కలుసుకున్నారు, ఒకర్నొకరు ఆశ్చర్యంగా చూసుకుంటూ.

"రండి. మీ ఇద్దరితో ఒక విషయం మాట్లాడాలని రమ్మన్నాను. ఈ సంగతి ఆఫీసులో కూడా ఎవరికీ తెలియటం అనవసరం. అందుకే ఈ ఏర్పాటు," అని వాళ్ళిద్దర్నీ ఆహ్వానించాడు హరి ప్రసాద్.

హరి పత్రికకి ఎడిటరు అయినా, రామ్మూర్తి తనకన్న ముందునుండి ఆ సంస్థలో ఉన్నాడు కనుక, అతన్ని 'మీరు' అని మన్నిస్తాడు.

ముగ్గురూ హాల్లోకూచుని బిస్కెట్లు, కాఫీ తీసుకున్నారు.

"మీరు 'జాలీకోలా' మానేస్తే మంచిదేమో అనిపిస్తోందండీ ." అన్నాడు హరి నవ్వుతూ రామ్మూర్తి నుద్దేశించి.

"నిజంగానే అంటున్నారా లేక తమాషాగా.. అదేమయినా విస్కీనా, బ్రాందీనా మానేయవలసినంత తప్పేం చేసిందండి పాపం. పూర్ 'జాలీకోలా' "

"అవును, మరి. మీరలాగే అంటారు ఎంతయినా పదేళ్ళనుంచీ క్రమం తప్పకుండా తాగుతున్నారు కదా! కానీ దానివల్లే మీకు అల్సర్ వచ్చిందేమోనని నాకేమో అనుమానంగా వుంది ... డాక్టర్ సుందరం చెప్పిన మాట గుర్తున్నది కదూ ? లిక్కర్స్ మీ ఒంటికి పడవు మానేయండి అన్నారు. బీర్ రుచయినా తెలీని మిమ్మల్ని పట్టుకుని ఆయన ఎందుకలా చెప్పాడంటారు."

"నిజమే హరీ ! ఆవేళ నుంచీ ఆలోచిస్తున్నాను...నాకేం అర్థంకాలేదు. అప్పటికీ నేను ఆల్కహాల్ రుచి అయినా తెలీని వాణ్ణనీ చెప్పాను. కానీ ఆ డాక్టర్ అదేం చెవికేసుకోకుండా, 'మంచిది' అనేసి తప్పించుకున్నాడు" అసహాయంగా అన్నాడు రామ్మూర్తి.

"అప్పుడే కలిగింది నాకో అనుమానం. ఈ 'జాలీకోలా'లో ఏమయినా చాలా తక్కువ శాతంలో ఆల్కహాల్ కలుపుతున్నారేమో. దాంతో వచ్చిన రుచీ, ఫ్లేవర్ వల్లనే ఇంత పాపులర్ అయిందేమో అనీ ఇవన్నీ నా అనుమానాలే అనుకోండి. ఈ అనుమానాన్ని అలాగే వదిలేందుకు ఇది మనలో ఒకరికీ ఇద్దరికీ సంబంధించిన విషయం కాదు కొన్నివేలమంది ఆ డ్రింక్ తీసుకుంటారేమో ప్రతీరోజూ వాళ్ళలో చిన్నపిల్లల పర్సెంటేజి ఎక్కువే వుంటుంది ఒకసారి రెండుసార్లు తాగినంత మాత్రాన ఏమీ కాకపోవచ్చు. కానీ అదే వరుసగా కొన్ని సంవత్సరాలు తీసుకుంటూ అలవాటుగా మార్చుకుంటే, అందులో నిజంగా ఎంత కొద్దిభాగం ఆల్కాహాల్ ఉన్నా ఆరోగ్యం చెడే అవకాశం ఉంది.

నేనీమధ్య కొన్ని రోజులుగా ఇద్దరు ముగ్గురు డాక్టర్లనీ, వాళ్ళ దగ్గరికి వచ్చేవాళ్ళలో అల్సర్ పేషంట్స్‌నీ ఎంక్వయిరీస్ చేశాను. అఫ్‌కోర్సు చాలా మటుకు స్మోకింగ్ వల్లో, లిక్కర్స్‌వల్లో అల్సర్స్ వచ్చిన వాళ్ళే ఎక్కువ అనుకోండి. కానీ అలాంటి అలవాట్లే మీ లేకున్నా, 'జాలీకోలా' ఎక్కువగా తాగేవారూ ఉన్నారు కొందరు. వాళ్ళ ఆహారపు అలవాట్లు అన్ని విచారణ చేసాను. అవన్నీ నా అనుమానానికి మరింత బలానిచ్చాయి.

ఇంక ఇందులో నిజానిజాలేమిటో తేల్చుకోవాలిప్పుడు మనం." ఆసక్తిగా వింటున్నాడు గోపీనాథ్. అతను ఆఫీస్‌లో చేరి రెండు సంవత్సరాలే అయింది. హరిప్రసాద్ వయసులో చాలా పెద్దవాడు కాకపోయినా అతనంటే గౌరవం గోపీనాథ్‌కి.

"ఏమయ్యా సైన్సు పోస్ట్‌గ్రాడ్యుయేట్‌వి కదా నువ్వు. ఎక్సైజ్ వాళ్ళు ఏ లిక్కర్‌లో ఎంత ఆల్కహాల్ ఉన్నదీ ఎలా అసెస్ చేస్తారో తెలుసా నీకు ?" అడిగాడు హరి, గోపీనాథ్‌ని.

సైన్సుని డిగ్రీకోసం మాత్రం కాకుండా శ్రద్ధతో, అభిమానంతో, చదివిన స్టూడెంట్ గోపీనాథ్. తనని ప్రత్యేకించి సైన్సు గురించి

ఎవరైనా ఏమయినా అడిగితే చాలా ఉత్సాహంగా జవాబు చెబుతాడు అతను .

''ప్రత్యేకంగా అందుకే తయారు చేసిన హైడ్రోమీటర్ అనే సాధనం ఉపయోగిస్తారు సార్ ! దీని సహాయంతో ఆల్కహాల్ పర్సంటేజ్ ఎంత వున్నదీ సులభంగా తెలుసుకోవచ్చు. దీన్ని తయారు చేయటంలో ప్రూఫ్ స్పిరిట్ అనే నీరు, ఆల్కహాల్ మిశ్రమాన్ని స్టాండర్డ్‌గా ఉంచుకుంటారు. ప్రూఫ్ స్పిరిట్‌లో 57.1 శాతం ఆల్కహాల్ ఉంటుంది. కానీ దీన్ని 'జాలీకోలా' లాంటి సాఫ్ట్ డ్రింక్స్‌కి ఉపయోగించేందుకు వీలు కాదనుకుంటాను. అందులో చాలాతక్కువగా వుంటుంది కదండి పర్సంటేజి. అందుచేత.''

''ఏ కెమికల్ లాబొరేటరీలో అయినా అనలైజ్ చేయవచ్చునా?'' అడిగాడు. కానీ, హరికి తెలుసు ఇంత సులభంగా తేలిపోయే విషయం కాదు ఇది అని.

''కష్టమే సార్ ! మామూలుగా ఇలాంటి సాఫ్ట్ డ్రింక్స్ అన్నింట్లో ఎక్కువ భాగం సోడా వాటర్ వుంటుంది. కానీ నాకు తెలిసినంతలో మరొక మార్గం వుంది. ఏ డ్రింక్‌కి అయినా ముందుగా నిర్ణయించబడిన మిశ్రమ సూత్రాన్ని అనుసరించి ఒక సిరప్‌ని తయారుచేస్తారు. ఇందులో కొన్ని మిల్లి మీటర్ల ద్రవాన్ని మాత్రమే ప్రతీ సీసా డ్రింక్ తయారీకి ఉపయోగిస్తారు. మనకి ఆ సిరప్ సాంపిల్ దొరికితే అందులో ఆల్కహాల్ కలిసి ఉన్నదీ లేనిదీ సులభంగా కనుక్కోవచ్చును.''

''ఉహు. అయితే మనం ఇప్పుడా సిరప్ సాంపిల్‌ని సంపాదించాలన్నమాట. బావుంది'' అని కొన్ని క్షణాలు ఆలోచనలో పడ్డాడు హరి.

* * *

ముందుగా ప్లాను వేసుకున్న ప్రకారం రామ్మూర్తి, గోపీనాథ్ కలిసి బయలుదేరారు, రామ్మూర్తి స్కూటర్లో ఊరికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న కర్నూల్ సాఫ్ట్ డ్రింక్ ప్రైవేట్ లి. వారి ఫ్యాక్టరీ చేరటానికి ఇరవయి నిముషాలు పట్టింది.

వాళ్ళిద్దరూ పోర్టికోలో స్కూటర్ పార్క్ చేయగానే, అటూ ఇటూ చూసి ముందుకి వెళ్ళబోయారు. ఎవరు కావాలని అడిగాడు రిసెప్షనిస్ట్. తాము ఫలానా అని చెప్పగానే, వాళ్ళిద్దర్నీ అక్కడున్న సోఫామీద కూర్చుబెట్టి ఫోన్‌చేశాడు మేనేజర్‌కి.

వీళ్ళు ఫ్యాక్టరీ చూసేందుకు వస్తారని హరిప్రసాద్ ముందుగానే మేనేజర్‌కి చెప్పి ఉండటం వల్ల, అతను వెంటనే తన గదిలోంచి బయటికి వచ్చాడు. స్వయంగా వాళ్ళని ఆహ్వానించి తన వెంట లోపలికి తీసుకువెళ్ళాడు. ముగ్గురూ ఒకర్నొకరు పరిచయాలు చేసుకున్నారు. మేనేజర్ రామస్వామి పొట్టిగా లావుగా చూడటానికి బొండాంలా ఉన్నా మనిషి కదలిక, నడకల్లో చురుకుతనం ఉంది. అతను తన గారపళ్ళు బయట పెట్టి నవ్వినప్పుడల్లా, ఒక ఫోటో తీసేద్దాం అన్నంత ఉత్సాహం వచ్చేస్తోంది గోపీనాథ్‌కి.

అతను ఇద్దర్నీ తన గదికి తీసుకువెళ్ళి కూర్చోబెట్టాడు. ఇద్దరికీ కాఫీలు ఇచ్చి, కొంత సేపు తనని గురించి, తన ప్రొప్రయిటర్స్ దగ్గర తనకున్న ఇన్‌ఫ్లూయన్సు గురించి డబ్బా కొట్టుకున్నాడు. అంతలో మళ్ళీ తనే, ''సారీ ! మీ టయిం వేస్ట్‌చేస్తున్నాను. మీరు వచ్చిన పని ముందు చూడాలి కదా ! పదండి'' అని లేవగొట్టాడు, ఇద్దర్నీ.

రామ్మూర్తి బాగ్‌లోంచి కెమెరా తీసి మెడలో సర్దుకున్నాడు. గోపీ చిన్న పేడ్, పెన్సిల్ చేతిలోకి తీసుకున్నాడు జేబులోంచి. అలాగే ఒకసారి ఇంకో జేబులో చేయి పెట్టి చూసుకున్నాడు. తాను తెచ్చుకున్న ఖాళీ ఇంజక్షన్ సీసా ఉందా లేదా అని. సీసా చేతికి తగిలింది. ఉత్సాహంగా ముందుకు అడుగు వేసాడు. అప్పటికే మిషన్ల హోరు చెవుల్లో నిండి వాళ్ళు గట్టిగా మాట్లాడితేగాని, విన్పించటం కష్టంగా వుంది.

ఒక పెడవాటి హాల్లో కొన్నిరకాల మెషీన్లు పని చేస్తున్నాయి అవన్నిటినీ దాటి అవతల దూరంగా ఉన్న ఓ గదిలోకి తీసుకువెళ్ళాడు మేనేజరు.

''జాలీకోలాకి కావలసిన సిరప్‌ని ఇక్కడ తయారుచేయం. హైదరాబాదు నుంచీ మాకు వొస్తుంది దాన్నిక్కడ బారల్స్‌లో స్టోర్ చేసి ఉంచుతాము'' అని చెప్పాడు రామస్వామి.

తరువాత మరో గదికి తీసుకువెళ్ళాడు



అతను ముందు వెళుతూంటే రామ్మూర్తి, గోపీనాథ్ ముఖాలు చూసుకుంటూ అతన్ని వెంబడించారు. కొన్నిక్షణాలు వెనుకబడ్డాడు గోపీనాథ్ స్టోర్ రూంలోనే, వరసగా పేర్చిఉన్న సీల్ చేసిన బారల్స్ వంక చూస్తూ.

ఇప్పుడు మళ్లీ ప్రవేశించిన గదిలో బాటిల్ క్లీనింగ్ మెషీన్ ఉంది. దాన్ని చూపి, మేనేజర్ వివరిస్తూండగా రామ్మూర్తి రెండు ఫోటోలు తీసుకున్నాడు.

ఆ గదిలో నుంచీ బాటిల్స్ ఒక పాసేజ్ ద్వారా మరొక గదిలోకి వెళుతున్నాయి. అక్కడొక పెద్ద గాజు బారల్‌లో ఉన్న సిరప్ చుక్కలుగా సీసాలలోకి పడుతోంది.

ఇక్కడ మేం ఉపయోగించే మెషినరీకి మనుషుల అవసరం చాలా తక్కువ. మొత్తం సెట్ అంతా జపాన్ నుంచీ తెప్పించాము. ఉదాహరణకి ఇది చూడండి, ఒక్కొక్క సీసాకి అయిదు మిల్లీలీటర్ల ద్రవం చాలు. ప్రతి సీసాలో పైనున్న బారల్ నుంచీ అవసరమయినంత ద్రవం పడగానే, దానంతటదే పక్కకి జరిగి ఆ చోటులో మరో ఖాళీ సీసా వస్తుంది. అక్కడ్నించీ ముందుకి కదిలారు రామ్మూర్తి, మేనేజరు. వాళ్ళ వెంట అవతలికి వెళ్ళినట్లుగా వెళ్ళి మళ్ళీ వెనక్కి వచ్చాడు గోపీనాథ్. అక్కడున్న టెక్నీషియన్ చేతికి తన దగ్గరున్న సీసా ఇచ్చి, సిరప్ బారల్‌ని చూపి సైగ చేశాడు. అతను గోపీనాథ్ తీరు చూసి, మేనేజరే చెప్పారు కాబోలు అనుకుని బారల్ నుంచీ కారుతున్న ద్రవాన్ని చిన్న సీసాలో నిండుగా నింపి అందించాడు.

'ఇంతేచాలు' అనుకుని సీసా జేబులో వేసుకున్నాడు గోపీనాథ్. ఏమీ ఎరుగని వాడిలా అటూ ఇటూ చూస్తూ ముందుకి వెళ్ళాడు. రామ్మూర్తి వెనక్కు చూసి "గోపీ! రావోయ్ త్వరగా ... ఇదిగో ఇక్కడ సోడా గాస్ ఫిల్లింగ్ ఎలా అయేదీ చూద్దువు గాని" అని మిషన్ల శబ్దం మించి గోపీకి వినిపించేలా పిలిచాడు.

అటుతర్వాత సీసాలు సీల్ అయే మెషీను చూసారు. రామ్మూర్తి వెనక్కీ ముందుకీ తిరిగి కొన్ని ఫోటోలు తీసుకున్నాడు.

"చాలా థాంక్స్ రామస్వామిగారూ! శ్రమ తీసుకుని మాకు అన్నీ చూపించినందుకు" అని ఇద్దరూ మేనేజరుకి కృతజ్ఞతలు చెప్పుకున్నారు. ఆ మాటకే పొంగిపోయాడు "అతను. ఎంత మాట. ఇందులో కష్టం ఏముందండి? 'గోరంత దీపం' జర్నలిస్టులు అనగానే ఈ గౌరవం మీకు ఎక్కడయినా లభిస్తుంది" అని మళ్ళీ నవ్వుతూ ఇద్దర్నీ సాగనంపేడు.

రామ్మూర్తి గోపీనాథ్ ఆఫీస్ చేరి హరి ప్రసాద్ గదిలోకి వెళ్ళారు. జేబులోంచి సీసాతీసి టేబిల్‌మీద హరి ముందుంచాడు గోపీ. "గుడ్. షో, వెళ్ళిన పని సాధించారన్నమాట," అని దాన్ని తీసి తన టేబుల్ సొరుగులో ఉంచేశాడు. "ఇవాళే దీన్ని హైదరాబాద్ పంపిస్తాను ఎనాలిసిస్‌కి" అంటూ "మేనేజర్ ఏమన్నాడు? అన్ని చూపించాడా?" అడిగాడు.

వాళ్ళేవరూ జవాబు చెప్పకముందే, టేబిల్ మీద ఫోన్ మోగింది. కొంతసేపు అతను ఫోన్లో మాట్లాడి పెట్టేశాడు. మాట్లాడుతున్నంతసేపు ఎదురుగా కూర్చున్న ఇద్దరి వయిపు చూసి చిన్నగా నవ్వుతున్నాడు వాళ్ళకిదేమీ అర్ధం కావటం లేదు

"ఏమిటొస్సార్ సస్పెన్స్? ఎవరు ఫోన్ చేసింది?"

"అక్కడ నువ్ చేసిన పని బయటపడింది స్వామీ!"

"నేనా? నేనేం చేశాను. మీరు చెప్పినట్లు చేశాను."

"ఆఁ అదే. పాపం! ఒకటే గాభరా పడి పోతున్నాడు మేనేజర్ రామస్వామి. వాళ్ళుపయోగించే సిరప్ కొన్ని చుక్కలు కూడా ఫేక్టరీ దాటి బయటికి వెళ్ళేందుకు వీలు లేదట. మరి నువ్వేమో సీసానే నింపుకుని వచ్చేశావు. ఆ సిరప్ కాంపోజిషన్ ఒక వ్యాపార రహస్యం అట. అది ఎవరికీ తెలియటానికి వీల్లేదుట. 'మా వాడు కొంచెం రుచి చూద్దామని తీసుకున్నాడు, అది అతని కడుపులోకి ఎప్పుడో చేరిపోయింది' అని భరోసా ఇచ్చాన్లేను. పాపం ఆ గాభరాలో మన క్కావలసిన మరో ఇన్ఫరమేషన్ ఇచ్చాడు. ఆ కాంపోజిషన్ వాళ్ళ జనరల్ మేనేజర్ కేశవరెడ్డి గారికి తప్ప మరెవ్వరికీ తెలీని రహస్యమట."

గోపీనాథ్ సంభాషణతో పాల్గొనటం మానేసి కొంతసేపు ఆలోచనలో పడిపోయాడు. హరి ఇది గమనించి అడిగాడు "ఏమిటోయ్... ఏదో ప్లాన్ వేస్తున్నట్లున్నావు."

తన ప్లాన్ ఏమిటో నాలుగు ముక్కల్లో చెప్పేశాడు గోపీ

* * *

ఆ వారంలో 'కర్నూల్ సాఫ్ట్ డ్రింక్ ఫ్యాక్టరీ' గురించిన ఫోటో ఫీచర్ వచ్చింది 'గోరంత దీపం'లో. జనరల్ మేనేజర్ కేశవ రెడ్డిగారు స్వయంగా హరికి ఫోన్‌చేసి "యు హేవ్ డన్ వెల్" అని కంగ్రాచులేషన్స్ చెప్పారు.

ఆవాళే హైదరాబాదునుంచి ఎనాలిసిస్ రిపోర్ట్ వచ్చింది. హరిప్రసాద్ అనుమానం నిజమే అని తేలింది. వెంటనే గోపీనాధ్‌ని పిలిచి దానికి ఫోటోస్టాట్ కాపీలు తీయించమని, చెప్పి పంపేడు హరి.

"సార్, ఆ రోజు 'జాలీకోలా' గురించి నేను చెప్పినది గుర్తుంది కదూ. ఇన్వెస్టిగేషన్ అయింది. నా అనుమానం నిజమే. సిరప్‌లో ట్వంటీ పర్సంట్ ఆల్కహాల్ ఉందట."

"ఈజిట్?" నమ్మలేకపోయాడు పరశురాం.

ఆయనతో మాట్లాడటం అయ్యాక, ఎస్.పి. కృష్ణప్పగారి నెంబరు తిప్పాడు. "హలో. ఏమిటీ 'గోరంత దీపం' ఆఫీసా? హరిప్రసాద్ కదూ మీ పేరు?"

విశ్వమూర్తి చదువుకునే రోజుల్లో అతనికి జూనియర్ కృష్ణప్ప. ఆయన కర్నూలు ఎస్.పి.గా వచ్చినప్పట్నించీ వాళ్ళ స్నేహం మళ్ళీ అభివృద్ధి అయింది. 'గోరంత దీపం' పేరు వినగానే, కృష్ణప్పకి స్నేహితుడే గుర్తొచ్చాడు.

ఆ రకంగా హరిప్రసాద్‌తోనూ కొంచెం పరిచయం ఉంది.

"ఆఁ ఏమిటీ, మీ మామయ్య ఉండే రోజుల్లో నేనతనికి టిప్స్ ఇస్తే నాకు అతను ఇస్తుండేవాడు. పాపం మంచి మనిషి. త్వరగా వెళ్ళిపోయాడు."

"......................"

"అసలు సంగతేమిటి? ఏదయినా ఇన్ఫర్మేషన్ ..."

"మీకు ఇవ్వాలనే ఫోన్‌చేసింది. ఫోన్‌మీద వివరంగా చెప్పటం బాగుండదు. క్లుప్తంగా చెపుతాను. 'కర్నూలు సాఫ్ట్ డ్రింక్స్' వారి 'జాలీకోలా'లో కొంత ఆల్కహాల్ కంటెంట్ వుండొచ్చని, కొన్ని ఆధారాల వల్ల అనుమానం వచ్చింది మాకు. ఇన్వెస్టిగేట్ చేస్తే అనుమానం నిజమేనని తేలింది. మేము చేయించిన కెమికల్ ఎనాలిసిస్ రిపోర్ట్ ఒక కాపీ మీకు పంపిస్తాను."

"ఊహూఁ! ఇంత విలువయిన ఇన్ఫర్మేషన్ వూరికే ఇస్తానని మీరు చెప్పినా నేను నమ్మను. మీ న్యూస్ పేపర్ వాళ్ల సంగతి నాకు తెలుసు. అందుకు బదులుగా నా నుంచీ మీరేం ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు."

ఎస్. పీ గారు అంత తొందరగా తన పాయింటును అర్థం చేసుకున్నందుకు సంతోషించాడు హరిప్రసాద్.

"యూ ఆర్ కరెక్ట్. ఈ విషయంలో మీరే ఏక్షన్ తీసుకున్నా, మాక్కొంచం టిప్ ఇవ్వాలి. ఉదాహరణకి మీరు కంపెనీ జనరల్ మేనేజర్ కేశవరెడ్డిగారి పర్సనల్ ఆఫీసుగానీ, ఇల్లుగానీ రెయిడ్ చేస్తారనుకొండి, టయిం చెబితే, కొంచం అటూ ఇటూగా మా రిపోర్టర్ ఒకరు వస్తారు. అప్పుడు కావలసిన ఇన్ఫర్మేషన్ మీరు నేరుగా ఇవ్వాలిసిన అవసరం ఉండదు; ఏమంటారు?"

"ఓకే! అలాగే... చూడబోతే మీ మామగారి కన్నా తెలివయిన వారిలా ఉన్నారు మీరు."

"థాంక్‌యూ ఫర్ ది కాంప్లిమెంట్ ... సరే ఉంటాను సర్" ఫోన్ పెట్టేసాడు హరి.

మొత్తంమీద మూడవరోజుకల్లా మిస్టరీలో మిగిలిన గాప్స్ అన్నీ పూరించబడ్డాయి.

'జాలీకోలా' సిరప్ అందరూ అనుకుంటున్నట్లు హైదరాబాద్ నుంచీ కాక, కర్నూల్లోనే కేశవరెడ్డి ఇంటి నుంచే వస్తోందని తెలిసింది ముందర. దాంతో రెడ్డి ఇంటిని రెయిడ్ చేసిన పోలీసులు, ఇంటి వెనకభాగంలో రహస్యంగా పని చేస్తున్న చిన్న లేబరేటరీని కనుక్కున్నారు. దాని వెనకాలే ఉన్న షెడ్‌లోంచి కొన్ని వందల ఆల్కహాల్ బారల్స్ కూడా స్వాధీనం చేసుకున్నారు.

ఆ వారం 'గోరంత దీపం'లో, 'జాలీకోలా' మిస్టరీ నాలుగు పేజీలు ఆక్రమించింది.

రావు పరశురాం అండ్ కంపెనీలో బిజినెస్ మానేజర్‌గా స్థిరపడిపోయాడు. కానీ అతనికి ఊరూ, ఉద్యోగమూ బోర్‌గా ఉన్నాయి. కంపెనీ బుక్ పబ్లిషింగ్ సెక్షన్ హైదరాబాదుకి షిఫ్ట్ చేస్తే బాగుంటుందనిఎన్నిసార్లో పరశురాంకి సలహా ఇవ్వబోయేడు. డిస్ట్రిబ్యూషన్‌కీ, పబ్లిసిటీకీ కూడా అనుకూలంగా ఉంటుందని చెప్పి చూశాడు. ఎన్ని చెప్పినా పరశురాంకి కంపెనీ రెండు భాగాలుగా విడగొట్టేసి దూరం చెయ్యటం ఇష్టం లేదు. విశ్వం, తానూ కలిసి రాసుకున్న అగ్రిమెంట్ ప్రకారం తానిప్పుడు కంపెనీకి సోల్ ప్రొప్రయిటర్. కంపెనీ ఒక్కటిగా ఉండాలనే తామీ అగ్రిమెంటు చేసుకున్నది. 'గోరంత దీపం' కోసం తన జీవితాన్నే అంకితం చేశాడు విశ్వం. వారం వారం తన టేబిలు మీదికొచ్చే 'గోరంత దీపాన్ని' చూసినప్పుడల్లా, అందులో ముందుగా విశ్వం ముఖమే దర్శనం ఇస్తుంది.

అసలు ఈ పబ్లిషింగ్, న్యూస్‌పేపర్ సెక్షన్ల మధ్య ఉన్న సంబంధమే రావుకి ఏ మాత్రమూ నచ్చని విషయం.

బుక్ పబ్లికేషన్ విభాగంలో పరశురాం తర్వాత తనదే పైచేయి. మరి పేపర్ ఆఫీస్ అడ్వటయిజ్‌మెంట్ సెక్షన్‌లో పని చేసే స్టాఫ్ అంతా, హరిప్రసాదే తమ బాస్ అన్నట్లు ప్రవర్తిస్తారు. దానికి తోడు హరి తనకి పేపర్ సర్క్యులేషన్ బాధ్యతని అప్పగించలేదు. అదీ రావుకి అవమానంగా వుంది. హరి మీద కసిగా వుంది? కానీ తానేం చేయటానికీ లేదు. పరశురాంకి హరి అంటే చాలా గౌరవం. అతనేం చెబితే దాన్ని ఓకే చేస్తాడు. ఎడిటర్‌గా అతనికి విశ్వమూర్తికి ఉండినంత స్వాతంత్ర్యం ఇచ్చేవాడు పరశురాం.

విశ్వమూర్తి మరణించిన తర్వాత కొన్ని రోజులు హరిని దూరంగా ఉంచాడు పరశురాం. ఆరోజుల్లోనే తాను పరశురాం ఆఫీసుకి రాని సమయంలో, అవకాశం తీసుకుని ఆయన నమ్మకాన్ని సంపాదించాడు, ఎన్నో విధాలుగా కష్టపడి. కానీ మళ్ళీ వాళ్ళిద్దరూ ఒకటయారు. అదేమిటో మళ్ళీ ఇద్దరూ ఎక్కువగా కలుసుకోవటం, మాట్లాడుకోవటం కన్పించదు. ఒకే బిల్డింగ్‌లోనే ఇద్దరూ రోజూ కనీసం పది గంటలు పనిచేసినా, ఎవరి గదిలోనే వాళ్ళుంటారు. ఏదయినా అవసరం పడితే ఫోన్ మీదే సలహాలు, సంభాషణలు జరుగుతాయి. కానీ బయటికి కనిపించని అండర్‌స్టాండింగ్ ఏదో ఆ ఇద్దరి మధ్యా ఉంది అనిపిస్తుంది. దాన్ని హరి ఎలా నిర్మించుకున్నాడో మాత్రం తనకి అర్థంకాదు.

వాళ్ళిద్దరికీ ఏదో విధంగా మనస్పర్థలు వచ్చేలా చేయగలిగితే బాగుండు అనిపిస్తోంది రావుకి కొన్ని రోజుల నుంచీ. ఏం చేయాలో మాత్రం తోచకుండా ఉంది.

ఒకప్పుడు అరుణ పొందు దొరికితే చాలు అనుకుని ఆమెతో స్నేహం చేసుకున్నాడు. ఇప్పుడదే తనకి అడ్డుగా ఉంది. తను ఏదో ఒక రోజు వాళ్ళనాన్నతో పెళ్ళి విషయం ప్రస్తావిస్తాడనే ఆశతో వాళ్ళనాన్న ఏ సంబంధం తెచ్చినా ఏదో ఒక వంక పెట్టి తప్పించుకుంటోంది. కనిపించినప్పుడల్లా ఆ మాటనే చెప్పి వేధిస్తుంది. అరుణ పీడ ఎలా వదిలించుకోవాలో తనకి మాత్రం అర్థంకావటం లేదు. కాదు, పొమ్మని కటువుగా మాట్లాడితే తన ఉద్యోగానికే ముప్పు కలుగుతుందేమో అని భయం. పెళ్ళి చేసుకోవటం అసలు ఇష్టం లేదు.



# గోరంత దీపం

అసలు రావుకి ఏ ఆడదాన్నీ నమ్మాలని పించదు. ఇవాళ తన వెంటబడిన అరుణ, ఇంకో రోజు తనకన్నా అందమయిన వాడు, మాటకారీ దొరికితే, తన్ని వదిలేసి వెళ్ళదని గారంటీ ఏమిటి ? అనుకుంటాడు.

ఆఫీసులో పరశురాం అనుసరించే కొన్ని పద్ధతులు రావుకి బొత్తిగా నచ్చవు. పరిస్థితి ఇలా ఉంటుందని ఉద్యోగంలో– ప్రవేశించిన కొత్తలోనే గ్రహించాడు రావు. కానీ అప్పట్లో తన తెలివితో, మాటలతో ఆయన్ని మార్చ గలననుకున్నాడు. అయితే ఎన్నాళ్ళు గడిచినా అలాంటి మార్పేమీ తేలేకపోయాడు పరశురాంలో.

బుక్స్ పబ్లిసిటీ చేయటంలో రావు చెప్పే సలహాలు పరశురాంకి సరిపడవు. ''సాహిత్యం విలువ యింకా అంతగా దిగజారలేదోయ్'' అంటాడు. ''పబ్లిసిటీ పేరుతో ఇంత డబ్బు ఖర్చు చేయటం కూడా దండుగ. మన కంపెనీకి ఇన్నేళ్ళలో ఒక మంచి పేరు అన్నది ఏర్పడింది ఆ ఇమేజ్ చాలు, మన పుస్తకాలు సేల్ అవడానికి'' అంటాడు.

''మార్కెట్లో ఇంకా చాలా కంపెనీలు వెలిశాయి సార్ !'' అని రావు తన పాయింటు పట్టుకుని వాదించబోతే, ''ఎన్ని కంపెనీలు పుట్టుకొచ్చినా, మన కంపెనీకున్న ప్రత్యేకత ఎక్కడికీ పోదు'' అని చల్లగా సమాధానం చెబుతాడు.

ఇక పుస్తకాల కవర్ డిజైన్స్ కోసం పరశురాం అండ్. కం. వారు వేయించే ఆర్టిస్ట్‌ల బొమ్మలు పాతచింతకాయ పచ్చడిలా ఉంటాయని రావు అభిప్రాయం.

''ఆర్ట్‌ని ఆదరించే కాలం పోయింది. కవర్ డిజైన్ అన్న తర్వాత, ఏదైనా చూపులని ఆకట్టుకునేలా ఉండాలి. అందుకు మోడల్స్‌తో తీసిన ఫోటోగ్రాఫ్‌లనో, అదే మోడల్స్‌ని ఉపయోగించి గీసిన బొమ్మలనో ఉపయోగిస్తే బెస్ట్'' అని ఎన్నిసార్లు చెప్పినా, ''పుస్తకంలో విషయానికీ, అనవసరమూ, అసంబద్ధమూ అనిపించే కవర్ డిజైన్లు నేను ఎప్పటికీ అంగీక రించలేను'' అని పట్టుబడతాడు.

''పుస్తకానికి అట్ట అన్నది రకరకాల అందమయిన వస్తువులున్న దుకాణానికి కిటికీ లాంటిది'' అని రావు చెప్పబోతే, నువ్వొచ్చినాకు సలహా ఇవ్వబోతున్నావా అన్నట్లు నవ్వుతూ, ''కథలో హీరో మాంసం తింటాడని ఉంది కనక, అట్టమీద బొమికలు వేయనక్కర లేదోయ్'' అని కొట్టిపారేస్తాడు.

(ఇంకా వుంది)

## కలియుగ బాలహనుమాన్!

కౌలాలంపూర్‌లో వో యువతికి డిశంబరులో మూడంగుళాల తోకతో వో మగపిల్లవాడు పుట్టాడట. ఆ పిల్లవాని మూతి ప్రతి బుధవారం నాడూ అచ్చం హనుమంతుని మూతిలా వోకింత వుబ్బి, నీలంరంగుగా మారుతూందట. పిల్లోడు ఎంచక్కా మామూలుగానే వున్నాడట.

## ప్రాణంతీసిన అక్రమ సంబంధం!

మంచిర్యాల కాలేజీలో ఆఖరి సంవత్సరం బియస్సీ చదువుతున్న రామ్‌ప్రసాద్ అనే అతను అదే వూరుకు చెందిన మణెమ్మ అనే వో వివాహితతో అక్రమసంబంధం పెట్టుకున్నాడట. అనుమానింపదగిన పరిస్థితులలో మంచిర్యాల రైల్వే స్టేషనుకు కొంచెం దూరంలో రైలు పట్టాలవద్ద అతని శవం దొరికిందట. మా అమర ప్రేమను కాదన్నందు వల్ల మేమిద్దరం కలిసి ఆత్మహత్య చేసుకుందామని అక్కడికి వెళ్ళాం. నేనెలా తప్పి యిక్కడికొచ్చానో నాకు తెలీదు అని మణిమ్మ అన్నదట. తన కొడుకునెవరో చంపేశారని, న్యాయ విచారణ కావాలనీ రామ్‌ప్రసాద్ తండ్రి రామస్వామి, ఇందిరాగాంధీ, యన్టీ రామారావు వగైరాలకందరికీ విన్నవించుకున్నారట. ఇంకా ఏమీ కదలిక కలుగలేదట — లెటస్సీ.

## బీరు తాగితే నపుంసకత్వం ?

ఫ్రెంచిదేశపు బీరు తమ దేశంలో ఎక్కువగా అమ్ముడుపోయి, స్వదేశపు బీరును బీటవుట్ చేస్తోందని వెస్ట్ జర్మనీ. దేశం "ఆ ఫ్రెంచి బీరు తాగకండి. దానివల్ల పురుషులు నపుంసకులూ, స్త్రీలు గొడ్రాళ్ళు అయ్యే ప్రమాదం వుంది" అని ప్రకటిస్తోందట

భయపడకు ఫ్రెంచి బీరు కాదులే!



పాలక్కుని జోరి

## స్వంత పిల్లల్ని బలిగొన్న కామాంధుడు!

తమిళనాడు ధర్మపూరికి చెందిన బిల్వరుత్తి అనే వో గ్రామానికి చెందిన గోవిందరాజ్ తన భార్య మహేశ్వరిని పిలిచి నీ చెల్లెలు మంజులకు పెళ్ళి చేయడానికి మీవాళ్ళు చాలా కష్టపడుతున్నారు. పోనీ దాన్ని నేనే చేసేసుకుంటాను. అప్పచెల్లెళ్ళిద్దరూ కలసి వుండచ్చు అని, వో సూచనిస్తే దానికి మహేశ్వరి మండిపడి ఎనిమిదేళ్ళ కూతుర్ని పెట్టుకుని మీకీ పాడుబుద్దేమిటని నిలదీసిందట. కానీ, గోవిందరాజుకీ కోర్కె పెరిగి, దాంతో మహేశ్వరి తలిదండ్రులతో విరోధం వచ్చిందట. మహేశ్వరి అన్నగారు వచ్చి నీ ముఖానికి ఇంకో పెళ్లికూడా కావాలా అని బావగార్ని నిలేస్తే వారిద్దరూ దాంతో కిశాకిశా కొట్టుకున్నారట. ఆ రాత్రి గోవిందరాజుకి కోపం వచ్చి నిద్రపోతున్న 3 ఏళ్ళు తంగమణి, 6 ఏళ్ళ కోకిల, 8 ఏళ్ళ వనజ ముగ్గురు పిల్లలనూ ఒక్కొక్కళ్ళనే మోసుకుపోయి, మామగారి పొలంలోని నూతిలో పారేసి వచ్చాట్ట. తెల్లారేసరికి మూడు శవాలు తేలాయట. తానాత్మహత్య చేసుకోబోయేలోగా పోలీసులకు దొరికాడట.

## భూమి తగాదాకు పసిపాప బలి

పుదుక్కోటకు చెందిన వడగడు గ్రామానికి చెందిన కత్తాన్ అనే అతనికి అదే వూరుకు చెందిన పళనియాండి అనే అతనికి భూ సంబంధమైన విరోధం చాలాకాలంగా వున్నదట. పళనియాండి కూతురు నాలుగున్నర సంవత్సరాల విలాయి శవం వో పొలంలోని వో గుడిశ చూరుకు వ్రేలాడుతూ కనుపించిందట. చావ తన్నులుతిని ఆ పిల్ల చని పోయి వుండాలని, ఆనక ఆమె శవాన్ని చూరుకు వ్రేలాడదీసి వుండుండాలని పోలీసు అనుమానించి, కత్తానే యీ పని చేసి వుంటాడనీ అనుమానించి, అతన్ని అరెస్టు చేసి ఆనక సత్యాన్వేషణ చేస్తున్నారట.

## అమర ప్రేమికుడు!

సేలం జిల్లా [తమిళనాడు] కు చెందిన ముంగిల్‌పాడిలోని వోసినిమాహాలులో ఆపరేటరుగా పనిచేసే సంపత్ అనే వొకతను అదే వూరుకు చెందిన 17 ఏళ్ళ ఆనందిని అనే అమ్మాయిని ప్రేమించి, ప్రేమింపచేసుకున్నాడట. దీనికి ఆమె అన్నగారు రర్ అన్నాసరే ఆనంది నీతన్ని కలవడం మానలేదట. ఇహిదిలా పనికాదని మనిద్దరం లేచిపోయి, ఎంచక్కా పెళ్ళి చేసుకుందామని సంపత్ సలహా యిస్తే దానికామె "ఛి" అన్నదట. దాంతో మనస్సు విరిగిపోయిన సంపత్ సినిమా హాలు క్యాబిన్‌లో కూర్చుని విషం త్రాగి, అక్కడే చనిపోయాట్ట.

ప్రేయసి 'ఛీ' అందికదాని చస్తాననంటా వేమిటి! దేశం గొడ్డు బోయిందా...?



## తొమ్మిది హత్యలు చేసిన కిరాతకుడు!

తనను పనికిమాలినవాడని, జూదగాడనీ, పనికిరాని వెధవఅనీ అవమానించారన్న కోపంతో మద్రాసు విరుగంబాకం పళనియప్ప కాలనీకి చెందిన జయప్రకాష్ అనే వో 22 ఏళ్ళ అతను తన చెల్లెల్ని, చెల్లెలు భర్త నరసింహం (35 ఏళ్ళు) అనే అతన్నీ, అతని యిద్దరు తమ్ముళ్ళను, ఒక తమ్ముడి భార్యను, ముగ్గురు పసికందులను, ఓ పనివాడినీ, వెరసి తొమ్మందుగుర్ని అతి దారుణంగా చంపేశాడట. చెల్లెలింటికివెళ్ళి ఆమెను పిలిచి చేతిలోని దుడ్డుకర్రతో వొకేదెబ్బ ఆమె తలమీద కొట్టాడట. అదే ప్రకారంగా ఆడవాళ్ళిద్దర్నీ చంపి, పిల్లల పీకలు తాళ్ళతో బిగించి, వారిని చంపి, ఆనక తలుపు వెనుక దాక్కుని, లోపలికి వస్తున్న మగవారిని వస్తున్నట్టే తలమీద కొట్టి చంపాడట! ★

# మనిషిలో మరో మనిషి

ఆదూరి సావిత్రి

మేము గాంధీ బజార్లోంచి నెహ్రూ బజారుకు మారాం.

సామానులారీ గంభీరంగా వచ్చి, కొత్త ఇంటిముందు ఆగింది. నేను ముందుగానే వచ్చి పాలు పొంగించాను.

కూలివాళ్లు టకటకా సామానంతా నట్టింట్లో పారేసి, డబ్బు తీసుకుని చక్కా పోయారు.

బుట్టలు, తట్టలు, పక్కచుట్టలు, మంచాలు, ప్యాక్ చేసిన కుర్చీలు. ఇల్లంతా రణరంగంలా ఉంది.

గుండె గుభేలు మంది నాకు. ఇవన్నీ ఎప్పుడు సర్దాలి? చక్కని ఇంట్లోకి మారామనే సంతోషం ఆ క్షణంలో ఆవిరై పోయింది.

"కానీ...కానీ. ఏమిటలా నిలబడ్డావ్? అవన్నీ విప్పి ఇలా పడెయ్యి. కొన్ని నేను సర్దుతాను." అన్నారు మావారు గోపాల్క్రిష్ణ. బతికాంరా నాయనా అనుకుంటూ వీరనారిలా సామాను మధ్యలో జొరబడి ఒక్కొక్కటే తీసి అందించసాగాను. మా బాబు అనిల్, పాప కూడా సాయంచేశారు.. మొత్తానికి ఎంతలాసర్దినా.. నాకు నచ్చేలా ఇంటిని తీర్చి దిద్దటానికి రెండు రోజులు పట్టింది.

ఇల్లు నీటుగా కళకళలాడుతోంది. పదేపదే చూసుకుని మురిసిపోతున్న నా కనుబొమ్మలు ముడిపడ్డాయి. డైనింగ్ టేబుల్ మీద కుప్పగా ఉన్న విడిచినలుంగీ!

"ఎవరూ దీన్నిక్కడ పెట్టింది?" ఓ గావుకేకపెట్టాను.

"అరవకు నేనేపెట్టాను." కూల్‌గా అన్నారు గోపాలకృష్ణ.

"ఇక్కడా పెట్టేది?"

"బట్టలస్టాండు ఇక్కడ పెడితే నీటుగా లేదని, స్టోర్ రూంలో పడేస్తివి అస్తమానం అక్కడిదాకా ఎవడు పోతాడు?"

"ఖర్మ!" అంటూ ఆ లుంగీ పట్టుకెళ్ళి స్టాండు మీద పడేసి వచ్చేసరికి ..తలుపుమీద వేలాడుతున్న తడి తువ్వాలు, డ్రస్సింగ్ టేబుల్ మీద అనిల్ లాగూ, చొక్కా..."ఏ మొచ్చిం దర్రామీకు? ఛ ఛ! ఒక్కళ్ళకీ నీట్ నెస్ లేదు. నా ఒక్కదానికే పట్టింది" విసుక్కుంటూ వాటిని పట్టుకుని మళ్ళీ స్టోర్‌రూంలో కెళ్ళాను

"మమ్మీ నీ చీర, పనిపిల్ల సోఫామీద పడేసింది." నవ్వాపుకుంటూ అన్నాడు అనిల్.

ఇస్సురంటూ నిలబడ్డాను.

నా అవస్థచూసి గోపాలకృష్ణ కూడా కిసుక్కున నవ్వటంతో మండింది నాకు ఇంతెత్తున లేచాను సీమటపాకాయలా పేలుతూ.

"నువ్వూరికే హైరానపడకు." సానుభూతిగా అన్నారాయన.

"నా బొంద, ఆ స్టాండు పుచ్చుకుని ఒక్కొక్కరి వెనకే తిరుగుతుంటాను. విడిచినవి విడిచినట్లు దానిమీద పడెయ్యండి. నేను మోస్తూ ఉంటాను. ఈ టేబుల్ మీదా, తలుపుల మీద వేళ్ళాడబడటంకన్నా అది నయం" ఉక్రోషంగా అన్నాను.

"అదే బెటర్‌లాఉంది. ఏరా అనిల్?"

"యస్ డాడీ. మమ్మీ ఈ కొత్తింట్లో కొచ్చాక... మరీ తినేస్తోందికదూ?" వినయంగా అన్నాడు అనిల్.

వాళ్ళవంక కొరకొరా చూస్తూ అవతలి కెళ్ళిపోయాను.

"మమ్మీ.. అన్నయ్య నా పెన్ను తీసుకుని ఇవ్వటల్లేదూ." ఆరున్నొక్కరాగంతో వచ్చింది పాప.

"అది నా పెన్సిల్ తీసుకుని పారేసింది మమ్మీ." అన్నాడు అనిల్.

నాలో వేడి ఇంకా తగ్గలేదు.

"సిగ్గులేదురా నీకు? చిన్న పిల్లతో నీకు ఒంతా? పెన్సిల్ పారేస్తే వెతుక్కో. అంతేగానీ దాని పెన్ను ఊడలాక్కోటమేంటి?" కోపంగా అన్నాను.

"ఔన్లే. అది ఆడపిల్ల గదూ. నీకు అదంటే ఎక్కువిష్టం,"

"నోర్ముయ్యి. నువ్వు లేనిపోని రాజకీయాలు ప్రవేశపెట్టకు."

"మరేంటీ? చిన్నవాళ్ళైనాసరే.. తప్పు చేస్తే ప్రతిక్రియ చెయ్యాలని నువ్వేగా చెప్పావు? అది నా పెన్సిల్ తీస్తే... ప్రతిక్రియగా దాని పెన్ను తీశాను."

"ఉద్ధరించావ్. అది చిన్నది. నీచెల్లెలు. ఆ అభిమానం ఉందా నీకసలు? అస్తమానం దాన్ని ఏడిపించటం, తిట్టటం అలవాటై పోయింది నీకు."

"అన్యాయం మమ్మీ! దాని మీద నాకు ప్రేమ లేకపోవటమేంటి? తిడితే ప్రేమ లేనట్లా? అలా అయితే... లేచింది మొదలు పడుకునే దాకా దేనికోదానికి నువ్వు నన్ను తిడుతూనే ఉంటావ్. నీకు నామీద ప్రేమ లేనట్లా?"

పేపరు చాటుచేసుకు నవ్వుతున్న గోపాలక్రిష్ణను చూడగానే అరికాలిమంట నెత్తి కెక్కింది నాకు

"వాడంత తలబిరుసుగా మాట్లాడుతుంటే మందలించక.. పైగా నవ్వటమెందుకు?" అన్నాను రోషంగా.

"తలబిరుసేముంది? వాడిలాజిక్కు రీజన్‌బుల్‌గానే ఉంది గదా," అన్నారాయన

"నా బొందలా ఉంది. చిన్నప్పుడు మా అమ్మ, కారణం లేకుండా ఇరగదన్నినా నోరెత్తకుండా పడుండేవాళ్ళం."

"పాపం!"

"అప్పుడు వాళ్ళు పదేసిమంది పిల్లల్నయినా ఈజీగా పెంచగలిగారంటే ..."

'తల్లులకు ఓర్పెక్కువుండేదనుకుంటాను

"సింగినాదం గాదూ. పిల్లలే ఓర్పుగా పడుండేవాళ్ళు. మీ పిల్లల్లాంటి పిల్లలయితేనా."

"మన పిల్లలు" అంటూ కరెక్టు చేశారు.

మేమిలా వాదించుకుంటూ ఉండగానే. మా మానాన మమ్మల్నొదిలేసి, అనిల్,పాపఒకళ్ళ భుజాల మీదొకళ్ళు చేతులేసుకుని స్కూల్ కెళ్ళి పోయారు.

"వాళ్ళు క్షణంలో రాజీపడ్డారు నువ్వు మాత్రం ఇంత సీన్ క్రియేట్ చేసి పారేశావు కోపాన్ని కాస్త అదుపులో పెట్టుకోవాలోయ్ లేకుంటే అది మనిషిని కోతిలా చేసి ఆడిస్తుంది." అని నాకు హితోపదేశం చేసి, కృష్ణుడిలా పోజు పెడుతూ ఆఫీస్ కెళ్ళిపోయారాయన.

గాలి తీసేసిన బెలూన్‌లా కుర్చీలో కూల బడ్డాను. నా దృష్టి టీపాయ్‌మీదున్న పాతకాలపు, చిన్నసైజు ట్రంకుపెట్టెమీద పడింది . .

అది 'మా వారి నాయనమ్మ పెట్టెట. ఆవిడకీమనవడంటే (మావారు) బోల్డంత ప్రేమట

"నాయనా కిష్టుడూ. ఈ పెట్టె మనకి అచ్చివచ్చిందిరా. జాగ్రత్తగా ఉంచుకో. ఇది లక్ష్మీదేవిలాంటి పెట్టె" అని ఈయనకిచ్చిందట.

పొద్దున్నే లేవగానే ఆయన ఆ పెట్టెనే ముందుగా చూస్తారు అది అక్కడ లేకపోతే, పాచి ముఖంతోనే దండకం ప్రారంభించి, ఇంట్లో అందరికీ మతులు పోగొట్టి, ఆంజనేయుడిలా కుప్పిగంతులేస్తూ ఇల్లంతా వెతికి, దాన్ని పట్టుకొచ్చి యధాస్థానంలో పెట్టుకుంటారు.

ఈ విషయంలో ఏ మాత్రం మినహాయింపు లుండవు.

చేతులో అసలు డబ్బులాడని సమయంలో కూడా ఆ పెట్టెలో వెతికితే, కనీసం పాతిక రూపాయలన్నా దొరుకుతాయిట

"నా మొహం ఆ పెట్టెమన్నా డబ్బుల్ని పిల్లల్ని కన్నట్టు కంటుందా? ఎప్పుడైనా మనం ఇంట్లో దాచి, వాటి జోలికిపోకుండా, అవసర మొచ్చినప్పుడు వెతికితే . మనం పెట్టినవే మనకు దొరుకుతాయి

అలా నాటిని బీరువాలో నా చీరలకింద దాచి, మళ్ళీ వెతికితే కూడా అలాగే దొరుకు తాయండీ" అని నేనెంత మొత్తుకున్నా వినరు. ఈ చెవితోనన్నా సొంతంగా వినకుండా, ఆ చెవితో వదిలేస్తారు

అదేం ఖర్మో! ఇంటి కొచ్చిన ప్రతి వాళ్ళ దృష్టి, మిగిలిన అందమైన వస్తువులన్నీ వదిలేసి ఆ పెట్టెమీదే పడుతుంది అప్పుడు నా మొహం . . చూసి తీరాల్సిందేగానీ, మాటల్లో చెప్పటానికి బాగోదు.

"అదంతా నీ భ్రమ" అని కొట్టిపారేస్తా రాయన

నేనా ట్రంకు పెట్టె ఊహల్లో మునిగి ఉండగానే ఒకావిడ గబగబా నా దగ్గర కొచ్చింది.

లేచి నుంచుని ఆమె నాహ్వానించాను.

"మేం ఇంటి ఎదురుగా ఉన్న డాబాలో ఉంటామండీ. నా పేరు వారిజ. ఈరోజు మా పాప పుట్టినరోజు. సాయంత్రం నాలుగింటికి పేరంటానికి రండి." అంటూ కుంకుమ తీసి బొట్టు పెట్టింది.

తప్పకుండా రమ్మని మరీ మరీ చెప్పి వెళ్ళింది.

ఏం ప్రజంటేషన్ తీసికెళ్ళాలి ?

పాప గదా... ఫ్రాక్ తీసుకుంటే ? ఆ పాప వయసెంతో నాకు తెలీదు. ఏ సైజులో తీసుకోవాలి ?

పాతిక రూపాయలు పెట్టి పళ్ళెమూ, ప్లేటూ కాని సైజులో ఉన్న ఓ స్టీల్‌ప్లేటు తెప్పించాను.

సాయంత్రం నాలుగయింది. అయిదయితే గానీ ఆయనా, పిల్లలూ రారు. ఈలోపున వెళ్ళొచ్చేస్తే సరి.

స్నానం చేసొచ్చాను. ఏం చీర కట్టుకోవాలి? బీరువాలో చీరలు లాగి మంచంమీద పడేశాను. చీర నచ్చితే జాకెట్ వెతుక్కోవాలి. జాకెట్ దొరికితే... దానిమీదకు మ్యాచయ్యే చీర నచ్చదు.

చివరికి పసుపుపచ్చని రంగుకు జరీ బోర్డరున్న బెనారస్ ఆర్గండీ చీర సెలెక్టు చేసుకున్నాను...

నాలుగుంబావుకు వారిజా వాళ్ళింటికెళ్ళాను.

పేరంటాళ్ళు ఓ పదిమంది మాత్రమే వచ్చారు. ఆరుగురి చేతిలో ప్రజంటేషన్లున్నాయి. మిగిలిన నలుగురూ ఖాళీగానే వచ్చారు.

"ఇహ ప్రారంభిద్దామా ?" అన్నది నారిజ

"త్వరగా కానివ్వండి. పాపను పిలిచి కూర్చోపెట్టండి. హారతిద్దాం" అన్నారంతా.

వారిజ లోపలికెళ్ళి ఓ ఖాళీడబ్బా, అప్పడాల కర్రా తెచ్చింది. అవెందుకో అర్థంకాలేదు నాకు.

వాటిని కూర్చోపెడుతుందా కుర్చీలో ? !

ఆ కర్రతో డబ్బామీద వాయిస్తూ "ఇవ్వాళ ఏప్రిల్ ఫస్ట్. మా పాప పుట్టినరోజు కాదు ఏంకాదు. మీరంతా బ్రహ్మాండమైన మేకప్‌తో ప్రజంటేషన్స్‌తోసహా వచ్చి ఫూల్సయ్యారు." అంటూ నవ్వసాగింది వారిజ

తెల్లపోయాను. ఆ రోజు ఏప్రిల్ ఫస్టని గుర్తులేదు. అయినా. . ముఖ పరిచయమన్నా లేని నామీద అంత పెద్ద జోక్ వేసినందుకు కాస్త కోపం వచ్చింది. నాకసలే ఉక్రోషం ఎక్కువ...

ప్రజంటేషన్స్ తేని నలుగురికీ ఈ విషయం ముందే తెలుసల్లే ఉంది. వాళ్ళూ నవ్వుతున్నారు.

మిగిలినవాళ్ళు నాలాగే వెర్రిముఖం వేసినా ... వాళ్ళకీ వారిజతో బాగా చనువల్లే ఉంది.

"ఎప్పుడో ఒకసారి నువ్వు మాకు దొరక్కుండా పోతావా ? అప్పుడు నీ సంగతి ఇంతకన్నా బాగా తేలుస్తాం." అంటూ నవ్వేశారు.

నేను సర్రున కుర్చీలోనుంచి లేచాను.

వారిజ ఖంగారుగా నా దగ్గర కొచ్చింది.

"సారీ కల్యాణిగారూ, మిమ్మల్ని చిన్నపరచాలని కాదు. గాడ్ ప్రామిస్, మీతో పరిచయం చేసుకో



వాలనిపించింది. అంతలోనే ఇదీ వచ్చింది. మీరు దీన్ని సీరియస్‌గా తీసుకుంటారేమోనని ఓ పక్క భయపడుతూనే కాస్త సాహసం చేశాను క్షమించి, సరదాగా కలిసిపొండీ, ప్లీజ్'' అన్నది ప్రాధేయపూర్వకంగా

అందరి చూపుల్లోనూ అదే అభ్యర్థన!

ఇంక మొండిగా ఉండలేకపోయాను..

అరగంటలో అందరం కలిసిపోయి సరదాగా గడిపాం. ఆ రకంగా పరిచయమైన వారిజా,నేనూ ప్రతిరోజా కనీసం ఒక్కసారైనా చూసుకోకపోతే ఉండలేనంత క్లోజ్‌గా అయ్యాం

వారిజ భర్త విశ్వప్రసాద్. నేను వెళ్లినప్పుడు ఆయనుంటే వెనక్కొచ్చేసేదాన్ని

ఒక్కొసారి ''పర్వాలేదు ఇంట్లో కెళ్లండి నేను వెళ్లిపోతున్నాను'' చిరునవ్వుతో మర్యాదగా అని వెళ్లిపోయేవాడాయన

మా స్నేహమంతా వారిజకూ నాకూ మధ్యనే, అది మగాళ్ల వరకూ పాకలేదు

* * *

గ్యాస్ అయిపోయింది వంటింట్లో స్టౌతో కుస్తీపడుతున్నా అందులో అది వత్తుల స్టౌకూడా కాదు అగ్గిపుల్ల గీసిపడేస్తే కాసేపట్లో అంటుకోటానికి

పంపుకొట్టాలి... పిన్నుకొట్టాలి. . గాలి తగలకుండా చూడాలి.. ఇంత చేసినా తోకలా ఒక పక్కనే మండుతోందది.

# మనిషిలో మరో మనిషి

''అయిందా కాఫీ?'' అంటూ వచ్చారు గోపాలకృష్ణ.

''ఎక్కడవుతుందీ? ఈ వెధవ స్టౌ అంటుకుచస్తేగదూ?'' అన్నాను విసుగ్గా

''స్టౌ అంటించుకోటానికే నీకంత విసుగ్గా ఉందా! మా నాయనమ్మ కట్టెలపొయ్యిమీద పెట్టేది కాఫీ!''

''మీ తాతగారు మీలా గంట గంటకూ కాఫీ ఇమ్మని వేధించుకు తినేవారుకాదుటావిడని పొద్దున్నే ఒక్కసారి పొయ్యిమీద ఇత్తడి గిన్నెనిండా కాఫీకాచి, రెండు కంచుగ్లాసులనిండా ఇచ్చేస్తే మళ్ళీ తెల్లారి పొద్దుటిదాకా అడిగేవారు కాదట

మీరూ ఓకే అంటే... నేనుకూడా పొద్దున్నే పొయ్యంటించి కాఫీపెట్టి, మీకో గ్లాసెక్కువ... అంటే మూడు కంచుగ్లాసులనిండా ఇస్తాను...'' నా మాటలు పూర్తికాకుండానే అక్కణ్ణుంచి జారుకుంటున్న మావారిని చూస్తుంటే నవ్వాగలేదు.

''కల్యాణీ విజయకుమార్ వచ్చాడు ఇంకో కప్పు కాఫీ ఎగ్‌స్ట్రా పెట్టు'' అన్నారు మావారు హాల్లోనుంచి.

కాఫీ కలిపి, కప్పుల్లో పోసి పట్టుకెళ్ళి వాళ్ళకిచ్చాను.

''హలో, బావున్నారాండీ?'' అన్నాడు విజయకుమార్ మామూలుకన్నా కాస్త సీరియస్‌గా ఉన్నాడాయన.

''ఎవరిమీదన్నా పోట్లాడివచ్చారా?''అన్నాను తమాషాగా

అంతే.

.ఒక్కసారిగా బరస్టయి పోయాడు.

వీక్లీ మడిచి పక్కన పడేశాడు

''నిన్నట్నుంచీ కొళాయి నీళ్ళు రావటల్లేదుగదండీ. ఈ రోజే కరెంటొచ్చింది. మోటారు ఇలా వేశామోలేదో అలాపోయింది కరెంటు

మా పనిపిల్లనో బిందెడు నీళ్ళు తెమ్మని బిందె ఇచ్చాం. నీళ్ళుతెస్తూ మెట్లమీద ధన్‌మని బిందె పగలేసిందది. అది కాస్తా పచ్చడయింది నిన్ననే కొన్నాం స్టీలుబిందె!

''ఏం? కాస్త నిదానంగా తేలేవా? దీని ఖరీదు నీ జీతంలో విరగ్గోస్తాం.'' అన్నది నా మిసెస్.

''ఏటమ్మోవ్? ఇరగ్గోస్తావ్! నీ బిందె కాకుండా...నేనే కిందపడి కాలిరగ్గొట్టుకుంటే... నన్ను గుంటూరట్టుకెళ్ళి వయిద్దెం చేయించి, ఆ కర్చు నువ్వెట్టుకుంటావా? పోతేపోయింది బిందె. నే సల్లగున్నానని నేను మురుస్తున్నా.'' అన్నదది!

''ఎవరండీ వాళ్ళు నమాయకులన్నదీ? డబ్బుకోసం పడి చచ్చేవాళ్ళం మనం. వాళ్ళకెంత

కేర్లెస్‌నెస్సే చూడండి. మనల్ని తినేసి వాళ్లు హాయిగా ఉంటారు ఏ సమస్యాలేకుండా.'' అన్నాడు విజయకుమార్.

''మీరు మరీ అన్యాయంగా మాట్లాడుతున్నారు. మీ దృష్టిలో వాళ్లకే సమస్యలూ లేవా ?'' వాదనకు దిగాను నేను.

''ఉండొచ్చు. కానీ.. వాళ్లు మన మధ్యతరగతి వాళ్ళలా సమస్యల్తో చావరు. ఉంటే తింటారు. లేకుంటే పడుకుంటారు. పస్తుల్ని క్యాజువల్‌గా తీసుకునేలా శరీరానికి శిక్షణనిస్తారు.

తిండి సమస్యే తీసుకుంటే...అది సంపాదించుకోటానికి వాళ్ళకెన్నో మార్గాలున్నాయి. ఏ మార్గంలో పయనించాలన్నా వాళ్లకి వెరుపుండదు.

అదే మధ్యతరగతి వాడైతే...

భేషజం అడ్డొచ్చి ఏ మార్గంలోనూ పోలేడు. ఓ పూట పస్తుండలేడు. ఆకలేస్తే పైకి చెప్పుకోలేడు. అన్నీ సమస్యలే నాడికి.

ఎన్నాళ్ళొచ్చినా ఆడపిల్లకు పెళ్ళి చెయ్యలేక బాధ. తన అసమర్థతకి విసిగి ఆ పిల్ల ఎవడితో నన్నా ఉడాయిస్తుందేమోనని భయం... పిల్లలకు డొనేషన్‌లు కట్టలేక... కట్టి చదివించపోతే, తనలాగా వాళ్ళ స్థితీ అత్తెసరులా ఉంటుందేమో, అది వంశపారంపర్య హక్కయిపోతుందేమోనని దిగులు .

కానుపుల్తో పీనుగులా అయిన భార్యకూ, ముసలి తల్లికీ మందులు కొనలేక బాధ ..

అలా ప్రతిక్షణం ఛస్తూ బతికేది వాడండీ, వీళ్ళకేం రోగం ?'' ఆవేశంగా అన్నాడాయన.

ఆయన ఉక్రోషం చూస్తుంటే నవ్వొస్తోంది నాకు.

ఆయనంతే, తన అభిప్రాయాలే సరైనవనే దృఢ నమ్మకంతో, వాటిని ఎదటి వాళ్ళమీద రాళ్ళవర్షంలా కురిపించేస్తాడు.

''మమ్మీ పాలు పొంగుతున్నాయి. స్టౌ ఆర్పెయ్యనా ?'' అన్నాడు అనిల్.

''బాబోయ్ వద్దు. దానిమీద కుక్కర్ పడేస్తానేకంగా. మళ్ళీ అంటించుకోలేను.'' అంటూ విజయకుమార్ బారినుంచి వంటింట్లోకి పారిపోయాను.

* * *

వారిజ మరో వారపత్రిక తెప్పిస్తుంది. నేను పత్రిక వీక్లీ తెప్పిస్తాను, ఇద్దరం వాటిని మార్చుకుంటూ ఉంటాం. వారిజ పుట్టింటి కెళ్ళింది.

అయినా... విశ్వప్రసాద్ వాళ్ళ ప్యూన్ రాఘవుల్ని పంపి, మా పత్రికలు తీసుకెడుతునే ఉన్నాడు. ఒకసారి...

''అమ్మా, ఇదిగో మీ పత్రిక. మా అయ్యగారిచ్చి రమ్మన్నారు'' అంటూ పత్రిక నా చేతికిచ్చి వెళ్ళిపోయాడు రాఘవులు.

అది తీసుకుని యదాలాపంగా వాళ్ళ ఇంటి వేపు చూశాను. విశ్వప్రసాద్ గుమ్మంలో నిలబడి నన్నే చూస్తున్నాడు.

నేను లోపలికెళ్ళిపోయాను. పనంతా అయ్యాక పడుకుని, తీరికగా పత్రిక తెరిచాను. ఒక చీటీ జారిపడింది. ఏమిటి ? అనుకుంటూ దాన్ని తెరిచాను ... ఆ కాగితాన్ని పట్టుకున్న నా చేతివేళ్ళు గజగజా వణికాయి. చెవిలోంచి వేడి ఆవిర్లు ... రక్తప్రసార వేగం ఒక్కసారి పెరిగిపోయింది ...

అరడజను రైళ్ళు ఏక కాలంలో నా గుండెల్లోంచి పరుగెడుతున్నట్లున్నాయి.

కోపం ... బాధ ... భయం ... ఉక్రోషం ఒకేసారి బుస్సున పొంగాయి.

''కల్యాణీ,

ఈరోజు రాత్రి పదిగంటలకు మా ఇంటికి రండి. తలుపు దగ్గరగా వేసి ఉంచుతాను ప్లీజ్ ! మీ కోసం పరితపించిపోతున్నాను.

మీ

.... ...

ఆ చీటీ ముక్కలుగా చెయ్యబోయి ఆగిపోయాను. ఏమనుకుంటున్నాడు వాడు ? నా గురించి ఏం తెలుసు ? నేనెప్పుడూ వాడితో సరిగ్గా మాట్లాడి కూడా ఎరగను ! ఇంత చీప్‌గా నా గురించి ఎలా ఆలోచించగలిగాడు ?

నా వంక ఎప్పుడూ కన్నెత్తి చూసినట్లయినా కనపడదు. పైకి ఎంతో పెద్ద మనిషిలా ఉంటాడు. మనిషిలో మరుగున ఉండే మృగాన్ని కనుక్కోటం ఎవరితరమూ కాదు.

మనిషిలో ఉండే ... పైకి కనుపించని ఆ మరో మనిషి మంచి మంచివాడు కావచ్చు . . నీచుడు కావచ్చు ...

ఈ చీటీ గోపాలకృష్ణకు చూపిస్తే ?

అమ్మో !

''నువ్వు చనువివ్వకపోతే వాడంత అడ్వాంటేజ్ ఎలా తీసుకుంటాడు ?'' అని తననే బ్లేమ్ చేస్తే ?

ఔను ! ప్రతి మగవాడూ అనే మాట ఇదే ! ఈ చీటీ ఆయనకు చూపిస్తే... చల్లగా సాగుతున్న సంసారంలో చిచ్చురేగుతుందేమో ! చేతులారా చేసుకున్నట్లు కాదూ ?

ఏం చెయ్యాలి ? దీన్ని చించేసి ఏమీ ఎరగనట్లుంటే సరి. వారిజతో స్నేహంకూడా తగ్గించుకుని, వాళ్ళింటి కెళ్ళటం పూర్తిగా మానెయ్యాలి.

కానీ... గాయపడ్డ మనసు అందుకు ఒప్పుకోటల్లేదు. నా పిరికితనాన్ని వాడు ప్రోత్సాహంగా తీసుకుంటే ?

నో ! ఏమైనాసరే. గోపాలకృష్ణకిది చూపించితీరాలి. ఏ శిక్షయినా . ఆయనద్వారా భరించటానికి సిద్ధమే. కిటికీ రెక్క కొద్దిగా తెరిచి, బయటకు చూశాను.

విశ్వప్రసాద్ కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు వాళ్ళ వరండాలో. చూపులిటే ఉన్నాయి.

టక్కున తలుపు మూసేశాను

ఆ సాయంత్రం మామూలుగా, సరదాగా మాట్లాడుతున్న గోపాలక్రిష్ణను చూస్తుంటే... చీటీ చూపించనా వద్దా అనే ద్వైదీభావం మళ్ళీ నన్ను తినెయ్యసాగింది...

''ఏం ? అంత డల్‌గా ఉన్నావ్ ?'' అన్నారాయన.

''ఏం లేదు.'' అన్నాను మామూలుగా ఉండటానికి ప్రయత్నిస్తూ.

రాత్రి ఏడు గంటలయింది...

పైన లైటేసుకు చదువుకోండని చెప్పి, పిల్లల్ని డాబామీదికి పంపి, చీటీ గోపాలక్రిష్ణకిచ్చి... తీర్పుకోసం ఎదురుచూసే ముద్దాయిలా నిలబడ్డాను. గుండెలు దడదడలాడుతున్నాయి.

నేనూహించినట్లు ఆయన నామీద విరుచుకు పడలేదు.

తలెత్తి చూశాను.

రాయిలా కఠినంగా ఉందాయన ముఖం.





# దృఢనిశ్చయం

—బులుసు వేంకటరమణయ్య

ఏదయినా ఒక పనిని సాధించవలెననే సంకల్పం ఉన్నా, దానికి తీరని ఆటంకం కలిగినప్పుడు, ఆ పనిని విడిచిపెట్టడం కానవస్తూ ఉంటుంది. అది మనోదౌర్బల్యాన్ని వెల్లడి చేస్తుంది. దృఢమైన నిశ్చయం కలవారు ఎట్టి గట్టి ఆటంకాలు వచ్చినా నిరుత్సాహపడక ఎన్ని కష్టాలు వచ్చినా నిరుత్సాహపడక ఆ పనిని సాధించియే తీరెదరు.

తన సతీమణి అయిన సతీదేవి యోగాగ్నిని కల్పించుకొని శరీరం విడిచిన పిదప శంకరుడు విరక్తుడై హిమవత్పర్వతంలో ఒకచోట తపస్సులో నిమగ్నుడైనాడు.

ఒకప్పుడు నారద మహర్షి హిమవంతుని వద్దకు వచ్చి, తండ్రి దగ్గర ఉన్న పార్వతిని చూచి ''ఈమె శివునకే భార్య కాగల''దని జోస్యం చెప్పాడు. ఋషి వాక్యం వ్యర్థంకాదని హిమవంతుని నమ్మకం. శివునే వివాహమాడాలని పార్వతీదేవి దృఢనిశ్చయం కాని ఆ మహేశ్వరుడు మన్మధుని భస్మం చేయగా, ఆమె కోరిక నిష్ఫలమయింది. అయినా, ఆమె మనస్సు మార్చుకోలేదు. తపస్సు చేసి, తన సంకల్పాన్ని సాధించాలని, ఆ శివుని గురించి ఘోర తపస్సు చేసింది. ఆకులనైనా ఆహారంగా తీసుకోక తపస్సు చేయడం వల్ల ఆమెకు ''అపర్ణ'' అనే ఖ్యాతి వచ్చింది.

ఆమె తపస్సు మహేశ్వరుణ్ణి సంతృప్తిపరిచింది. ఆమె మనస్సును పరీక్షించదలచి అతడు బ్రహ్మచారి రూపంతో ఆమె ఆశ్రమానికి వచ్చాడు పార్వతి వల్ల ఆతిధ్యం స్వీకరించిన తర్వాత అతడు ఆమెను చూస్తూ ''నీవు గొప్ప అందకత్తెవు. సంపదకు లోటు లేదు. గౌరవానికి లోపం లేదు నీ తపస్సుకు కారణం ఏమిటో చెప్పు'' అని అడిగాడు. ఆమె చెలికత్తె ''ఈమె మహేశ్వరుణ్ణి భర్తగా కోరినది. ఆయన మన్మధుణ్ణి భస్మం చేయడం వల్ల చక్కదనం చూచి, ఆయన తన్ను స్వీకరించడని గ్రహించి, తపస్సు చేసి, ఆ దేవుని మెప్పించదలచినది'' అని చెప్పింది. అప్పుడా బ్రహ్మచారి ''ఈమె శివుణ్ణా కోరింది ? ఆ ముక్కంటి వికారరూపుడు. కట్టుకొనుటకు గుడ్డలు లేక దిగంబరుడై ఉంటాడు. అతని జన్మను గురించి ఎవ్వరికీ తెలియదు. నివాసం శ్మశానం. ఈమె మనస్సు మార్చుకోవడం మంచిది'' అని శివుని నిందించాడు. పార్వతి కోపించి ''మహనీయుల తత్త్వం సామాన్యులకు తెలియదు. మహామహిమ సంపన్నుడగు ఆ దేవుని నిందించిన నీకేకాదు, ఆ నింద విన్న నాకూ పాపం కలుగుతుంది. ఒకవేళ నీవు చెప్పినట్లే ఆయన ఉన్నా, నా మనస్సు ఆయన నుండి మళ్లదు. మాట్లాక ఊరుకో'' అని చెప్పి, తానక్కడనుండి లేచి వెళ్లపోవడానికి సిద్ధపడింది. వెంటనే శివుడు నిజరూపంతో ప్రత్యక్షమై ఆమెకు ఆశ్చర్యం కలిగిస్తూ ''నీవు నీ తపస్సుచే నన్ను కొనివేశావు. నేటి నుండి నేను నీ దాసుడను'' అని నవ్వుతూ అన్నాడు. తర్వాత పార్వతి అతని సతీమణియే కాక అర్ధాంగి కూడా అయింది.

గట్టి పట్టుదల వుంటే మనస్సు చలించదు. అనుకొన్న పని తప్పక నెరవేరుతుంది. ★

## మనిషిలో మరో మనిషి

కళ్లు ఎర్రగా ఉన్నాయి. ఏదో భావాన్ని బలవంతంగా అదిమిపెడుతున్న ఛాయలు...

ఓ పదినిమిషాల తర్వాత లేచి చొక్కా వేసుకుని చెప్పులు తొడుక్కుంటుంటే ''ఎక్కడికి ?'' అన్నాను భయంగా.

''వాడింటికే''

''ఎందుకూ ? అక్కడేదైనా గొడవ జరిగితే... నలుగురూ పోగయితే ... అసహ్యంగా నా పేరు...'' గొంతు కేదో అడ్డం పడ్డట్టు ఆగిపోయాను. కళ్లలో నీళ్ళు తిరిగాయి.

''నీకేం పర్లేదు. ఉండు'' అంటూ నా బుజంతట్టి వెళ్లిపోయారాయన.

కిటికీలో నుంచి చూస్తున్నాను...

గోపాలక్రిష్ణ తలుపు తట్టగానే విశ్వప్రసాద్ తలుపు తీశాడు. ఈయన లోపలికెళ్లారు తలుపులు మూసుకున్నాయి.

అయిదు...పది... పదిహేను నిమిషాలైంది.

ఏంచేస్తున్నారు వాళ్లిద్దరూ లోపల ?

చచ్చేంత టెన్షన్‌గా ఉంది ... మనసేదో కీడును శంకిస్తోంది...ఏడుపొస్తోంది...

అరగంట తరువాత తలుపులు తెరుచుకొని బయట కొచ్చారు గోపాలక్రిష్ణ. విశ్వప్రసాద్ జాడలేదు.

కొంపతీసి...చంపేశారా ? మైగాడ్ !

ఆయన లోపలికి రాగానే ఆత్రంగా అడిగాను

''ఏమయింది ? '' అంటూ.

జేబులో నుంచి చీటీ తీసి చిన్న చిన్న ముక్కలుగాచేసి, డస్ట్ బిన్‌లో పడేసి, చేతులు కడుక్కొచ్చి బెడ్‌మీద కూర్చున్నారు.

''ఏమయిందండీ ? '' మళ్లీ అడిగాను.

''నన్నుచూసి తెల్లపోయాడు. ఈ చీటీ నువ్వు రాసిందేనా ? అన్నాను. అమాంతం నా మీదకు దూకి దాన్ని లాక్కోబోయాడు.

''పిచ్చి వేషాలెయ్యకు. చీరేస్తాను.''అంటూ దాన్ని జేబులోపెట్టుకున్నాను.

అసలే భయంతో సగం చచ్చి ఉన్నాడు నా పర్సనాలిటీ, ఉగ్రస్వరూపం చూసి జంకాడు.

కుర్చీ లాక్కొని కూర్చున్నాను.

''రమ్మన్నావుగా. ఎవరయితే ఏంలే అని నా భార్య బదులు నేనొచ్చాను. నువ్వు చెప్పిన టైంకన్నా ముందే వచ్చాను, నీకోసంగతి చెప్పాలని. ఒక పనిచేద్దాం.

నీ భార్య ఊరినుంచి రాగానే నా దగ్గరకు పంపు. అప్పుడు ఆలోచిద్దాం— అన్నాను.

వాడి ముఖం అవమానంతో ఎర్రబడింది.

ఆ ఉద్రేకంలో...కోపంలో వారిజ గురించి అనరాని మాటే అన్నాను. తన భార్యను పరాయి మగాడు అలా పిలిస్తే ఎంత నరకంగా ఉంటుందో వాడికి చవి చూపించాలనే ఆవేశంలో నా వివేకం కోల్పోయి అలా మాట్లాడాను.

''పరాయివాడి పెళ్ళాం చెట్టున కాసిన పండనుకోకు. చెప్పుతో తన్నిచ్చుకుంటావు. ఈ చీటీ ఫ్రేం కట్టించి పెడతాను. నీ పెళ్ళాం రాగానే దీన్ని ఆవిడకు నీ ప్రతాపానికి చిహ్నంగా చూపించి, ఆ తర్వాత నువ్వెలాంటి నీచుడవో సాక్ష్యంతో సహా అందరికీ వినిపించి ఆ పైన నీ అంతు తేలుస్తాను.'' అని దులిపేసి చక్కా వచ్చాను.

ఆ చీటీ తనకిచ్చెయ్యమనీ, తన భార్యకు చూపించొద్దనీ, పొరపాటయిందని ప్రాధేయ పడ్డాడు.

చీటీ మాత్రం ఛస్తే ఇవ్వనన్నాను.'' అన్నారు గోపాలక్రిష్ణ.

ఆ తెల్లారినుంచీ విశ్వప్రసాద్ మళ్ళీ కనపడలేదు

ముందు సెలవుపెట్టి... ఆ తరవాత ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోయాడు.

సామానుకూడా ఎవర్నో పంపించి తెప్పించుకున్నాడు

చీటీ మా వారికి చూపించి మంచిపని చేశాను అనుకున్నాను. ఛస్తే ఇంకో ఆడదాని జోలికి పోడువాడు.

కానీ...ఆ టైమ్‌లో అందరు మగవాళ్ళూ గోపాలకృష్ణంత వివేకంగా ప్రవర్తించాలి గదా ! ? ! ★

# సినీ టికెట్ రేట్ల పెంపు



ఇదివరకు అందర్నీ సిన్మాకి తీసుకెళ్ళేదాన్ని - ఇప్పుడు నే ఒక్కదాన్నే చూసి... అందరికీ స్టోరీ చెప్తున్నా వొదినా.....!!




సిన్మారేట్లు పెరిగాయని నువ్ మరీ అంత దారుణంగా రేట్లు పెంచేస్తే ఎలా తల్లీ...!!
రచయిత్రి రంగమ్మ
నిర్మాత
క్రైమ్ కథ 70 వే
ఫ్యామిలీ స్టోరీ 1 లక్ష




ఒరేయ్! సినిమా బోరుగా ఉందని మధ్యలో వెళ్ళి పోదామంటే కుదరదు! బోలెడు డబ్బు పోసి కొంటున్నాం.. టికెట్లు...!!
7-00




హలో! సారంగ టాకీసేనా? 'నేలక్లాసు' టికెట్లు ఓ అయిదు తీసి ఉంచండి!! ఫామిలీతో వస్తున్నా!!
ఎమ్వీఆర్




సిన్మాకని తీసుకొచ్చి - ఇలా పోస్టర్లు చూపించి పిల్లల్ని మభ్యపెట్టటం.. ఏం బాగా లేదండి.......
ARUN




డార్లింగ్ - సిన్మాకి తప్ప మరెక్కడికైనా వెళ్దాం చెప్పు.........!!




## టమోటా రైస్

కావలసిన వస్తువులు :—

అరకిలో బియ్యం, పావుకిలో టమోటాలు, కోడిగ్రుడ్లు మూడు, వెల్లుల్లిపాయ ఒకటి, పెద్దఉల్లిపాయ ఒకటి, పచ్చిమిరపకాయలు నాలుగు, 100 గ్రాములు నెయ్యి లేక డాల్డా, పసుపు ఒక టీస్పూన్, ఉప్పు తగినంత.

నూరుకోవలసిన వస్తువులు :—

ధనియాలు టీస్పూన్, జీలకర్ర టీస్పూన్, గసగసాలు టీస్పూన్,వెల్లుల్లి రేఖలు పది,లవంగాలు మూడు, యాలకులు ఐదు, అల్లం కొంచెం.

తయారుచేయు విధానము .—

ముందుగా నూరటానికి చెప్పిన వస్తువులన్ని మెత్తగా నూరాలి. తరువాత బియ్యం కడిగి నీరు లేకుండ ఒంచి, అందులో తగినంత నీరు, టమోట ముక్కలు, ఉప్పు, పసుపు వేసి ఉడికించాలి. ఉడికిన తరువాత చాల్లారబెట్టాలి. మరియొక గిన్నెలో గ్రుడ్లను కొట్టి ఉంచుకోవాలి. వెల్లుల్లి, ఉల్లి, పచ్చిమిర్చి ముక్కలుకోసి ఉంచాలి.

వెడల్పాటి పాత్ర స్టౌమీద వుంచి, డాల్డా వేసి, కాగుచున్నప్పుడు ఉల్లి, వెల్లుల్లి, పచ్చిమిర్చి, ముక్కలు వేసి, దోరగా వేగుచుండగా నూరిన మసాల వేసి, బాగా వేగనిచ్చి, అందులో కొట్టిన గ్రుడ్లను వేసి బాగా వేయించాలి. బాగా వేగిన తరువాత చల్లారిన ,అన్నం వేసి, బాగా కలిపి, ఐదు నిముషములు మగ్గనిచ్చి దించాలి. వేడిమీద వడ్డించుకు తింటె బాగుంటుంది. ఇష్టమున్న వారు జీడిపప్పు వేసికోవచ్చును.

– శ్రీమతి పి. మాధవి

## మసాల ఇడ్లి

కావలసినవి :—

పచ్చిబటాణీలు ఒక కప్పు, ఉల్లిపాయ పెద్దది ఒకటి, కొత్తిమీర ఒక కట్ట, పచ్చిమిరపకాయలు పది, ఇడ్లీపిండి పది కప్పులు.

చేసే విధానం :—

పచ్చిబటాణీలు, ఉల్లిపాయముక్కలను సన్నటి సెగమీద నాలుగు స్పూన్ల నూనె వేసి వేయించుకోవాలి. తర్వాత దించెముందు పచ్చిమిరపకాయ ముక్కలు, సన్నగి తరిగిన కొత్తిమీర వేసి దించుకోవాలి. ఇడ్లీపిండిలో బటాణీల మిశ్రమాన్ని కలుపుకుని ఉప్పు, ఒక చిటికెడు వంటసోడ కలిపి ఇడ్లీలు చేసుకోవాలి. వీటిలోకి నంచుకోను అల్లం చెట్నీ బావుంటుంది. వేడిమీద చాలా రుచిగా ఉంటాయి. వెరైటిగా ఉంటుంది. చేసి చూడండి.

– జె. కృష్ణవేణి

# గతసంవత్సరం అన్నిబట్టలకీ కీ వాడడంద్వారా ఇంట్లోబట్టలు ఉతికేందుకయ్యే ఖర్చులో రూ.100/- పొదుపుచేసాను!

# కీ

## ఇతర పేరెన్నికగన్న డిటర్జెంట్లకన్న 30% తక్కువ ధరలో!






అమిత చర్యగల కీ వేణ్ణీళ్ళలోగానీ, చన్నీళ్ళలోగానీ ఇట్టే కరిగి సమృద్ధిగా నురుగును ఇస్తుంది. బట్టలలో బాగా లోతుకుచేరి మురికిని పూర్తిగా తొలగిస్తుంది.

అమిత తెలుపు చేసే శక్తి గల కీ మీ బట్టలకు తెల్లదనాన్ని, అదనంగా తళతళనూ సమకూరుస్తుంది. దీనిలో అమిత చర్యతో తళతళలాడేలా చేసే పదార్థం ఉండడమే అందుకు కారణం.

అమిత పొదుపు చేసే కీ 40 గ్రా., 200 గ్రా., 500 గ్రా., 1 కె.జి, 2 కె.జి, ప్యాకింగులలో దొరుకుతుంది.

**అమిత చర్య!**
**అమిత తెలుపుదనం!**
**అమిత పొదుపు!**

గోద్రెజ్
ఉత్పాదన

**కీ**
నీలి డిటర్జెంట్ పౌడర్

CHAITRA-G-190TEL

# మృత్యుంజయేశ్వరుడు

భారత దేశంలో అతి ప్రాచీనమైంది, ఎక్కువ ప్రచారంలో ఉన్నది శైవ మతం. భారత చరిత్ర— సంస్కృతీ ప్రారంభకులైన సింధు నదీ నాగరికతా ప్రజలు శైవులని చెప్పడానికి ఆధారాలు లభ్యమైనాయి. 1922 లో జరిగిన త్రవ్వకాలలో పశుపతి, శక్తి బొమ్మలున్న ముద్రికలు, శివలింగాన్ని పోలిన గుండ్రని రాళ్ళు లభ్యమైనాయి. వేద ఆర్యుల కాలంలో త్రిమూర్తి తత్వం ప్రబలి, బ్రహ్మ విష్ణుమూర్తులు ఆరాధింపబడినారు. హిమాలయాలలోని కేదారేశ్వరునితో ప్రారంభించి, రామేశ్వరం వరకు భారత దేశ మంతటా శైవక్షేత్రాలే అధిక సంఖ్యలో ఉన్నాయి. లింగోద్భవ మూర్తిగా, 108 అవతారాలతో త్రిమూర్తులలో పరమశివుడే అధికుడనే భావన ప్రచారంలో ఉంది. కాని ఒక్క ఆంధ్రదేశం మాత్రం ఇప్పటికీ వైష్ణవ కేంద్రంగానే ప్రచారం పొందింది. దీనికి కారణం యాదగిరి లక్ష్మీనరసింహస్వామి, సింహాచలం, అన్నవరం సత్యనారాయణస్వామి, తిరుమల శ్రీ వేంకటేశ్వరాలయం అని చెప్పాలి.

తిరుమలలో వేంచేసిన శ్రీ వేంకటేశ్వరుని మహిమ వల్ల చిత్తూరు జిల్లాలో అనేక శివాలయాలు మరుగుపడినాయి. తొండ మండలం పేరిట ఈ ప్రాంతాన్ని, పల్లవుల తరువాత చోళ రాజులు పాలించినారు. ఈ చోళ మండలంలో ప్రధాన కేంద్రం పుణ్యక్షేత్రాలతో పునీతమైన పుంగనూరు పురుష పుంగవులైన పరశురాముడు ఈ క్షేత్రంలో తపస్సు చేసాడని ఒక భావన పికుల దొరకుమార్తె పుంగమ్మ పేరిట ఈ పూరు పుంగనూరుగా ప్రచారం పొందింది. క్రీ. శ. 733 నుండి 892 వరకు ఈ ప్రాంతం బాణ రాజుల ఆధీనంలో ఉంది. రాష్ట్ర కూటులను, పల్లవ రాజులను ఓడించి చోళరాజులు ఈ ప్రాంతాన్ని తమ అధీనంలోకి తీసుకుని, విస్తృత ప్రాతిపదిక మీద అనేక శివాలయాలు నిర్మించారు తగిన ప్రచారం లేక ఇటువంటి ఆలయాలు ఈ జిల్లాలో మూలపడి ఉన్నాయి. ఈ కోవకు చెందింది చౌడేపల్లి గ్రామంలోని మృత్యుంజయేశ్వర ఆలయం. ఇది చోళ—విజయనగర కళానైపుణ్యానికి సమ్మేళనం.

పరమశివుడు మృత్యుంజయేశ్వరుని పేర చౌడేపల్లి గ్రామంలో పూజలందుకుంటున్నాడు. గ్రామం మారుమూలలో ఉన్నా, చూపరులను ఆలయ ప్రవేశ గోపురం ఇట్టే ఆకర్షిస్తుంది. చౌడేపల్లి పుంగనూరు జమీలోని గ్రామం పుంగనూరు జమీందారు ఇమ్మడి చిక్కరాయలు ఈ ఆలయాన్ని నిర్మించినాడని ప్రతీతి. ఒక వేసవిలో వారు ఆవులపల్లి గ్రామంలో విడిది చేసి ఉండగా, స్వామి కలలో కన్పించి, సమీపంలో శివపార్వతుల విగ్రహాలున్నాయని హెచ్చరించి నారట.

చిక్కరాయలు ఉదయాన ఆ విగ్రహాలను త్రవ్వి వెలికితీసి, పుంగనూరుకు బయలుదేరి, మధ్య మార్గంలో అలసట తీర్చుకున్నాడు. ఆయన చౌడేపల్లిలో విడిది చేసారు ఆ ప్రాంతంలోనే ఆలయాన్ని నిర్మించాలని రాయలవారు సంకల్పించి నారు. కాని అనారోగ్య కారణంగా ధ్వజస్తంభం వరకు ఆలయ నిర్మాణం జరిగింది. పరమేశ్వరుని కటాక్షంతో ఈ స్తంభం నిటారుగా నిలబడిందట. ఆలయ నిర్మాణ సమయంలో చిక్కరాయలు తీవ్ర వ్యాధిగ్రస్తుడుకాగా, స్వామిని ప్రార్థించాడట. పరమశివుని అభయంతో రాయల వారు మృత్యువును జయించినాడు కాబట్టి ఈ ఆలయానికి మృత్యుంజయేశ్వరాలయం అని పేరు వచ్చింది.

ఆలయ ప్రవేశ గోపురం తూర్పుదిశగా ఉంది. ఎత్తుగా ఉండి, చిత్ర, విచిత్రశిల్పాలతో విజయనగర పనితనానికి దీటుగా ఉంది. ప్రవేశ ద్వారానికి ఇరువైపులా అతి రమణీయంగా లతాంగి శిల్పాలు చెక్కబడినాయి. ప్రాకారంలో ప్రవేశించగానే 35 అడుగుల ఎత్తులో ఏకశిలా నిర్మిత ధ్వజస్తంభం కన్పిస్తుంది అధిష్ఠాన భాగంలో నంది, ఢమరుక, గణపతి, త్రిశూల శిల్పాలు ఆకర్షణీయంగా చెక్కబడినాయి సమీపంలో బలిపీఠం పద్మాకారంలో చెక్కబడింది. చక్కని చిన్నటి నంది మండపంలో, తన ఆరాధ్య దైవాన్ని పరికిస్తున్న నందీశ్వరుని విగ్రహం ఉంది నాలుగు స్తంభాలు చోళ రీతిలో మలచ బడినాయి. ప్రాకారంలో మరో ఆకర్షణ కల్యాణ మండపం. స్తంభాలమీది శిల్ప అలంకారాలవల్ల ఇది విజయనగర నిర్మాణమని చెప్పవచ్చు. ప్రవేశ గోపురానికి అతి సమీపంలో భద్రకాళి, వీరభద్రులకు ప్రత్యేక మందిరాలున్నాయి. పరమేశ్వరుని ఉగ్ర స్వరూపానికి ఇవి నిదర్శనాలు. నవగ్రహాలు చేసిన పాపాల ప్రక్షాళనకు తీర్చి దిద్దబడినాయి. గర్భగృహ వెనుక భాగంలో సర్వాంగ సుందరుడు, సర్వాలంకారశోభితుడు అయిన దేవీసహిత సుబ్రహ్మణ్యస్వామి దివ్య మంగళ విగ్రహం ఉంది ఆభరణాలు, అలంకారాలు, అంగాల కూర్పు, మయూర వాహన, ఆరు ముఖాలు, స్కంధుని ప్రత్యేకతను చాటుతున్నాయి. ఈ ఆలయంలో పార్వతీదేవికి ప్రత్యేక మందిరం ఉంది. గర్భగృహ ద్వారాలు తెరవగానే ఎదురుగా ఉన్న అద్దాల మండపంలో, తళుక్కుమని మెరిసి దేవి భక్తుల కోర్కెలుతీర్చే



మృత్యుంజయేశ్వరాలయం
ప్రధాన గర్భగృహం

వరదాయినిగా ప్రత్యక్షం అవుతుంది పసుపు కుంకుమల ప్రదాత పార్వతీదేవి అభయహస్త ముద్రికలో ఉన్న పార్వతీ విగ్రహం భక్తిప్రపత్తులను పెంచే రీతిగా ఉంది ఆలయ ప్రాకారంలోనే వేద వేదాంగాలకు భాష్యం చెప్పిన శివ దక్షిణామూర్తి విగ్రహం ఉంది. జ్ఞాన బోధనకు ఆలయమే నిలయమని భావన. సమభంగ పద్ధతిలో నిలుచున్న వీర భద్రునకు నాలుగు చేతులున్నాయి. బాణం, ధనుస్సు, ఖడ్గంలాంటి ఆయుధాలు ధరించి, చూపరులను భయపెడ్తున్నాడు — ఇది పరమ శివుని రౌద్రాకారం

గర్భగృహంలో పరమేశ్వర లింగం నల్లని గ్రానైట్ రాతిలో మలచబడి, చిరు చీకట్లలో, కాంతిని ప్రసరిస్తూ, భక్తుల కోర్కెలను ఈడేర్చే దివ్యమూర్తిగా ప్రకాశిస్తున్నాడు పానవట్టం మకర ఆకారంలో ఉంది ముఖ మండపంలోని స్తంభాలు విచిత్ర శిల్పాలతో విజయనగర రాజుల పనితనాన్ని గుర్తుకు తెస్తున్నాయి అంతరాళ ప్రవేశ మార్గానికి ఇరువైపులా సర్వలక్షణ సమన్విత ద్వారపాలక శిల్పాలున్నాయి. భక్తుల ఏకాగ్రతను పరీక్షించే రీతిలో ఇవి మలచబడినాయి ప్రాకార గోడపై ఉన్న కుట పంజర, శాల అలంకారాలు, మధ్య భాగంలో సహజత్వం కోసం చెక్కిన జంతు శిల్పాలు చూపరుల దృష్టిని ఆకర్షిస్తాయి ఈ ఆలయంలో 1670, 1671 సంవత్సరాలకు చెందిన రెండు విజయనగర శాసనాలున్నాయి.

మారుమూల ఉన్నా, పరమేశ్వరుని కృపా కటాక్ష వీక్షణాలకు, మృత్యు భయం తొలగి పోవడానికి మృత్యుంజయేశ్వరుని దర్శనం తప్పనిసరి.

— ఆచార్య శ్రీపతివాయుడు ★

# కార్టూన్ల సంకలనం

ARUN

ఎమ్వీకుమార్


















# హైదరాబాదు నోట్‌బుక్

## విశ్వంభర హిందీ అనువాదం ఆవిష్కరణ

మన్‌కా ఆవరణ్ మానవ్
మానవకా ఆచ్ఛాదన్ జగత్
యహీహై విశ్వంభరా తత్త్వ
యహీహై అనంతజీవన సత్య.

ఇవి డాక్టర్ సి. నారాయణరెడ్డి తెలుగు విశ్వంభర కావ్యం హిందీ అనువాదం చివరి పంక్తులు. ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ ప్రొఫెసర్ డాక్టర్ భీమసేన్‌నిర్మల్ చేసిన విశ్వంభర హిందీ అనువాదాన్ని చదివినవారు, మౌలిక రచనే అనుకుంటారుగాని, అనువాద మనుకోరు. మూలంలోని స్వరాన్ని—అంటే శబ్ద సౌందర్యాన్ని కూడ తీసుకొని రావడానికి డాక్టర్ నిర్మల్ ప్రయత్నించి సఫలులయ్యారు. హిందీ భాషా సంప్రదాయానికి, ప్రకృతికి అనుకూలమైన మూలంలోని సంస్కృత శబ్దాలను యథాతథంగా తీసుకొనడానికి డాక్టర్ నిర్మల్ సంకోచించలేదు. ఈ అనువాదాన్ని కలకత్తాలోని భారతీయ కళాపరిషత్తువారు ప్రచురించారు. దీని ఆవిష్కరణ ఫిబ్రవరి 14న ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో జరిగింది. ఆవిష్కరణోత్సవానికి శ్రీ దేవులపల్లి రామానుజ రావు అధ్యక్షత వహించారు. రాష్ట్ర విధాన సభ స్పీకరు శ్రీ తంగి సత్యనారాయణ ప్రారంభించారు. భారతీయ భాషా పరిషత్తు డైరెక్టర్ డాక్టర్ ప్రభాకర్ మాచ్వే స్వాగతం చెబుతూ, తమ పరిషత్తు భారతీయ భాషల ఆదాన ప్రదానాల కోసం ప్రయత్నిస్తున్నదని, నూరుగురు భారతీయ భాషా కవుల ఒక్కొక్క కవితతో శతదల్ అనే పద్య సంకలనం ప్రచురించామని అన్నారు. భారతీయ భాషల నూరు నవలల సంగ్రహాలతో "భారతీయ భాషా ఓంకేసౌ ఉపన్యాస్" అనే గ్రంథం ప్రచురిస్తున్నామని అన్నారు. ఇతర భాషల ఉత్కృష్ట గ్రంథాల్ని హిందీద్వారా అందరికీ అందుబాటులో వుండేట్టు చేయడం తమ ఉద్దేశమని మాచ్వే అన్నారు. మూల రచయితకు భిల్వాడా బహుమతి పదకొండువేల రూపాయలు డాక్టర్ నారాయణ రెడ్డికి అందజేశారు. ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు కావ్యాన్ని ఆవిష్కరిస్తూ, కవిలో పరమాత్ముని దృష్టి ప్రతిబింబిస్తుంది కాబట్టి, అతడు అన్నిటికీ అతీతమైన మహోత్కృష్ట రచనను సృష్టించి ప్రజాజీవితాన్ని ఆదర్శాన్ని ఒదిగించగలదని, ప్రజలలో రాజకీయాలకు అతీతంగా నిస్స్వార్థమైన సేవ చేయడానికి ప్రేరేపించగలదని అన్నారు. పిదప విశ్వంభర కావ్యకర్త డాక్టర్ నారాయణరెడ్డి ప్రసంగిస్తూ, మనరాష్ట్రంలోని తెలుగు మాతృభాష కానివారు తెలుగును నేర్వాలన్నారు. ఆంధ్రులకు స్వాభిమానం ఉందిగాని, దురభిమానం లేదని, ఇతర భాషల పట్ల అభిమానం వుందనడానికి ముఖ్యమంత్రి హిందీ ప్రసంగమే నిదర్శనమని అన్నారు. అన్నట్టు మరచాను; ముఖ్యమంత్రి మొదట తెలుగులో పదినిమిషాలు ప్రసంగించి, పిదప హిందీలో పదిహేను నిమిషాలు ప్రసంగించారు. డాక్టర్ నారాయణరెడ్డి తమ ప్రసంగంలో అనువాదం గురించి కాని, అనువాదకుని గురించి కాని ఒక్కమాట కూడ మాట్లాడకపోవడం నాకు విషాదాశ్చర్యాలు కలిగించింది. శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి, ప్రొఫెసర్ శ్రీరాం శర్మ, డాక్టర్ విష్ణుస్వరూప్ కావ్యప్రశస్త్యాన్ని గురించి, అనువాద వైశిష్ట్యాన్ని గురించి ప్రసంగించారు. అనువాదకులు డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ తమ ప్రసంగంలో అనువాదం చేసినప్పుడు కలిగిన ఇబ్బందులను, వాటిని అధిగమించిన తీరును వివరించారు. దక్షిణాంచలీయ సాహిత్యసమితి కార్యదర్శి డాక్టర్ కుట్టన్‌పిళ్ళే ధన్యవాదాలతో ఆవిష్కరణోత్సవం సమాప్తమైంది

ఇటీవల ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సహకార సంస్థ నిర్వహించిన నాటిక పోటీలలో ఉత్తమ ప్రతి నాయకుడుగా ఎన్నికైన శ్రీ వి.డి.ఎస్. రాజుకి సంస్థ అధ్యక్షుడు శ్రీ ధూళిపాళ వీరయ్య చౌదరి మొమెంటో అందజేస్తున్న దృశ్యం.



## జానపద సాహిత్యం కృతి సమర్పణ.

వంశీ ఆర్ట్స్ థియేటర్స్ ఆధ్వర్యంలో ఫిబ్రవరి 27న త్యాగరాజ గానసభలో శ్రీ ఎల్లోరా రచించిన జాన సాహిత్యం అనే గ్రంథం కృతి సమర్పణ, వ్యూస్ అండ్ రివ్యూస్ ఆన్ ఎల్లోరాస్ వర్క్స్ అనే విమర్శ గ్రంథం ఆవిష్కరణ జరిగాయి. అధ్యక్షత వహించిన డాక్టర్ సి. నారాయణరెడ్డి తమ ప్రసంగంలో శ్రీ ఎల్లోరా కృషి తపస్సు లాంటిదని, ఆయన వివిధరంగాలలో సాధించిన అనుభవసారం ఈ గ్రంథమని, ఆయన జానపద విజ్ఞాన సర్వస్వ నిర్మాణం చేపట్టాలని అన్నారు. జానపద సాహిత్యం గ్రంథం డి. లిట్. సంపాదించి పెట్టగల పరిశోధన గౌరవం గల గ్రంథమని డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు, జానపద సాహిత్యాన్ని పాఠ్యాంశాలుగా పెట్టాలని డా. పప్పు వేణుగోపాల్ (మద్రాసు), జానపదులు నిజమైన జ్ఞానపదులని డాక్టర్ ఉండేలు మాలకొండారెడ్డి, జానపదం సర్వవేళలా జ్ఞానపదమని, ఈ గ్రంథం జానపద సాహిత్యానికే సన్మానం వంటిదని, పాఠ్యగ్రంథం కావలసిన విశేష విజ్ఞానం కలదని డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ అన్నారు. మద్రాసు ప్రముఖ వాణిజ్య పారిశ్రామికవేత్త, శతాధిక వాణిజ్య, పారిశ్రామిక, సాంస్కృతిక ఆధ్యాత్మిక సంస్థలతో వివిధ పదవులతో సంబంధం వున్న శ్రీ బి.వి.ఎస్. మణికి శ్రీ ఎల్లోరా అంకితమిచ్చారు. శ్రీ ఎల్లోరా సహోదరులు శ్రీ గొడవర్తి శ్రీరామమూర్తి శ్రీ ఎల్లోరాను ఆశీర్వదిస్తూ, శ్రీ మణిని నూతన వస్త్రాలతో సత్కరించారు. శ్రీ ఎల్లోరా కృతజ్ఞతలు తెలుపుతూ, తన నిశ్శబ్ద సాహిత్య సేవకు సహృదయుల సహకారం వుండాలని కోరారు. వంశీ అధ్యక్షుడు శ్రీ జె. రాజారావు ప్రారంభంలో స్వాగతం చెప్పారు. సభా ప్రారంభంలో డాక్టర్ నటరాజరామకృష్ణ, శ్రీమతి విజయదుర్గల శిష్యురాలు కుమారి వత్సవేంద్ర కుమారి తూర్పు ప్రాంతం భామాకలాపం మున్నగు నృత్యాలు ప్రదర్శించి ప్రేక్షకులను ఆనందపరచారు

## ఉపశ్రుతి :

ఏం కవిగారూ, చెప్పాచెయ్యాకుండా అంత త్వరగా ఆ పార్టీనుంచి ఈ పార్టీకి దూకారే ?— అనడిగాను ఇటీవల పార్టీ ఫిరాయించిన నా కవి మిత్రుణ్ణి. జీర్ణవస్త్రాలు వదలి నూతన వస్త్రాలు ధరించినట్టు జన్మలే మారుతాయని కృష్ణపరమాత్మ అన్నప్పుడు, పార్టీ ఫిరాయించడం ఏ పాటిది ? ఇంతకూ మార్పు చైతన్య లక్షణం కదా ! — అన్నారు కవిమిత్రులు.

— తిరుమల రామచంద్ర ★

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరి వరశివాభ్యాంనమః

# ఆంధ్రపత్రిక





# రక్తాక్షినామసంవత్సరపూర్ణశాస్త్రీయపంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,
'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణించబడినది

## పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో వెలువడినది

ప్రతులకు స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటును సంప్రదించండి.
లేదా మా కార్యాలయానికి వ్రాయండి.

విడిప్రతి వెల:- రూ. **4-00**. రిజిస్టర్డు బుక్ పోస్టు రు. **7-50**

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధినగరం, విజయవాడ - 3

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# రచయితలకు గమనికలు

★ ఆంధ్ర పత్రిక వారపత్రికకు కథలూ యితర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర పత్రిక వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొ నడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి— హామీపత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తరప్రత్యుత్త రాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయ వలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివ రంగా వ్రాయండే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూనులు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తర్వుల దాడి చెయ్యకూడదు... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగు తుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను— కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు.

సం॥

---

# ఉత్తరాలు

[ 4వ పేజీ తరువాయి]

## జంతు హింస

2–3–84 సంచికలో డా. గుమ్మనూరు రమేష్‌బాబుగారి 'జంతు హింస' వ్యాసం హృదయాన్ని కదిలించి కరిగించింది. ఈ వ్యాసం చదివిన పరిశోధకులలో యే కొంతమందిలోనైనా తప్పక మార్పు వస్తుందని ఆశిస్తున్నాను. జంతువుల గురించీ, పరిశోధనలలో నిత్యం బలయిపోతున్న వాటి సంఖ్య గురించి ఎంతో మందికి తెలియని ఎన్నో విషయాల్ని చక్కగా వివరించిన రమేష్‌బాబుగారికి హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

జె. యస్. పి. సాయిబాబు, భట్టిప్రోలు.

*　　*　　*

సాధారణంగా జీవహింస నెవ్వరూ హర్షించరు! అయితే 2–3–84 సంచికలో 'పరిశోధనల పేరిట జంతుహింస' అన్న వ్యాసాన్ని కూడా పూర్తిగా హర్షించలేము. వాక్సిన్ పరీక్షలు ముందుగా చేయించుకోడానికి రమ్మంటే ఈ వ్యాసకర్తే కాదు — ఎవ్వరూ ముందుకు రాలేరు. ప్రజల ఆహారవసరాల నిమిత్తము వినియోగిస్తున్న వేలాది జీవాల మాటేమిటి? జంతుహింస పేరిట పోలియో, కలరావంటి వ్యాధులకు మానవజాతి సమూలంగా నాశనం కావటమే రచయిత ఉద్దేశ్యమైతే ఆ తప్పు ఆయనిది కాదు — పి. హెచ్. డీది. రచయిత పి. హెచ్. డి. సంపాదించడానికి ఖర్చయిన నత్తల గురించి బాధపడే ముందు—యిన్నాళ్ళుగా యజ్ఞయాగాదుల పేరిట బలిపశువుని, మతాలు మహత్యాల పేరిట నరబలులు, జాతర్లలో జంతు బలులు గురించి ఒక్కక్షణం ఆలోచిస్తే ఆ పి. హెచ్. డికి అర్థముంటుంది.

చక్రధర్, అంబాజీపేట.

## క్యాప్షన్‌లెస్ కార్టూన్ల ప్రదర్శన

ఉగాదికి జంటనగరాలలో ఆంధ్రప్రదేశ్ కార్టూనిస్టుల అసోసియేషన్ ఆధ్వర్యంలో క్యాప్షన్‌లెస్ కార్టూన్ల ఎగ్జిబిషన్ నిర్వహించ బడుతుంది. దీనికోసమై కార్టూనిస్టులు 2 కార్టూన్లను 9×12'' సైజులో గీసి తమ పాస్‌పోర్ట్ సైజు ఫోటోతోపాటు ఈ మార్చి 28వ తేదీలోగా పంపుకోవాలి అని కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ కార్టూనిస్టుల అసోసియేషన్, 1–63, హైదర్‌నగర్, కుకట్‌పల్లి పోస్ట్, హైదరాబాదు—500872 తెలియచేస్తున్నారు.

---

Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
Editor S Radhakrishna

వారపత్రికలకు

ఒరవడి దిద్దిన

# ఆంధ్రపత్రిక

సంస్థ నుంచి వెలువడే

నవ వనితా సచిత్ర పక్ష పత్రిక

# కలువబాల

త్వరలో ఆఫ్‌సెట్ ముద్రణతో 1/2 డెమ్మి సైజులో, 24 పేజీలకు తగ్గకుండా, ఆలోచింపచేసే రచనలతో పక్షం - పక్షం మీ ముందుకు రాబోతున్నది.

# ఈ ఉగాది పండుగతో శుభారంభం చేయండి

ఆకర్షణీయమైన రంగుల్లో, ప్రకృతి ఉట్టిపడే సుందరమైన డిజైనులలో సంప్రదాయానికి అద్దంపట్టే అందమైన ఆప్కో వస్త్రాలు మిమ్మలను ముగ్ధులను చేస్తాయి. ఆప్కో వస్త్రాల విస్తృత శ్రేణి- షర్టింగులు, డ్రెస్-మెటీరియల్స్, చీరలు, తయారీ-దుస్తులు మరియు గృహోపకరణ-వస్త్రాలు.




**చేనేతలు**

**20%** రిబేటు 24-3-'84 నుండి 31-3-'84 వరకు




ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోపరేటివ్ సొసైటి లిమిటెడ్
హైదరాబాద్-500 029